


# విశ్వకర్మ విశిష్టత

## పఞ్చ మహా యజ్ఞములు


సంకలన కర్త

నంచర్ల వేంకట రామాచారి



ప్రకాశకులు

నంచర్ల సావిత్రమ్మ

మహాలక్ష్మమ్మ – నరసయ్యాచార్య
స్మారక గ్రంథమాల

మహాలక్ష్మమ్మ- నరసయ్యాచార్య స్మారక గ్రంథమాల 4.

ప్రథమ ముద్రణ

ప్రతులు : ౧౦౦౦

వృష నామ సంవత్సర "ఉగాది"

సృష్టి సం: ౧,౯౭,౨౯,౪౯,౧౦౨.

కలియుగ సం : ౫౧౦౨.
26 మార్చి 2001



గ్రంథకర్త జనని
**కీ.శే. మహాలక్ష్మమ్మ**



మూల్యము : రూ. 45/-

ప్రాప్తిస్థానము:
1. **నంచర్ల సావిత్రమ్మ**
C/O వెగ్గళం వీరబ్రహ్మాచారి,
పోలంపల్లి (పోస్టు)
వత్సవాయి మండలం, కృష్ణాజిల్లా - 521402

2. **వేదశర్మ**. ఫోన్ నెం: 4124548
ఇం.సం. 6-2-196/15, ప్లాట్ నెం. 15, యల్.ఐ.జి. ఫస్ట్‌ఫేస్, షాపింగ్ కాంప్లెక్స్, వనస్థలిపురం, హైదరాబాద్ - 500 070

**టైప్ సెట్టింగ్** : సుహాస్ ప్రింట్ మీడియా, విద్యానగర్, హైదరాబాద్, ఫోన్: 040-7679213

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ"

"మాతృ దేవో భవ" "పితృ దేవో భవ" "ఆచార్య దేవో భవ"

# కృతి సమర్పణ

పితృ ఋణ విమోచనార్థము
ప్రాత: స్మరణీయులు,
పూజ్యులు,
పితృదేవులైన

కీ.శే. మహాలక్ష్మమ్మ - నరసయ్యాచార్య వర్యులకు

గురుదేవులైన

కీ.శే. శ్రీ॥ కాందూరి తిరువెంగళాచార్యులు గారికి
కీ.శే. బ్ర॥ చామర్తి అమరేశ్వర శర్మ గారికి
భక్త్యంజలితో
సమర్పితము

- నంచర్ల వేంకట రామాచారి

...



గ్రంథ కర్త

**నంచర్ల వెంకట రామాచారి**

జననీ జనకులు : మహాలక్ష్మమ్మ - నరసయ్యాచార్య

సతీమణి : సావిత్రమ్మ

గోత్రము : మామన్య బ్రహ్మర్షి గోత్రము

సూత్రము : ఆశ్వలాయన సూత్రము

ప్రవర : శ్రీమను -మృత్యుంజయ- విరూపాక్ష- సభ్యర్షి- ధీబల-పఞ్చార్షేయ ప్రవర

శాఖ : ఋక్ శాఖ

జన్మస్థానము : మోటమఱ్ఱి, బోనకల్లు మండలం, మధిర తాలూకా, ఖమ్మం జిల్లా

నివాస స్థలము : ఇం.సం. 6-2-196/15, ప్లాట్ నెం. 15, యల్.ఐ.జి. ఫస్ట్‌ఫేస్, షాపింగ్ కాంప్లెక్స్, వనస్థలిపురం, హైదరాబాద్ - 500 070

వృత్తి : ఉపాధ్యాయ

అభిరుచులు : వైదిక ధర్మ ప్రచారం, యోగాభ్యాసం, సంఘసేవ, వేదములు, దర్శనములు, ఉపనిషత్తులు ఇత్యాది వైదిక వాఙ్మయ గ్రంథ పఠనము

ఫోన్ : 4124548

Dr. MASANA CHENNAPPA
M.A.,M.Phil.Ph.D.
**Associate Professor of Telugu**
**University College of Arts & Social Sciences**
Osmania University, Hyderabad - 500 007



Phones : (R) 7078508
(O) 7018951, Ext. 294
**Residence:** 12-11-1095/A,
Bouddha Nagar, Warasiguda,
Secunderabad - 500 061 (A.P.)

# విశ్వకర్మ పరమేశ్వరుడు

సృష్టికర్త ఐన పరమేశ్వరుని పేర్లు సార్థకమైనవి. కొన్ని పేర్లు కర్మలను తెలిపేవి కాగా మరికొన్ని పేర్లు స్వభావాన్ని తెలిపేవి. ఇంకాకొన్ని గుణాలను తెలిపేవి. ఉదాహరణకు సృష్టికర్తృత్వం పరమేశ్వరుని కర్మ కనుక అతడు **'సవిత'** అని, రక్షించడం అతని స్వభావం కనుక 'ఓ౩మ్' అని, స్వయం ప్రకాశకత్వం అతని గుణం కనుక **'అగ్ని'** అని పిలవబడుతున్నాడు.

ఇట్లే **'విశ్వకర్మ'** అనే పేరు సకలకర్మలకు ఆధారుడనే అర్థాన్ని తెలియజేస్తుంది. కేవలం ఈ అర్థాన్ని మాత్రమే తెలియజెప్పడం ఈ గ్రంథం ముఖ్యోద్దేశం కాదు. విశ్వకర్మ పేరుతో వ్యవహరింపబడే పరమేశ్వరుని యధార్థ తత్త్వాన్ని ఆవిష్కరింపజేయడమే దీని పరమోద్దేశం.

లోకంలో పరమేశ్వరుణ్ణి రకరకాలపేర్లతో ఆరాధిస్తున్నాం. కాని ఆపేర్ల అంతరార్థాన్ని శాస్త్రీయంగా తెలుసుకోలేక పోతున్నాం. ఉదాహరణకు **'విశ్వకర్మ'** అనే పేరు కూడా అలాంటిదే. బ్రహ్మశ్రీ నంచర్ల వేంకటరామాచారి గారు వేదాధ్యయనశీలురు. ఋత్విజులు. కనుకనే ఈ గ్రంథంలో విశ్వకర్మ శబ్దార్థాన్ని తెలియజేయడానికి వేదవేదాంగాల నుంచి ప్రమాణాలను చూపినారు. విశ్వకర్మ విశిష్టతను లోకానికి తెలియపరచినారు. మనచేత ఉపాసింపబడే విశ్వకర్మ సృష్టికర్త అని, పరమేశ్వరుడని, సర్వజ్ఞుడు సర్వశక్తిమంతుడని, స్వయం ప్రకాశకుడని, సర్వ వ్యాపకుడని నాల్గువేదాలనుంచి అనేక మంత్రాల ఆధారంగా నిరూపించినారు. ఇదొక విధంగా వైదిక పద్ధతిని అనుసరించి సాగిన పరిశోధన అని చెప్పాలి.

ఇట్లే సృష్టికర్త ఐన విశ్వకర్మ వేరు, అంగిర వంశజుడు, మంత్రార్థ ద్రష్ట, భువన పుత్రుడైన విశ్వకర్మ వేరు అన్న విషయాన్ని ఆధారాలతో రచయిత సప్రమాణంగా వివరించినారు. విశ్వకర్మ విషయంలో మనకున్న భ్రమలను, తొలగించినారు.

పరమేశ్వరుడు మంత్ర స్రష్ట, ఋషులు మంత్ర ద్రష్టలు, ఋషులను మంత్రకర్తలుగా చెప్పరాదు. లోకంలో విశ్వకర్మలుగా వ్యవహరింప బడేవారు. భువనపుత్రుడైన విశ్వకర్మ ఋషి సంతతికి చెందినవారు. విరాట్ స్వరూపుడు, సృష్టికర్త ఐన విశ్వకర్మ పరమేశ్వరుణ్ణే ఆరాధించాలన్న గ్రంథకర్త అభిప్రాయం ఎల్లరకు శిరోధార్యం.

శ్రీ నంచర్ల వారు వైదిక పురోహితులు. సంఘంలో విశ్వకర్మ పేర జరుగుతున్న పూజావిధానాన్ని గమనించి, వేదోక్త పరమపురుషుడైన విశ్వకర్మ విశిష్టతను తెలియజేసినారు.

వైదిక పథం నుంచి వైదొలగిన మనల్ని తిరిగి వైదిక పథ గాముల్ని చేయడమే ఈ గ్రంథ కర్త ప్రథమ లక్ష్యంగా కనిపిస్తున్నది. అది ఈ రచన ద్వారా నెరవేరిందనే భావిస్తున్నాను.

విశ్వకర్మలుగా నేడు పిలవబడుతున్నవారు మౌలికంగా శూద్రులు కారనీ, వైదిక సిద్ధాంతం ప్రకారం అగ్న్యాధానాధికారం వారికుందనీ, శిల్పకర్మను అధ్యయనం చేసి, దానికి క్రియాత్మక రూపాన్ని ఇవ్వడం బ్రాహ్మణ లక్షణం కనుక శిల్పకర్మ బ్రాహ్మణ కర్మ అనీ, ఆ కారణంగా విశ్వకర్మలు విశ్వబ్రాహ్మణులనీ, విశ్వకర్మల పేర్ల చివర గల ఆచార్య శబ్దం ఈ విషయాన్ని ధ్రువ పరుస్తుందని శ్రీ నంచర్ల వారు చేసిన ప్రతి పాదన సత్యసమ్మతమైందనీ నేను భావిస్తున్నాను. విశ్వబ్రాహ్మణులను తిరిగి వైదిక సాంస్కృతిక జీవనంలోకి ఆహ్వానించడమే రచయిత ముఖ్యోద్దేశం. విశ్వకర్మలలో అలముకొన్న న్యూనతా భావాన్ని పోగొట్టడానికి రచయిత చేసిన కృషి ప్రశంసనీయమైంది.

నిజానికి వర్ణవ్యవస్థ స్వరూపాన్ని తెలుసుకోకపోవడం వల్లనే కులం, జాతి ఏర్పడి వ్యవస్థ క్రమంగా అవస్థల పాలైంది. ఏనాటికైనా కులాలను నిర్మూలించి మానవజాతిని ఏకీకృతం చేసే వ్యవస్థ వర్ణానిదే. అభ్యుదయానికి అడ్డుగోడగా నిలిచిన కులాన్ని కాదని, ఆచార్యత్వాన్ని పునఃప్రతిష్ఠించుకొనే విషయంలో జాగరూకత వహించాల్సిన తక్షణ అవసరాన్ని ఈ గ్రంథం గుర్తు చేస్తుంది.

ఋషి ఐనవాడే కవి. అలాగే పూర్వం రాజులు, చక్రవర్తులు కూడా ఋషులైనవారే. ఉదాహరణకు జనకుడు చక్రవర్తి, ఋషి కూడా. అలాగే భువనపుత్ర విశ్వకర్మ చక్రవర్తి కూడా మహర్షియే. కనుకనే అతడు వేదానుకూలమైన రాజ్యప్రణాళికను ప్రప్రథమంగా నిర్మించగలిగినాడు.

మన మీనాడు వేదాన్ని విడిచిపెట్టి వేదనకు లోనయ్యాం. ఆత్మ జ్ఞానాన్ని విడిచి ఆత్మ న్యూనతాభావానికి లోనయ్యాం. అవైదిక కార్యకలాపాలతో జీవితాన్ని దుర్భరం చేసుకొన్నాం. ఇలాంటి సందర్భంలో సంస్కరణ దృక్పథం గల ఒక రచయిత ద్వారా వెలువడుతున్న విశిష్టమైన రచన **'విశ్వకర్మ విశిష్టత'**.

ఈ గ్రంథం ద్వారా పరమేశ్వరుని స్వరూపాన్ని సమగ్రంగా తెలియచేయడమే గాక నాలుగు వేదాల నుంచి విశ్వకర్మ సూక్త మంత్రాలను కూడా ఇచ్చి ఉపాసకులకు మహోపకారం చేసినారు శ్రీ నంచర్ల వారు. వాస్తు తత్వవేత్త, సదాచార సంపన్నులు, స్వాధ్యాయవ్రతులు శ్రీ నంచర్ల వేంకట రామాచార్యులు గారిని ఈ సందర్భంగా ఆత్మీయతా పూర్వక స్నేహాంజలులర్పిస్తూ అభినందిస్తున్నాను.

**- డా॥ మనస చెన్నప్ప**

**హైదరాబాద్**

# పీఠిక

విద్వాన్ శ్రీ నంచర్ల వేంకటరామాచార్యులు గారు **"విశ్వకర్మ విశిష్టత మరియు పంచ మహా యజ్ఞములు"** అను విశిష్ట గ్రంథమును రచించి తెలుగు భాషామ తల్లి మణిమయ కంఠహారమున మరొక ఆణిముత్యమును చేర్చినారు. ఈ గ్రంథమున విశ్వకర్మ లిరువురున్నారని, అందు జగత్ సృష్టి, స్థితి, లయ, కర్త, సర్వవ్యాపకుడు, సర్వాదారుడు, సర్వశక్తివంతుడు, నిరాకారుడు, సర్వ సుఖప్రదాత, ముక్తిదాత అయిన పరమేశ్వరు డగు విశ్వకర్మ ఒకరు, ఆదిమ శిల్ప విద్యా ప్రవర్తకు డగు భువన పుత్ర విశ్వకర్మ మరొకరని వివరించడం జరిగింది.

శిల్ప విద్యా ప్రవర్తకుడైన ఈ భువన పుత్ర విశ్వకర్మ సృష్ట్యాదిలో పరమేశ్వర ప్రసాదితమైన అథర్వవేదమును మొదట ధారణ చేసిన అంగిరస మహర్షి వంశజుడు. ఇతడు అంగిరస మహర్షి పుత్రులు ఏడుగురిలో ఆప్త్యుని సంతానమైన భువన మహర్షి పుత్రుడు భౌవన విశ్వకర్మ ఋగ్వేదాదులలో ద్రష్టగా చూడబడుచున్నాడు.

భువన ఋషి పుత్రుడైన విశ్వకర్మ శిల్ప విద్యను అయిదు విభాగములుగా చేసి, తన అయిదుగురు శిష్యులను అనగా సానగుని **'లోహ (ఇనుప)'** శిల్పమందును, సనాతనుని **'దారు (కఱ్ఱ)'** వస్తు నిర్మాణ శిల్ప మందును, అహభువనుని **'రాగి, ఇత్తడి, కంచు** మొ॥ ధాతువుల శిల్పము నందును, ప్రత్నను **'శిలా'** శిల్పమందును, సుపర్ణుని 'స్వర్ణ' శిల్ప మందును ప్రవీణలు గావించి వీరికి వరుసగా మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞ లను నామములతో అధిపతులుగా నుంచెను.

పంచ విధ విశ్వకర్మలు - శిల్పులు తమ శిల్ప విద్య ద్వారా భూ, జల, ఆకాశ మార్గములలో పయనించుట కనువగు రథ, నౌక, విమానాది వాహనములను నిర్మించుచున్నారనియు, లోహ - ఇనుప పనిముట్లు చేయుట ద్వారాను, కఱ్ఱతో పలు వస్తువులను నిర్మించుట ద్వారాను, బంగారం, వెండి, రాగి, ఇత్తడి, కంచు మొ॥ ధాతువులతో ఆభరణములను, వివిధ వస్తువులను తయారు చేయుట ద్వారాను వారు సంఘమునకెంతో ఉపకరించుచున్నా రని, వారిని గౌరవించుట సత్కరించుట మనకు తగునని నుడివిరి. ఈ శిల్ప నిర్మాణ ప్రవర్తకులు బ్రాహ్మణ వర్ణమునకు చెందిన వారగుటకు తగిన ప్రమాణములను శ్రీ వేంకట రామాచార్యులు గారు ఇందు ఉదాహరించిరి.

ఇందు నిత్యము వైదికు లాచరించవలసిన పంచమహా యజ్ఞములను చేర్చి స్వయముగా వీనిని తమ తమ గృహములలో గృహస్థులాచరించుకొనుటకు వీలును కల్పించిరి.

ఇంతేగాక నాలుగు వేదముల నుండి విశ్వకర్మ సూక్తమునకు సంబంధించిన 50 మంత్రములను ప్రతి పదార్థ సహితముగా వ్రాసి విశ్వకర్మ మహాయజ్ఞమును పర్వదినము

నందు సల్పుటకు శ్రీ వేంకట రామాచార్యులు గారు ఎంతగానో శ్రమించారు. ఈ గ్రంథము సర్వులకు ఉపకరించుననుటలో సందేహము లేదు.

**'న తస్య ప్రతిమా ఉ అస్తి'** అను యజుర్వేద మంత్రము నుదహరించి సృష్టి స్థితి లయ కారుడైన విశ్వకర్మ పరమేశ్వరునికి మూర్తి - ఆకారము, ప్రతిమ లేదని ప్రమాణ బద్ధముగా వివరించిరి.

ఇట్లు
బుధజన విధేయుడు, చలవాది సోమయ్య, యం.ఎ.
వైదిక ధర్మ ప్రచారక్, 9వ లైన్, ఆనంద తీర్థ అగ్రహారం,
గుంటూరు - 522 004

---

## గమనిక



---

# విశ్వకర్మ 'యజ్ఞబ్రహ్మ' విద్వాన్ శ్రీ నంచర్ల

'సాహిత్య బ్రహ్మ' డా. వి.వి.యల్. నరసింహారావు, ఎం.ఎ.పి.హెచ్.డి.
రిటైర్డ్ డైరెక్టర్, రాష్ట్ర కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖ, హైదరాబాద్

విద్వాన్ శ్రీ నంచర్ల వెంకట రామాచారి గారు యజ్ఞబ్రహ్మగను, గృహవాస్తు సిద్ధాంతిగను జగ మెరిగిన బ్రాహ్మణులు. లోగడ వీరు రచించిన **'వేదోక్త గృహవాస్తు'** గ్రంథము ప్రథమ ముద్రణ ప్రతులు చెల్లి, ద్వితీయ ముద్రణ పొందిన ప్రసిద్ధ గ్రంథము. పండిత ప్రశంసనందిన గ్రంథము.

రామాచారి గారికి వేద విజ్ఞానము నందించిన పూజ్య గురుదేవులు బ్రహ్మశ్రీ పండిత చామర్తి అమరేశ్వరశర్మగారు, పరోక్ష గురువులు పరమహంస పరివ్రాజకాచార్య మహర్షి దయానంద సరస్వతి స్వామివారు.

ప్రస్తుత గ్రంథము **'విశ్వకర్మ విశిష్టత'**. ఇందు విశ్వకర్మ పరాత్పరుని గురించి వివరించుటతో పాటు **'విశ్వకర్మ బ్రాహ్మణ'** విశిష్టతను వివరించుటయు గలదు. వేద, వ్యాకరణ, నిరుక్త ప్రామాణ్యములచే విశ్వకర్మ ఎవరో నిరూపించుటతో ఇందలి ప్రథమాధ్యాయము మొదలగును. వైదిక దినచర్య, పంచ మహాయజ్ఞాది విశేషములు వివరించుచు తృతీయాధ్యాయ మందలి విశ్వకర్మ ధ్వజ గీతముతో గ్రంథము పరిసమాప్తమగును.

సర్వాధారుడును, జగత్పతియును, విశ్వేశ్వరుడును సుఖప్రదాతమును అగు విశ్వకర్మ ఋగ్యజుస్సామాథర్వములైన చతుర్వేదములలో ఎట్లు ప్రస్తుతింపబడినాడో ఉద్ధారములతో ఉటంకింపబడినది. విశ్వకర్మ మహా యజ్ఞ ప్రసక్తితో ప్రథమాధ్యాయము ముగిసినది.

ద్వితీయాధ్యాయము విశ్వకర్మీయులచే విశ్వశాంతి యెట్లు జరుగుచున్నదో వివరించుచు విశ్వకర్మీయులకు జరుగు సత్కారములను కూడా విశదీకరించుట జరిగినది. శిల్పకర్మ బ్రాహ్మణ కర్మయని నిర్ద్వంద్వముగా నిరూపింపబడినది. పంచశిల్ప విభాగముతో పాటు **'విశ్వ బ్రాహ్మణ'** నామము సార్థక్యము కూడా స్పష్టీకరింపబడినది. ఆచార్య, ఆచార్యులు, ఆచారి శబ్దములు విశ్వ బ్రాహ్మణులకు ఎట్లు సముచితములో వివరించబడినది.

తృతీయాధ్యాయము యజ్ఞోపవీత ధారణ, తత్సంబంధములైన మంత్రములతో నారంభమై వైదిక దినచర్య - పంచ మహాయజ్ఞాది విశేషములు, విశ్వకర్మ ధ్వజ గీతముతో ముగియును.

విషయ భారముతో గూడిన విశ్వకర్మ విశిష్టతా గ్రంథమునకు విద్వాన్ నంచర్ల వారు ఎన్నో ప్రామాణిక గ్రంథములను సంపదించి చూచినట్లు గ్రంథ మందలి ఉద్ధారములే ప్రత్యక్ష సాక్ష్యములు. విద్వాన్ నంచర్లవారు **"విశ్వకర్మ విశిష్టతను"** గ్రంథ రూపముగా వివరించుట పరిత్పలోకమునకు పరమోపయోగము.

**వాసిలి వేంకట లక్ష్మీనరసింహారావు**
**విశ్వ బ్రాహ్మణ ధర్మపీఠ సభాపతి**

# ద్రవ్యదాత



ఈ గ్రంథ ముద్రణకు ఐదు వేల రూపాయల నిచ్చి తోడ్పడిన ద్రవ్యదాతయైన దానశీలి, వేదాభిమాని, ఉదార హృదయులు, త్యాగ నిరతులు, సహృదయులు, వైదిక ధర్మ పరాయణులు, నిత్యాగ్ని హోత్రులు, కీ॥శే॥ శ్రీమతి అనంతోజు వెంకటమ్మ, కీ॥శే॥ బ్రహ్మశ్రీ అనంతోజు బ్రహ్మయ్యాచార్యుల జ్ఞాపకార్థము వారి కుమారుడు "స్వర్ణశిల్పి" బ్రహ్మశ్రీ అనంతోజు అంజయ్యాచార్యులకు నా హృదయ పూర్వక శుభాశీర్వాదములు.

**ద్రవ్యదాత**

| | |
|---|---|
| నంచర్ల వేంకట రామాచారి | 10,000 రూ॥ |

- ప్రకాశకులు



# కృతజ్ఞతలు

ఎవరి అపార కృపవలన ఈ గ్రంథమును వెలువరింప సాహసించితినో అట్టి సృష్టికర్తయైన ఆ పరమేశ్వరునకు, నాకు జన్మ నిచ్చిన పితృదేవులైన, పూజ్యులైన నా జననీ జనకులగు మహాలక్ష్మమ్మ- నరసయ్యాచార్యుల గార్లకు, ప్రాథమిక విద్యా గురువులైన శ్రీమాన్ కాండూరి తిరువెంగళాచార్యులు గారికి,, వేద జ్ఞానము నొసంగిన ఆధ్యాత్మిక గురుదేవులైన పూజ్యులు బ్రహ్మశ్రీ పండిత చామర్తి అమరేశ్వర శర్మ గారికి, పరోక్ష గురువులైన పరమహంస పరివ్రాజకాచార్య మహర్షి దయానంద సరస్వతి స్వామి వారికి నా అత్యంత కృతజ్ఞతాభి వందనములు.

నాకు హైదరాబాద్‌నకు దారి జూపిన ప్రియమిత్రులు శ్రీ తేరాల దీక్షితులు గారికి, నా యున్నతినే తన యున్నతిగా తలంచి నేటి ఈ స్థాయి కెదుగుటకు నా కెంతో సహాయ సహకారము లందించిన నా ఆత్మీయ మిత్రులగు శ్రీ తాళ్ళూరి సుబ్బారావు గారికి, వారి సోదరులకు, మరియు తల్లిదండ్రులకు, అత్యంత కృతజ్ఞుడను.

నా ఆప్తులగు నోరి సుబ్బారావు గారికి, అన్ని ఖర్చులు భరించి ఉపాధ్యాయ శిక్షణకు పంపించిన కీ.శే. శ్రీమాన్ యస్. రంగాచార్యుల గారికి, ఆర్థికముగా సహకరించిన సౌరప్పగారికి, మరువరాని సహాయ మొనరించిన శ్రీమాన్ వై.వి.యల్.యన్. ఆచార్యుల గారికి, సంస్కృత భాషా గురువులగు శ్రీమాన్ చిలుముల సత్తిరెడ్డి గారికి, పూజ్యులు విరాట్ వారపత్రిక సంపాదకులు కీ.శే. పండిత వేంకటేశ్వర శాస్త్రిగారికి, పూజ్యులు బ్రహ్మశ్రీ ఆంజనేయాచార్యులు (తత్వానంద స్వామి) గారికి, హిందీ భాషా గురువులగు శ్రీ మాన్ వీరనారాయణ రాజు గారికి సదా కృతజ్ఞుడను.

కోరినదే తడవుగా "విశ్వకర్మ విశిష్టత"ను నామూలాగ్రముగ పఠించి, సంతసించి, మనః పూర్వకముగ "అభిప్రాయము" వ్రాసి యిచ్చిన బ్రహ్మశ్రీ డా॥ మసన చెన్నప్ప గారికి, "పీఠిక" వ్రాసియిచ్చిన శ్రీమాన్ చలవాది సోమయ్య (యం.ఏ.) గారికి, అభిప్రాయము వ్రాసి యిచ్చిన 'సాహిత్య బ్రహ్మ' డా. వి.వి.యల్. నరసింహారావు గారికి, సదా కృతజ్ఞుడను. మరోకసారి పై వారందరికి అభివందనములు.

ఈ పుస్తకమును వ్రాయుటకు సహాయము లభించిన గ్రంథముల గ్రంథ కర్త లందరికీ నేను అత్యంత కృతజ్ఞుడను. ఇందులో ఏమైనా తప్పులున్నట్లైతే క్షమించ మని పాఠకులను ప్రార్థించుచున్నాను.

ఈ గ్రంథ ముద్రణకు ఐదువేల రూపాయలనిచ్చి తోడ్పడిన ద్రవ్యదాతయైన దానశీలి, వేదాభిమాని, ఉదార హృదయులు, త్యాగనిరతులు, వైదిక ధర్మ పరాయణులు, అగ్నిహోత్రులు, సహృదయులు, శిష్యరత్న మగు బ్రహ్మశ్రీ చేపూరి పండరి న్యాయవాదికి నా హృదయ పూర్వక శుభాశీర్వాదములు.

ఈ గ్రంథమును సకాలంలో సుందరముగా డి.టి.పి. (టైప్ సెట్టింగ్) చేసి యిచ్చిన కుమారి మందడి. కవితకు, ప్రూఫ్ దిద్దుటకు సహకరించిన శిష్యురాలగు శ్రీమతి గుండ్లపల్లి విజయకు శుభాశీర్వాదములు.

భవదీయుడు
**నంచర్ల వెంకటరామాచారి**

# దానము

**"పాత్రాత్ దానమ్"** అనగా పాత్ర నెరిగి దానము చేయవలయును. మనమిచ్చిన దానము సద్వినియోగ మవుతుందా? లేదా? అని ఆలోచించి దానము చేయవలయును. సద్వినియోగమైతే మంచి ఫలితమును, దుర్వినియోగమైతే చెడుఫలితమును పొందుదుము. ఇక పోతే మనుస్మృతికారు - డేమంటున్నాడో చుద్దాము.

**సర్వేషామేవ దానానాం బ్రహ్మదానం విశిష్యతే।**
**వార్యన్నగోమహీవాసస్తిలకాఞ్చన సర్పిషామ్॥ (మను ॥౪-౨౩౩)**

ప్రపంచమందలి జలము, అన్నము, గోవు, భూమి, వస్త్రము, నువ్వులు, సువర్ణము, ఘృతము మొదలగు సమస్త దానములలో **"వేదవిద్యా"** దానము అతి శ్రేష్ఠము. సర్వ శ్రేష్ఠమైన ఫలము నిచ్చును.

కాబట్టి శక్తి కొలది శరీరము చేతను, మనస్సు చేతను, ధనము చేతను - అన్నివిధముల చేత విద్యను అభివృద్ధి పరచ వలయును. ఏ దేశమందు బ్రహ్మచర్యము, విద్య, వేదోక్త ధర్మము తగినట్లు ప్రచారము నందుండునో ఆ దేశమే సౌభాగ్యవంత మగును.

**వేదవిద్యా:** ఋగ్వేదము నుండి జ్ఞానకాండ, యజుర్వేదము నుండి కర్మకాండ, సామవేదము నుండి ఉపాసన కాండ, అథర్వ వేదము నుండి విజ్ఞాన కాండ మొదలగు విద్యలను ధానము చేయుట వలన దానము పొందిన వాని అజ్ఞానము తొలగిపోయి జ్ఞాన కిరణములతో ప్రకాశించి ముక్తిని-మోక్షమును పొందును. వేదవిద్య దానము చేసిన వారు, స్వీకరించిన వారు శాశ్వత సుఖమును పొందుదురు. అనగా మోక్షమును పొందుదురు. **"జ్ఞానాత్ ముక్తిః"**

ఈ గ్రంథ ముద్రణకు ఐదువేల రూపాయలనిచ్చి తోడ్పడిన ద్రవ్యదాతయైన దానశీలి, వేదాభిమాని, ఉదార హృదయులు, త్యాగనిరతులు, వైదిక ధర్మ పరాయణులు, అగ్నిహోత్రులు, సహృదయులు, శిష్యరత్న మగు బ్రహ్మశ్రీ చేపూరి పండరి న్యాయవాదికి నా హృదయ పూర్వక శుభాశీర్వాదములు.

ఈ గ్రంథమును సకాలంలో సుందరముగా డి.టి.పి. (టైప్ సెట్టింగ్) చేసి యిచ్చిన కుమారి మందడి. కవితకు, ప్రూఫ్ దిద్దుటకు సహకరించిన శిష్యురాలగు శ్రీమతి గుండ్లపల్లి విజయకు శుభాశీర్వాదములు.

భవదీయుడు
**నంచర్ల వెంకటరామాచారి**

# దానము

**"పాత్రాత్ దానమ్"** అనగా పాత్ర నెరిగి దానము చేయవలయును. మనమిచ్చిన దానము సద్వినియోగ మవుతుందా? లేదా? అని ఆలోచించి దానము చేయవలయును. సద్వినియోగమైతే మంచి ఫలితమును, దుర్వినియోగమైతే చెడుఫలితమును పొందుదుము. ఇక పోతే మనుస్మృతికారు - డేమంటున్నాడో చుద్దాము.

**సర్వేషామేవ దానానాం బ్రహ్మదానం విశిష్యతే।**
**వార్యన్నగోమహీవాసస్తిలకాఞ్చన సర్పిషామ్॥ (మను ॥४-२३३)**

ప్రపంచమందలి జలము, అన్నము, గోవు, భూమి, వస్త్రము, నువ్వులు, సువర్ణము, ఘృతము మొదలగు సమస్త దానములలో **"వేదవిద్యా"** దానము అతి శ్రేష్ఠము. సర్వ శ్రేష్ఠమైన ఫలము నిచ్చును.

కాబట్టి శక్తి కొలది శరీరము చేతను, మనస్సు చేతను, ధనము చేతను - అన్నివిధముల చేత విద్యను అభివృద్ధి పరచ వలయును. ఏ దేశమందు బ్రహ్మచర్యము, విద్య, వేదోక్త ధర్మము తగినట్లు ప్రచారము నందుండునో ఆ దేశమే సౌభాగ్యవంత మగును.

**వేదవిద్యా:** ఋగ్వేదము నుండి జ్ఞానకాండ, యజుర్వేదము నుండి కర్మకాండ, సామవేదము నుండి ఉపాసన కాండ, అథర్వ వేదము నుండి విజ్ఞాన కాండ మొదలగు విద్యలను ధానము చేయుట వలన దానము పొందిన వాని అజ్ఞానము తొలగిపోయి జ్ఞాన కిరణములతో ప్రకాశించి ముక్తిని- మోక్షమును పొందును. వేదవిద్య దానము చేసిన వారు, స్వీకరించిన వారు శాశ్వత సుఖమును పొందుదురు. అనగా మోక్షమును పొందుదురు. **"జ్ఞానాత్ ముక్తిః"**



తేది 6-4-2002న "గాయత్రి విశిష్టత", 'వైదిక సూక్తములు", "విశ్వకర్మ విశిష్టత" గ్రంథముల ఆవిష్కరణానంతరం సంకలన కర్త శ్రీ నంచర్ల వేంకట రామాచార్యులును సన్మానిస్తున్న న్యాయశాఖామంత్రి శ్రీ పి. చంద్రశేఖర్

# సహాయ గ్రంథములు - గ్రంథ సంకేత సూచిక

| | |
|---|---|
| ఋగ్వేదము | ఋగ్వే ॥ |
| యజుర్వేదము | యజు ॥ |
| సామవేదము | సామ ॥ |
| అథర్వవేదము | అథర్వ ॥ |
| నిరుక్తము | నిరు ॥ |
| విరాట్ వారపత్రిక | విరాట్ ॥ |
| కృష్ణ యజుర్వేదము | కృష్ణ యజు॥ |
| సాంఖ్య దర్శనము | సాంఖ్య ॥ |
| శతపథ బ్రాహ్మణము | శత ॥ బ్రా ॥ |
| ఐతరేయ బ్రాహ్మణము | ఐత ॥ బ్రా ॥ |
| మనుస్మృతి | మను ॥ |
| కఠోపనిషత్తు | కఠోప ॥ |
| విశ్వదర్పణము | వి ॥ ద ॥ |
| మీమాంసా దర్శనము | మీ ॥ద ॥ |
| విశ్వకర్మ దిగ్దర్శన్ | విశ్వ ॥ దగ్ద ॥ |
| ఆశ్వలాయన గృహ్య సూత్రము | ఆశ్వలా ॥ గృ ॥ |
| పారస్కర గృహ్య సూత్రము | పార ॥ గృ ॥ |
| యజ్ఞోపవీత రహస్యము | తై ॥ ఆ ॥ |
| తైత్తిరేయ ఆరణ్యకము | తై ॥ఆ ॥ |
| గోబిలీయ గృహ్య సూత్రము | గోబి ॥ గృ ॥ |
| దయానంద హృదయము | దయా ॥ హృద ॥ |
| ఛాన్దోగ్యోపనిషత్తు | ఛాన్దో ॥ ఉప ॥ |
| ఉణాదికోశము | ఉ ॥ |
| పాణినీయ అష్టాధ్యాయీ | పా ॥ |
| దయానంద కృత పంచ మహా యజ్ఞ విధి | - |

# విషయ సూచిక

ఓ౦మ్

# విశ్వకర్మ విశేష్ఠత

## ప్రథమాధ్యాయము

## విశ్వకర్మ ఎవరు?

విశ్వకర్మ యనగా పరమేశ్వరుడు, అన్ని పదార్థముల యొక్క కర్త, సమస్త జగత్తును రచించు కర్మలు గలవాడు. విస్తృతమైన జ్ఞానము గలవాడు, సర్వజ్ఞుడు, సర్వవ్యాపకుడు, ప్రకాశమయుడు, న్యాయకారి, అందరిని ధరించువాడు, నిర్మాత-సృష్టికర్త. **ఇందుకు ప్రమాణము:-**

### వ్యాకరణ ప్రమాణము

**"విశ ప్రవేశనే"** అను ధాతువునకు **"క్వన్"** ప్రత్యయమును, **"డుకృఞ్ కరణే"** అను ధాతువునకు **"మనిన్"** ప్రత్యయమును జోడించగా **"విశ్వకర్మా"** అను శబ్ద మేర్పడును.

ధాతువుల అర్థమును బట్టి సమస్తమును చేసి ప్రవేశింప జేసినవాడు. అనగా పరమేశ్వరుడు.

విశ్వకర్మ యను శబ్దము సమాస వృత్తి యందలి **"బహువ్రీహి"** సమాసముచే నిష్పన్న మగుచున్నది. **"విశ్వాని కర్మాణి యస్య సః విశ్వకర్మా"** అని దీని విగ్రహ వాక్యము. సకల కర్మల కాధారుడని దీని అర్థము. అనగా పరమేశ్వరుడు.

### నిరుక్త ప్రమాణము

**"విశ్వకర్మా సర్వస్య కర్తా"** ప్రపంచములోని అన్ని పదార్థముల యొక్క కర్త విశ్వకర్మ. అనగా పరమేశ్వరుడు. (నిరు॥ అ ౧౦ - ఖం ౨౬)

### వేద ప్రమాణము

౧. **"విశ్వకర్మా విమనా ఆద్విహాయా"** జగత్తును రచించుటకు వివిధములైన కర్మలను

జేయువాడు, విస్తృతమైన జ్ఞానము గలవాడు, అన్ని దిశల నుండి ఆకాశము వలె వ్యాపించువాడు, పరమేశ్వరుడు, అందరిని ధరించువాడు, మరియు నిర్మాత- సృష్టికర్త, (ఋగ్వే ౧౦ - ౮౨ - ౨)

౨. **"విశ్వాని కర్మాణి యస్య సః = విశ్వకర్మా"** సకల కర్మల కాధారుడైన ఈశ్వరుడు = విశ్వకర్మ. (యజు॥ ౧౩ - ౪౫)

౩. **"విశ్వం సర్వం జగత్ కర్మ క్రియమాణం యస్య సః = విశ్వకర్మా"** సమస్త జగత్తును రచించు కర్మలు గలవాడు (ఐన ఆ పరమేశ్వరుడు విశ్వకర్మ) (యజు ॥ ౧౭ -౨౬)

౪. **"విశ్వా న్యఖిలాని కర్మాణి యస్య పరమేశ్వరస్య సః = విశ్వకర్మా"** సమస్త అఖిల కర్మలు ఎవనివో ఆ పరమేశ్వరుడు = విశ్వకర్మ (యజు॥ ౧౭ - ౧౮ )

౫. **"విశ్వకర్మా విశ్వదేవో మహాన్ అసి"** జగత్తును సృష్టించువాడవు - విశ్వకర్మవు. జగత్తునకు దేవుడవు, సర్వవ్యాపివై యున్నావు. (సామ॥ ౧౦౨౬ )

౬. **"విశ్వకర్మన్ నమస్తే పాహ్యఽస్మాన్"** ప్రపంచమును సృష్టించువాడ వగు ఓ విశ్వకర్మా! నీకు నమస్కారము. మమ్ము రక్షించుము. (అథర్వ॥ ౨-౩౫-౪)

విశ్వకర్మ యనగా పరమేశ్వరు డని వ్యాకరణ, నిరుక్త, ఋగ్, యజు, సామ, అథర్వ వేదముల ప్రమాణములతో స్పష్టమైనది.

విశ్వకర్మ పరమేశ్వరుడు ఒక వర్గమునకు చెందినవాడు కాడు. అన్ని వర్గములకు చెందినవాడు. ఏక దేశీయుడు కాడు. సార్వ దేశీయుడు - సర్వాంతర్యామి. సర్వ ప్రపంచమునకు దేవుడు. నిరాకారుడు.

## విశ్వకర్మ పరమేశ్వరు డెట్టి వాడు?

**కిగ్ం స్విదాసీదధిష్ఠానమారమ్భణం కతమత్స్విత్కథాసీత్।**

**యతో భూమిం జనయన్విశ్వకర్మా వి ద్యామౌర్ణోన్మహినా విశ్వచక్షాః॥**

**(యజు॥ ౧౭ - ౧౮)**

**వ్యాఖ్యానము:-** (ప్రశ్నోత్తర విద్య ద్వారా) ఈ జగత్తునకు అధిష్ఠాన మెయ్యది? కారణము మరియు ఉత్పాదకు డెవడు? ఏ ప్రకారముగ నున్నది? రచించువాడు - అధిష్ఠాన మెవరు?

మరియు నిమిత్తకారణ మెయ్యది? ఈ జగత్తునకు, ఈశ్వరునకు★ సాధనము లెయ్యవి? (ఉత్తరములు) "యతః" విశ్వమును (జగత్ కర్మ) సృజించిన విశ్వకర్మ పరమాత్మ అనంత సామర్థ్యముచే ఈ జగత్తును రచించెను. అతడే ఈ జగత్తున కంతటికి అధిష్ఠానము, నిమిత్తము, సాధనములు మున్నగునవియై యున్నాడు. అతడు తన అనంత సామర్థ్యము వలన ఈ సమస్త జగత్తును యథాయోగ్యముగ రచించెను. మరియు భూమి మొదలుకొని స్వర్గపర్యంతము రచించి తన మహిమచే "ఔర్ణోత్" ఆచ్ఛాదిత మొనర్చి యున్నాడు. మరియు పరమాత్మకు అధిష్ఠానాదులు పరమాత్మయే. అన్యు లెవరును లేరు - ఇతర మెద్దియును లేదు - సర్వమును ఉత్పాదన రక్షణ ధారణాదుల నతడే చేయు చున్నాడు. అత డానందమయుడు. ఆ ఈశ్వరుడు "విశ్వచక్షాః" సమస్త జగత్తునకు ద్రష్ట - చూచువాడు. అతనిని విడిచిపెట్టి ఇతరుల నాశ్రయించువాడు దుఃఖ సాగరమున నెందుకు మునుగడు? (విరాట్ ౪ - ౫- ౧౯౭౯)

## సర్వాధారుడు జగత్పిత విశ్వకర్మ

**విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతోబాహురుత విశ్వతస్పాత్।**

**సం బాహుభ్యాం ధమతి సం పతత్రైర్ద్యావాభూమీ జనయన్దేవ ఏకః ॥**

**(యజు॥ ౧౭ - ౧౯)**

**వ్యాఖ్యానము:-** విశ్వము (సకల జగత్తు) ఎవనికి చక్షువో (దృష్టియో), ఎవనికి దృష్టము కాని వస్తువులేదియు లేదో, మరియు అంతట ముఖము, బాహువులు, పాదములు అన్యశ్రోత్రాదులు ఎవరికి కలవో, అట్టి ఈశ్వరుడు సర్వదృక్కు, సర్వవక్త, సర్వాధారకుడు, సర్వగతుడు, వ్యాపకుడు అతనికి భయపడినపుడే ధర్మాత్ముడు కాగలడు. లేని యెడల ఎన్నటికి కాజాలడు. ఆ విశ్వకర్మయే పరమాత్మ. ఆ ఒకడే అద్వితీయుడు. జగత్తుకు కర్త. ఎవడెవ డెట్టి పాప పుణ్యములొనర్చునో ఆయా వ్యక్తులకు న్యాయకారి దయాళువు, జగత్పిత, పక్షపాతము లేకుండ అనంత బల పరాక్రమము అను ఈ రెండు బాహువులతో బాగుగా "పతత్రైః" ప్రాప్తించు సుఖ దుఃఖ ఫలముల రెంటిని పొందిన సమస్త జీవులకు "ధమతి" (ధమనము = కమ్పనము) యథా యోగ్యమైన జన్మ మరణాదులను ప్రాప్తింపజేయుచున్నాడు. ఆ నిరాకారుడు. అజుడు అనంతుడు, సర్వశక్తిమంతుడు, న్యాయకారి, దయామయుడునైన ఈశ్వరుని కంటే అన్యుని ఎప్పుడును అంగీకరింప

*★ ఈశ్వరు డనగా పార్వతి భర్తను గ్రహించరాదు. సృష్టి స్థితి లయ కారుడైన భగవంతునిట గ్రహించవలెను.*

గూడదు. అతడే యాచనీయుడు, పూజనీయుడు, మాకు ప్రభువు, స్వామి, ఇష్టదేవుడు. అతని వలననే మనకు సుఖము లభించును. అన్యుని నుండి ఎన్నిటికిని లభింపదు. (విరాట్ ౧౮ - ౫ - ౧౯౭౯)

## సుఖ ప్రదాత విశ్వకర్మ పరమేశ్వరుడు

**యా తే ధామాని పరమాణి యావమా యా మధ్యమా విశ్వకర్మన్నుతేమా।**
**శిక్షా సఖిభ్యో హవిషి స్వధావః స్వయం యజస్వ తన్వం వృధానః॥**

**(యజు॥ ౧౭ - ౨౧)**

**వ్యాఖ్యానము:-** ఓ సర్వ విధాయకా! విశ్వకర్మా! ఈశ్వరా! నీవు బాగుగా రచించిన ఉత్తమ, మధ్యమ, నికృష్టములగు త్రివిధ ధామములు లోకము లేవి యున్నవో ఆ లోకము లన్నిటి శిక్ష నీ సఖులమైన మా కోసంగుము. యథార్థ విద్య ప్రాప్తించుటచే అన్ని లోకములందు ఎల్లప్పుడు సుఖముగానే యుందుము. ఈ లోకముల **"హవిషి"** దానమిచ్చు, పుచ్చుకొను వ్యవహారములో మేము చతురుల మయ్యెదము గాక! **'స్వధావః'** స్వసామర్థ్యాదులను ధారణ మొనర్చువాడా! మా శరీరాది పదార్థములను నీవే పెంపొందించువాడవు. **"యజస్వ"** మా కొరకు విద్వాంసుల సత్కారము, సజ్జను లందరికి సుఖముల సంగతి, విద్యాది గుణముల దానము నీవు స్వయముగ చేయుము. నీవు నీ ఉదారత వలననే మాకన్ని సుఖముల నొసగుము. ఏలయన మేమైతే నిన్ను ప్రసన్నునిగ చేయుట కెంత మాత్రము సమర్థులము కాము. బొత్తిగ మేము నీ కనుకూలముగ నుండ జాలము. కాని నీవైతే అధమోద్ధారకుడవు. కావున మమ్ము నీ కృపచే సుఖులుగ చేయుము.

(విరాట్ ౨౨ - ౬ - ౧౯౭౯)

## విశ్వకర్మ విశ్వేశ్వరుడు

**విశ్వకర్మా విమనా ఉ ఆద్విహాయా ధాతా విధాతా పరమోత సన్దృక్।**
**తేషామిష్టాని సమిషా మదన్తి యత్రా సప్తఋషీన్ పర ఉ ఏకమాహుః॥**

**(యజు॥ ౧౭ - ౨౬)**

**వ్యాఖ్యానము:-** ఈశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వరచకుడు, విశ్వకర్మ (వివిధ జగదుత్పాదకుడు), మరియు **"విమనాః"** వివిధ (అనంత) విజ్ఞానవంతుడు. **'ఆద్విహాయా'** సర్వవ్యాపకుడు, అకాశము వలె నిర్వికారుడు, అక్షోభ్యుడు (కొలతలేని), సర్వాది కరణుడు, అతడే సమస్త జగత్తునకు **"ధాతా"** ధారణ కర్త. **"విధాతా"** వివిధ విచిత్ర జగదుత్పాదకుడు. **"పరమ, ఉత"** సర్వోత్కృష్టుడు, **"సన్దృక్"** యథావతుగ అందరి పాప పుణ్యములను చూచువాడు. ఏ మనుష్యులు ఆ ఈశ్వరుని భక్తి, అతని యందే విశ్వాసము, అతని సత్కారమునే ఒనర్చెదరో అతనిని దక్క ఇతరుల నెవ్వరిని లేశ మాత్రం విశ్వసింపరో వారికే అన్ని ఇష్ట సుఖములు ప్రాప్తించును. అన్యులకు ప్రాప్తించవు. ఆ ఈశ్వరుడు తన భక్తులను సుఖము నందే యుంచును. మరియు ఆ భక్తులు బాగుగా స్వేచ్ఛాపూర్వకముగ **"మదన్తి"** పరమానందము నందే యుందురు. దుఃఖములను బడయరు. ఆ పరమాత్మ అద్వితీయుడు. అతని సామర్థ్యములోనే సప్త అనగా పంచ ప్రాణములు, సూత్రాత్మ, ధనంజయము అనునది ప్రళయ విషయకములు, కారణభూతములై యున్నవి. అతడే జగత్తు యొక్క ఉత్పత్తి, స్థితి, ప్రళయము లందు నిర్వికారుడు, ఆనంద స్వరూపుడుగా నున్నాడు. అతనినే ఉపాసించుటచే మనము ఎల్లప్పుడు సుఖము నందుండ గలము.

(విరాట్ ౬ - ౭ - ౧౯౭౯)

## ఓం నమో విశ్వకర్మణే

ఓ౩మ్ = పరమేశ్వరుని సర్వోత్తమ నామము. ఇందలి **అ,ఉ,మ్** అను మూడక్షరములు కలసి యొక **"ఓ౩మ్"** సముదాయమైనది. ఈ యొక్క నామము వలన పరమేశ్వరుని అనేక నామములు గ్రహింపబడుచున్నవి.

**ఎట్లన:-** అకారము వలన విరాట్, అగ్ని, విశ్వము మున్నగు నామములకు, ఉకారము వలన హిరణ్యగర్భుడు, వాయువు, తైజసుడు మున్నగు వానికిని; మకారము వలన ఈశ్వరుడు, ఆదిత్యుడు, ప్రాజ్ఞుడు మున్నగు నామములకును **"ఓ౩మ్"** నామము వాచకము గ్రాహకము నగుచున్నది. దానికిట్లే వేదాది సత్యశాస్త్రము లందు స్పష్ట వ్యాఖ్యానము చేయబడినది. కావున ప్రకరణానుకూలముగ నీ నామము లన్నియు బరమేశ్వరునివే. విశ్వకర్మ - విశ్వమును సృజించు పరమేశ్వరుడు. విశ్వకర్మణే = విశ్వకర్మ పరమేశ్వరునకు, నమః = నమస్కారము.

విశ్వకర్మా దిశాం పతిస్స నః పశూన్పాతు సో ఉ స్మాన్పాతు తస్మై నమః॥

(కృష్ణ యజుర్వేదము కాం ౫- ప్ర ౫ - అ౫)

**పదార్థము:-** దిశాంపతిః = దిశలకు - దిక్కులకు పతియైన, సః విశ్వకర్మా = ఆ విశ్వకర్మ పరమాత్మ , నః = మా యొక్క, పశూన్ = పశువులను - పశు పక్ష్యాదులను, పాతు = రక్షతు = రక్షించుగాక! సః = అతడు, అస్మాన్ = మమ్ములను, పాతు = పాలించుగాక!, తస్మై = అతనికి, నమః = నమస్కారము.

**భావార్థము:** దిక్కుల కధిపతియైన విశ్వకర్మ పశు పక్ష్యాదులను, ప్రజలను - సకల ప్రాణులను పాలించుగాక ! అతనికి నమస్కారము. (విరాట్ ౧౬- ౧- ౧౯౮౩)

# చతుర్వేదీయ విశ్వకర్మ సూక్తమ్

ఓంకార స్వరూప విశ్వకర్మ పరమేశ్వరుడు సమస్త జగత్తు యొక్క కర్త, అజుడు, అనంతుడు, సర్వశక్తిమంతుడు, దయామయుడు నైన విశ్వకర్మ కంటే అన్యుని నెప్పుడు అంగీకరింపగూడదు. అతడే యాచనీయుడు, ఇష్ట దేవుడు. అతని వలననే సుఖము లభించును. అన్యుని నుండి ఎన్నటికిని లభింపదు. విశ్వకర్మ సమస్త జగత్తునకు ద్రష్ట- చూచువాడు. అతనిని విడిచిపెట్టి ఇతరుల నాశ్రయించువాడు దుఃఖ సాగరమున నెందుకు మునగడు?

విశ్వకర్మ సర్వదృక్కు, సర్వవక్త, సర్వాధారుడు, సర్వగతుడు, వ్యాపకుడు అతనికి భయపడినపుడే ధర్మాత్ముడు కాగలడు. లేని యెడల ఎన్నటికీ కాజాలడు. ఆ విశ్వకర్మయే పరమాత్మ. ఆ విశ్వకర్మయే ఈశ్వరుడు. ఆ ఒక్కడే అద్వితీయుడు. ఎవడెవ డెట్టి పాపపుణ్యము లొనర్చునో ఆయా వ్యక్తులకు న్యాయకారి, దయాళువు, జగత్పిత.

సమస్త సుఖముల నుత్పత్తి జేయువాడు నగు జగదీశ్వరు డగు విశ్వకర్మ ప్రార్థించిన సకల ప్రార్థనా వచనములను ప్రేమతో స్వీకరించును. కావున సర్వకార్యములనుత్పన్న మొనర్చునదగు ఐశ్వర్యము నిమిత్తము నిన్ను ప్రార్థించుచున్నాము.

**ఋగ్వేదము నుండి:-**

౧. ఋషిః:- విశ్వకర్మా భౌవనః॥ దేవతా:- విశ్వకర్మా॥
ఛన్దః:- విరాట్ త్రిష్టుప్॥ స్వరః:- ధైవతః॥

సమస్త జగత్తు యొక్క కర్త విశ్వకర్మ పరమేశ్వరుడు.

ఓం య ఇమా విశ్వా భువనాని జుహ్వదృషిర్హోతా న్యసీదత్ పితా నః।

స ఆశిషా ద్రవిణమిచ్ఛమానః ప్రథమచ్ఛదవరాన్ ఆ వివేశ॥

(ఋగ్వే॥ ౧౦ - ౮౧- ౧)

**పదార్థము:-** ఋషిః = సమస్త జగత్తును చూచువాడు, హోతా = సమస్త జగత్తును గ్రహించువాడు, నః = మన యొక్క, పితా = తండ్రి మరియు ప్రభువు. యః = ఎవడైతే, ఇమా = ఈ, విశ్వా = సమస్త, భువనా = లోకములకు, జుహ్వత్ = శక్తినిచ్చుచు లేక ఆహుతి నిచ్చుచు, ని అసీదత్ = విరాజమానుడుగా యుండునో, సః = వాని, ఆశిషా = సంకల్ప మాత్రముననే, ద్రవిణమ్ = జగత్తును గదలునట్లు, ఇచ్ఛమానః = కోరుచు, ప్రథమచ్ఛత్ = ప్రథమముగ జగత్తులో వ్యాపించుచు, అవరాన్ = తరువాత కలుగు జగత్తులో గూడ, ఆ వివేశ = వ్యాపించును.౧

**భావార్థము:-** సమస్త జగత్తు యొక్క కర్త విశ్వములో వ్యాపించిన పరమేశ్వరుడు ధారణాత్మకశక్తి = ఆది సృష్టి నుండి యజ్ఞములతో సంబంధము కలిగినవాడు. ఇచ్చట సృష్టి యొక్క రచన యజ్ఞ రూపములో వర్ణించబడినది. జగత్తు నంత చూచువాడు, సమస్త ప్రపంచమును ప్రళయ కాలమున లోపలికి గ్రహించు పరమేశ్వరుడు మన తండ్రి. అతడు సమస్త ప్రపంచమును ప్రళయకాలములో తన లోనికి గ్రహించును. మరియు సృష్టి సమయములో అతడు సమస్త జగత్తునకు శక్తి నిచ్చుచు దానిని రచన చేయును.

ఆ కోరిక = సృష్టి చేయు కోరికతో ఈ చేతనా శక్తి ఐశ్వర్యము కలిగిన జగత్తును కోరుచు దీనిలో వ్యాపించును. మరియు దీని తరువాత ఏ పదార్థములైతే పుట్టునో వానిలో గూడా వ్యాపించును. ౧.

౨. ఋషిః:- విశ్వకర్మా భౌవనః॥ దేవతా:- విశ్వకర్మా ॥

ఛన్దః:- పాధనిచృత్త్రిష్టుప్ ॥స్వరః- ధైవతః॥

సర్వ ప్రపంచమునకు కర్త విశ్వకర్మ పరమేశ్వరుడు

**కిం స్విదాసీదధిష్ఠానమారమ్భణం కతమత్స్విత్కథాసీత్।**

**యతో భూమిం జనయన్విశ్వకర్మా వి ద్యామౌర్ణోన్మహినా విశ్వచక్షాః॥ ౨॥**

(ఋగ్వే॥ ౧౦ - ౮౧ - ౨)

**పదార్థము :-** అధిష్ఠానమ్ = ఈ ప్రపంచము యొక్క ఆధారము, కిమ్ స్విత్ = ఏది, ఆసీత్ = అగుచున్నది? ఆరమ్భణమ్ = మూల ఉపాదాన కారణము, కతమత్ స్విత్ = ఏదగుచున్నది? ఈ ప్రపంచారంభము, కథా = ఏ విధముగ, ఆసీత్ = అగును? యతః = దానితో, విశ్వకర్మా = సమస్త జగత్తును చేయువాడు, విశ్వచక్షాః = సమస్త జగత్తును చూచు వాడగు పరమేశ్వరుడు, భూమిమ్ = భూమిని, జనయన్ = ఉత్పన్నము చేయుచు, మహినా = తన ఐశ్వర్యముతో భూమిని, మరియు, ద్యామ్ = ఆకాశమును, సూర్యాది లోకములను, వి ఔర్ణోత్ = కప్పుచున్నాడు. ౨.

**భావార్థము:-** జగత్తునకు ఆశ్రయము ఏది? మూల ఉపాదాన కారణమేది? ఇది ఏ విధముగ ఉత్పత్తియగును? దానితో సర్వ ప్రపంచమును చూచువాడు మరియు సర్వ ప్రపంచమునకు కర్తయైన విశ్వకర్మ యగు పరమేశ్వరుడు భూమిని మరియు ఆకాశమును చేయుచు దానిని తనయొక్క వ్యాపకత్వముతో కప్పి వేయుచున్నాడు. వాస్తవముగా పరమేశ్వరుడు దానికి ఆశ్రయుడు. పరమేశ్వరుని ప్రకృతి దానికి ఉపాదానము. మరియు దానితోనే ఆయన జగత్తును సృష్టించెను. రాబోవు మంత్రములో ఇది స్పష్టమగును. ౨.

౩ ఋషిః:- విశ్వకర్మా భౌవనః॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- నిచృత్త్రిష్టుప్॥ స్వరః:- ధైవతః॥

సర్వ ప్రపంచమును నడిపించువాడు విశ్వకర్మ పరమేశ్వరుడు

**విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతోబాహురుత విశ్వతస్పాత్।**
**సం బాహుభ్యాం ధమతి సం పతత్రైర్ద్యావాభూమీ జనయన్దేవ ఏకః॥ ౩ ॥**

(ఋగ్వే॥ ౧౦ - ౮౧ - ౩)

**పదార్థము:-** పరమేశ్వరుడు, విశ్వతశ్చక్షుః = సర్వమును చూచువాడు, విశ్వతోముఖః = సర్వమును బోధించువాడు, విశ్వతో బాహుః = సర్వశక్తిమంతుడు, విశ్వతస్పాత్ = సర్వమును వ్యాపించియున్నాడు. ఏకః = ఒకడైన ఆ పరమేశ్వరుడు, పతత్రైః = ప్రకృతి యొక్క పరమాణువుల ద్వార, ద్యావాభూమీ = ఆకాశమును మరియు భూమిని, సం జనయన్ = ఉత్పత్తి చేయుచు, బాహుభ్యామ్ = జ్ఞానము మరియు క్రియతో, సం ధమతి = సర్వ ప్రపంచమును నడిపించును.

**భావార్థము:-** ఆ పరమేశ్వరుడు సర్వమును చూచువాడు, సర్వమును బోధించువాడు, సర్వశక్తి మంతుడు, మరియు సర్వ వ్యాపకుడు. ఆయన ప్రకృతి యొక్క పరమాణువుల ద్వారా ఒకడే ఆకాశమును మరియు భూమిని ఉత్పన్నము చేయుచు తనయొక్క జ్ఞానము మరియు క్రియతో సంపూర్ణ ప్రపంచమును నడిపించును. ౩.

౪. ఋషిః:- విశ్వకర్మా భౌవనః॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- పాదనిచృ త్రిష్టుప్॥ స్వరః: - ధైవతః

ఏది ఆ వనము? ఏది ఆ వృక్షము?

**కిం స్విద్వనం క ఉ స వృక్ష ఆస యతో ద్యావాపృథివీ నిష్టతక్షుః।**
**మనీషిణో మనసా పృచ్ఛతేదు తద్యదధ్యతిష్ఠద్భువనాని ధారయన్** ॥ ౪ ॥

(**ఋగ్వే॥** ౧౦ - ౮౧ - ౪)

**పదార్థము:-** వనమ్ = వనము, కిమ్ స్విత్ = ఏదియున్నది? వృక్షః = వృక్షము, కః ఉ = ఏది, ఆస = ఉన్నది? యతః = దానితో పరమేశ్వరుడు - ప్రేరితుడై శక్తులను, ద్యావాపృథివీ = ఆకాశము మరియు పృథివిని, నిః తతక్షుః = పుట్టించును. మనీషిణః = ఓ విద్వాంసులైన పురుషులారా! మనసా = తమ మనస్సుతో, పృచ్ఛత ఇత ఉ = అడుగుడు. తత్ = దానికి, యత్ = ఏదైతే, భువనాని = అయ్యే యోగ్యత అనగా ఉత్పత్తిలో సమర్థమైన భవితవ్యము జగత్తు యొక్క కారణమును, ధారయన్ = ధారణ చేయుచు, అధి అతిష్ఠత్ = దానికి అధికారి యగుచున్నాడు. ౪.

**భావార్థము:-** ఏది ఆ వనము? ఏది ఆ వృక్షము? దానితో పరమాత్ముడు ప్రేరితుడై జగత్తు యొక్క రచనలో ఉన్న శక్తులు ఆకాశము మరియు పృథివి లోకములను ఉత్పన్నము చేయును. ఓ విద్వాంసులారా! తమ మనస్సును అడుగుడు. దానిని సమస్త జగత్తు యొక్క కార్యరూపములో మార్పు అగుచున్నటువంటి కారణములను ధారణము చేయుచు దానికి అధికారి యగుచున్నాడు.౪.

౫ ఋషిః:- విశ్వకర్మా భౌవనః॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- విరాట్ త్రిష్టుప్॥ స్వరః:- ధైవతః॥

సకల ప్రాణుల కుపదేశము చేయువాడు విశ్వకర్మ పరమేశ్వరుడు

**యా తే ధామాని పరమాణి యావమా యా మధ్యమా విశ్వకర్మన్నుతేమా।**
**శిక్షా సఖిభ్యో హవిషి స్వధావః స్వయం యజస్వ తన్వం వృధానః॥ ౫ ॥**

(ఋగ్వే॥ ౧౦ - ౮౧ - ౫)

**పదార్థము:-** విశ్వకర్మన్ = సమస్త విశ్వమునకు కర్తవగు ఓ ప్రభో! తే = నీ ద్వార నిర్మాణమైన, యా = ఏదైతే, పరమాణి = ఉత్కృష్ట, ధామాని = నామము, రూపము మరియు స్థానమున్నదో, యా = ఎవడైతే, మధ్యమా = మధ్యమ శ్రేణివాడు, ఉత = మరియు, యా = ఎవడైతే, అవమా = నిమ్న శ్రేణివాడు ఉండునో, ఇమా = వీరందరికి, సఖిభ్యః = జ్ఞానజీవులకు, శిక్షా = ఉపదేశము చేయుదువు, స్వధావః = ఓ ప్రకృతి యొక్క స్వామీ? స్వయమ్ = స్వయముగా, హవిషి = అన్నము మొదలగు వానితో, వృధానః = పెంచుచు, తన్వమ్ = ప్రాణులకు శరీరమును, యజస్వ = ఇచ్చెదవు. ౫.

**భావార్థము:-** విశ్వమునకు కర్తవగు ఓ ప్రభో! నీ ద్వారా నిర్మితమైన ఉత్తమ, మధ్యమ, అథమ శ్రేణి యొక్క ఎన్ని పేర్లున్నవో జలము మరియు స్థానము లున్నవో వాని సకల ప్రాణులకు ఉపదేశము చేయుదువు. మరియు అన్నము మొదలగు వానితో పెంచుచు జీవులకు శరీరమును ఇచ్చెదవు. ౫.

౬ ఋషిః:- విశ్వకర్మా భౌవనః॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- విరాట్ త్రిష్టుప్॥ స్వరః:- ధైవతః॥

సమస్త ఐశర్యములకు స్వామి, జ్ఞానదాత విశ్వకర్మ పరమేశ్వరుడు.

**విశ్వకర్మన్ హవిషా వావృధానః స్వయం యజస్వ పృథివీముత ద్యామ్।**
**ముహ్యన్త్వన్యే అభితో జనాస ఇహాస్మాకం మఘవా సూరిరస్తు॥ ౬ ॥**

(ఋగ్వే॥ ౧౦ - ౮౧ - ౬)

**పదార్థము:-** విశ్వకర్మన్ = సమస్త జగత్తును నిర్మించిన ఓ ప్రభో! హవిషా = నీ యొక్క ప్రకృతి శక్తితో, వావృధానః = ఎక్కువగుచున్న, పృథివీమ్ = పృథివిని, ఉత = మరియు, ద్యామ్ = ఆకాశమును, యజస్వ = ఇచ్చెదవు. లేక సాంగత్యమును కలుగజేయుదువు. అన్యే = ఇతర అజ్ఞానులు, జనాసః = జీవులు, అమితః = ఎల్లప్పుడు, ముహ్యన్తు = యథార్థమును తెలుసుకొనజాలవు, మఘవా = సమస్త ఐశ్వర్యములకు స్వామివి, అస్మాకమ్ = మా యొక్క, ఇహ = ఈ జగత్తులో, సూరిః = జ్ఞాన దాతవుగా, అస్తు = ఉన్నావు. ౬.

**భావార్థము:-** సమస్త జగత్తునకు నిర్మాతవగు ఓ ప్రభో! నీవు నీ ప్రకృతి శక్తితో పెరిగిన భూమిని మరియు ఆకాశమును సాంగత్యము కలుగజేయుదువు. ఇతర అజ్ఞానులైన జీవులు నిజమును తెలుసుకొనలేకున్నవి. సమస్త ఐశ్వర్యములకు స్వామివైన ఓ పరమేశ్వరా! నీవే ఈ ప్రపంచములో మాకు జ్ఞాన దాతవు. ౬.

౭ ఋషిః:- విశ్వకర్మా భౌవనః॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- నిచృ త్త్రిష్టుప్॥ స్వరః:- ధైవతః॥

సమస్త విశ్వమునకు కళ్యాణ కర్త విశ్వకర్మ పరమేశ్వరుడు

**వాచస్పతిం విశ్వకర్మాణమూతయే మనోజువం వాజే అద్యా హువేమ।**

**స నో విశ్వాని హవనాని జోషద్విశ్వశమ్భూరవసే సాధుకర్మా ॥ ౭ ॥**

( ఋగ్వే॥ ౧౦ - ౮౧ - ౭)

**పదార్థము:-** వాచః పతిమ్ = వేదవాణి యొక్క స్వామి, విశ్వకర్మాణమ్ = సమస్త జగత్తునకు కర్త, మనోజువమ్ = మనస్సు యొక్క వేగమునకు సమానమైన పరమేశ్వరుని, ఊతయే = తన రక్షణ కొరకు (మరియు), వాజే = ఐశ్వర్యము మరియు జ్ఞానము కొరకు, హువేమ = స్తుతించెదరు లేక పిలిచెదరు. విశ్వశమ్భూః = అందరి యొక్క కళ్యాణకారుడై, సాధుకర్మా = శ్రేష్టమైన కర్మలు గల వాడగు, సః = ఆ పరమేశ్వరుడు, అవసే = మా రక్షణ కొరకు, నః = మా యొక్క, విశ్వా = సమస్త, హవనాని = స్తుతిని, యజ్ఞము మొదలగు వానిని, జోషత్ = స్వీకరించును. ౭.

**భావార్థము:-** వేదవాణి యొక్క స్వామి, సర్వ ప్రపంచమునకు కర్త, మనస్సునకు సమానమైనటువంటి వేగము గల పరమేశ్వరుని తమ రక్షణ కొరకు, జ్ఞానము మరియు ఐశ్వర్యమును పొందుట కొరకు పిలిచెదరు. సమస్త విశ్వమునకు కళ్యాణ కర్త, ఉత్తమమైన కర్మలు గలవాడగు ఆ ప్రభువు మన రక్షణ కొరకు మా యొక్క సమస్త స్తుతులను మరియు యజ్ఞము మొదలగు వానిని స్వీకరించును. ౭.

౮ ఋషిః:- విశ్వకర్మా భౌవనః॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- త్రిష్టుప్॥ స్వరః:- ధైవతః॥

జ్ఞానశక్తితో ధీరుడైన విశ్వకర్మ పరమేశ్వరుడు

చక్షుషః పితా మనసా హి ధీరో ఘృతమేనే అజనన్నమ్నమానే।
యదేదన్తా అదదృహన్త పూర్వ ఆదిద్ ద్యావాపృథివీ అప్రథేతామ్ ॥ ౮ ॥

(ఋగ్వే॥ ౧౦ - ౮౨ - ౧)

**పదార్థము:-** చక్షుషః = నేత్రములు మొదలగు వానితో కలిసి యున్న శరీర అవయవ సమూహములను మరియు సూర్యుడు మొదలగు ప్రకాశమానమైన లోకములను, పితా = పాలించువాడు లేక ఉత్పన్నము చేయువాడు, మనసా = జ్ఞానశక్తితో, హి = నిశ్చయముగ, ధీరః = ధీరుడు, ఘృతమ్ = ప్రకాశమునకు ముందు, అజనత్ = ఉత్పన్నము చేయును. మరల, నమ్నమానే = వేగమైన సంచలనముతో, ఏతే = ఆకాశమును మరియు పృథివిని ఉత్పన్నము చేయును. యదా ఇత్ = అప్పుడు, పూర్వే = పూర్వ, అన్తః = దిశలను, అదదృహన్త = దృఢముగ చేయును. ఆత్ ఇత్ = ఐన యెడల, ద్యావా పృథివీ = ఆకాశము మరియు పృథివి, అప్రథేతామ్ = విస్తరించును. ౮.

**భావార్థము:-** నేత్రములు మొదలగు వానితో కలిసియున్న శరీర అవయవ సమూహములను మరియు సూర్యుడు మొదలగు ప్రకాశమానమైన లోకములను సృష్టించువాడు, జ్ఞానశక్తితో ధీరుడైన పరమేశ్వరుడు ప్రకాశమును అనగా విరాట్ స్వరూపమును ఉత్పన్నము చేయును. మరల వేగ సంచలనముతో కూడిన ఆకాశమును మరియు పృథివిని ఉత్పన్నము చేయును. తరువాత ఆయన దిశలను మరియు ఆకాశమును ఉత్పన్నము చేయును. అప్పుడు ఆకాశము మరియు పృథివి దానిలో వ్యాపించును. ౮.

౯ ఋషిః:- విశ్వకర్మా భౌవనః॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- భురిక్, త్రిష్టుప్॥ స్వరః:- ధైవతః॥

అందరిని ధరించువాడు విశ్వకర్మ పరమేశ్వరుడు

విశ్వకర్మా విమనా ఆద్విహాయా ధాతా విధాతా పరమోత సన్దృక్।
తేషామిష్టాని సమిషా మదన్తి యత్రా సప్తఋషీన్పర ఏకమాహుః ॥ ౯ ॥

(ఋగ్వే॥ ౧౦ - ౮౨ - ౨)

**పదార్థము:-** విశ్వకర్మా = జగత్తును రచించుటకు వివిధములైన కర్మలను చేయువాడు, విమనాః = విస్తృతమైన జ్ఞానము గలవాడు, ఆ = అన్ని దిశల నుండి, విహాయా = ఆకాశము వలె వ్యాపించువాడు, ధాతా = సమస్త విశ్వమును ధరించువాడు, విధాతా = పృథివి సూర్యుడు మొదలగు వివిధ పదార్థములను సృష్టించువాడు, పరమా = పరమోత్కృష్టుడు (పరమ శ్రేష్ఠుడు), ఉత = మరియు, సన్దృక్ = సర్వమును చూచువాడు. యత్ర = ఆయన యొక్క రక్షణలో మరియు ధరించుటలో, సప్త = ఏడు, ఋషీన్ = ఇంద్రియములతో (చెవి, కన్ను, నాలుక, ముక్కు, చర్మము, అను పంచ జ్ఞానేంద్రియములు, మనస్సు మరియు బుద్ధితో), పరః = సూక్ష్మమైన, ఏకమ్ = ఒక ఆత్మ ఉండునని, ఆహుః = జ్ఞాను లందురు. తేషామ్ = ఈ ఇంద్రియముల యొక్క, ఇష్టాని = అభిలషించిన యోగ్య పదార్థములను, దానిని, ఇషా = జ్ఞానము మరియు ప్రయత్నముతో, మదన్తి = బాగుగా సంతోషము మొదలగు వానికి కారణమగును. ౯.

**భావార్థము:-** పరమేశ్వరుడు జగత్తును సృష్టించుటకు వివిధ కర్మల యొక్క కర్త. విస్తారమైన జ్ఞానము గలవాడు, ఆకాశము వలె వ్యాపించువాడు, అందరిని ధరించువాడు మరియు నిర్మాత, పరమోత్కృష్టుడు, సర్వమును చూచువాడు. ఆయన యొక్క రక్షణ మరియు ఏర్పాటులో ఏడింద్రియములతో సూక్ష్మమైన ఒక జీవాత్మ యుండును. దానిని జ్ఞానులు తెలిసికొందురు. ఈ ఇంద్రియముల యొక్క భోగము ఆ ఆత్మ యొక్క జ్ఞానము మరియు ప్రయత్నముతో బాగుగా ఆనందము మొదలగు వానికి కారణమగును. ౯.

౧౦ ఋషిః:- విశ్వకర్మా భౌవనః ॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- నిచృ త్త్రిష్టుప్॥ స్వరః:- ధైవతః॥

అద్వితీయుడు విశ్వకర్మ పరమేశ్వరుడు

**యో నః పితా జనితా యో విధాతా ధామాని వేద భువనాని విశ్వా।**

**యో దేవానాం నామధా ఏక ఏవ తం సంప్రశ్నం భువనా యన్త్యన్యా॥ ౧౦ ॥**

(ఋగ్వే॥ ౧౦ - ౮౨ - ౩)

**పదార్థము:-** యః = ఏ పరమేశ్వరుడైతే, నః = మా యొక్క, పితా = పాలకుడు, మరియు, జనితా = ఉత్పన్నము చేయువాడు, యః = ఎవడైతే, విధాతా = సంపూర్ణ జగత్తును రచించువాడో, ఎవడైతే, విశ్వా = సంపూర్ణ, ధామాని = స్థానములలో, భువనాని = లోకములను, వేద = తెలిసికొనునో, యః = ఎవడైతే, దేవానామ్ = సమస్త పదార్థముల

యొక్క, నామధాః = పేరు పెట్టువాడు, మరియు, ఏక ఏవ = అద్వితీయమైన వాడో, తమ్ = అతనే, సంప్రశ్నమ్ = అన్ని ప్రశ్నల యొక్క ప్రశ్నలను, అన్యా = ఇతర, భువనా = లోకములు మొదలగునవి, యన్తి = ప్రాప్తమగును. ౧౦.

**భావార్థము:-** ఏ పరమేశ్వరుడు మన పాలకుడు, మనను ఉత్పన్నము చేయువాడు ఎవడైతే సమస్త ప్రపంచమును నిర్మించునో మరియు సమస్త స్థానములను, లోకములను మరియు పదార్థములను తెలిసి కొనునో మరియు ఎవడైతే సమస్త పదార్థములకు పేరు పెట్టునో అతడే అద్వితీయుడు (అనగా అతడొక్కడే). సమస్త సమస్యలకు అతడొక్కడు మాత్రమే సమాధానుడు. ౧౦

౧౧ ఋషిః:- విశ్వకర్మా భౌవనః ॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- భురిక్ త్రిష్టుప్॥ స్వరః:- ధైవత:॥

విశ్వకర్మ పరమేశ్వరుడు సమస్త భూత జాలముల నుత్పన్నము చేయును

**త ఆయజన్త ద్రవిణం సమస్మై ఋషయః పూర్వే జరితారో న భూనా।**

**అసూర్తే సూర్తే రజసి నిషత్తే యే భూతాని సమకృణ్వన్నిమాని॥ ౧౧ ॥**

(ఋగ్వే॥ ౧౦ - ౮౨ - ౪)

**పదార్థము:-** పూర్వే = పూర్వ కల్పమునకు సమానమైన ఈ కల్పములో, తే = ఆయన, ఋషయః = జగత్తును చేయు పదార్థము, జరితారః న = స్తుతి చేయించు వానికి సమానము, అస్మై = ఈ పరమేశ్వరుని సృష్టి రచన కొరకు, భూనా = తన శక్తితో, ద్రవిణమ్ = శీఘ్రముగా పోవు గమనము సంయోగ మరియు వియోగములను, సమ్ ఆయజన్త = కలయును లేక ప్రాప్తమగును. యే = ఎవడైతే, నిషత్తే = దృఢముగ, అసూర్తే = చలనము లేని - స్థావరములు, సూర్తే = చలనముతో కూడిన స్థావర - జంగమములు (ప్రాణులు), రజసి = లోకములో, ఇమాని = వీని, భూతాని = భూత సముదాయములను, సమ్ అకృణ్వన్ = ఉత్పన్నము చేయును. ౧౧

**భావార్థము:-** పూర్వ కల్పమునకు సమానము ఈ కల్పములో ఆయన జగత్తును చేయు పదార్థములు తన శక్తితో పరమేశ్వరుని సృష్టి రచనకు సంబంధించిన కార్యముల కొరకు చాలా వేగముతో సంయోగ వియోగములు పొందును. దృఢమైన స్థావర జంగమములు

(చలనము లేనివి, చలించునవి) జగత్తులో సమస్త భూత జాతములను ఆయన ఉత్పన్నము చేయును. ౧౧

౧౨ ఋషిః:- విశ్వకర్మా భౌవనః॥ దేవతా: విశ్వకర్మా॥

ఛన్దః:- త్రిష్టుప్॥ స్వరః:- ధైవతః॥

విశ్వకర్మ పరమేశ్వరుడు పంచభూతములు కన్న గొప్పవాడు

**పరో దివా పర ఏనా పృథివ్యా పరో దేవేభిరసురైర్యదస్తి।**

**కం స్విద్గర్భం ప్రథమం దధ్ర ఆపో యత్ర దేవాః సమపశ్యన్త విశ్వే॥ ౧౨ ॥**

(ఋగ్వే॥ ౧౦ - ౮౨ - ౫)

**పదార్థము:-** ఆ పరమేశ్వరుడు, దివా పరః = గొప్ప ఆకాశము కన్న గొప్పవాడు, అతడు, ఏనా = ఈ, పృథివ్యాః = పృథివి కన్నకూడ, పరః = గొప్పవాడు, యత్ = ఏదైతే, దేవేభిః = దివ్య పదార్థములు, మరియు, అసురైః = మేఘముల కన్న, పరః = గొప్పదో, కమ్ స్విత్ = ఏది, ప్రథమమ్ = శ్రేష్ఠమో? గర్భమ్ = గర్భము = విరాట్ రూపమైనట్టి హిరణ్య గర్భమును, ఆపః = ప్రకృతి యొక్క పరమాణువును, దధ్రే = ధరించునో, యత్ర = దానిలో, విశ్వే = సమస్త, దేవాః = దివ్య పదార్థములు మరియు జీవ గణములు, సమ పశ్యన్త = మనను చూచుదురు. ౧౨

**భావార్థము:-** పరమేశ్వరుడు ఆకాశము కన్న గొప్పవాడు. ఈ పృథివి కన్న గొప్పవాడు. సూర్యుడు, అగ్ని మొదలగు దేవతలు మరియు మేఘముల కన్న గొప్పవాడు. ఎవరిని మొదట ప్రకృతి పరమాణువు హిరణ్య గర్భ రూపములో ధారణము చేయునో దానిలో సమస్త దివ్య పదార్థములు మరియు జీవములు తమను దగ్గరగా పొందుదురు. ౧౨

౧౩ ఋషిః:- విశ్వకర్మా భౌవనః॥ దేవతా: విశ్వకర్మా॥

ఛన్దః:- త్రిష్టుప్॥ స్వరః: ధైవతః॥

అజన్మ విశకర్మ పరమేశ్వరుడు

**తమిద్గర్భం ప్రథమం దధ్ర ఆపో యత్ర దేవాః సమగచ్ఛన్త విశ్వే।**

**అజస్య నాభావధ్యేకమర్పితం యస్మిన్విశ్వాని భువనాని తస్థుః॥ ౧౩ ॥**

(ఋగ్వే॥ ౧౦ - ౮౨ - ౬)

**పదార్థము:-** తమ్ ఇత్ = దానియొక్క, గర్భమ్ = విరాట్ స్వరూపములో నున్నటు వంటి హిరణ్య గర్భుని, ఆపః = ప్రకృతి పరమాణువును, ప్రథమమ్ = మొదట, దధ్రే = ధరించును, యత్ర = దానిలో, విశ్వే = సమస్తమైన, దేవాః = పదార్థములు, సమగచ్ఛన్త = కలిసియుండును, అజస్య = అజన్మ పరమేశ్వరుని యొక్క, నాభౌఅధి = నాభి సంగ్రహణ శక్తిలో, ఏకమ్ = ఒక విధముగా (ఒకదాని వలె), సమర్పితమ్ = స్థాపింపబడి యున్నది. యస్మిన్ = దానిలో, విశ్వాని = సమస్త, భువనాని = భువనములు, తస్థుః = ఉండును. ౧౩

**భావార్థము:-** ఆ పరమేశ్వరుని హిరణ్య గర్భములో ప్రకృతి పరమాణువును తనలో ధారణము చేయును. దానిలో సమస్త దివ్య పదార్థములు మరియు జీవగణములు కలిసి యుండును. అజన్మ పరమేశ్వరుని నాభి ధారణ శక్తిలో ఒక విరాట్ రూపమైన బ్రహ్మాండము స్థాపితమై యున్నది. దానిలో సమస్త లోకములు ఇతర లోకములు యున్నవి. ౧౩

౧౪ ఋషిః:- విశ్వకర్మా భౌవనః॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- పాదనిచృ త్త్రిష్టుప్॥ స్వరః:- ధైవతః॥

నీ యొక్క అంతః కరణములలో ఉన్నాడు విశ్వకర్మ పరమేశ్వరుడు

**న తం విదాథ య ఇమా జజానాన్యద్యుష్మాకమన్తరం బభూవ।**

**నీహారేణ ప్రావృతా జల్ప్యా చాసుతృప ఉక్థశాసశ్చరన్తి ॥ ౧౪ ॥**

**(ఋగ్వే॥ ౧౦ - ౮౨ - ౭)**

**పదార్థము:-** ఓ జీవులారా! మీరు, తమ్ = ఆ పరమేశ్వరుని, న విదాథ = తెలిసికొనలేరు. యః = ఎవడైతే, ఇమా = ఈ సమస్త లోకమును మరియు ఇతర లోకములను, జజాన = ఉత్పన్నము చేయునో, మరియు, అన్యత్ = నీ కన్న భిన్నుడై ఇతరుడై, యుష్మాకమ్ = నీ యొక్క, అన్తరమ్ = హృదయములో, బభూవ = ఉన్నాడు. నీహారేణ = అజ్ఞానాంధకారముతో, ప్రావృతాః = కప్పబడి యున్న మనుష్యులు, జల్ప్యాః = చాల చెప్పువారు, అసుతృపః = ప్రాణముల యొక్క తృప్తిలోనే లీనమైన జనులు, మరియు, ఉక్థశాసః = కేవలము శబ్దాడంబరములు చేయువారు, చరన్తి = తిరుగుదురు. కాని ఆయనను తెలిసికొనజాలరు. ౧౪

**భావార్థము:-** ఓ జీవులారా! మీకు తెలియదు. ఆ పరమేశ్వరుడు. (అతడు) ఈ సమస్త లోకమును, ఇతర లోకములను ఉత్పన్నము చేసియున్నాడు. మరియు నీ కన్న భిన్నుడు ఇతరుడై నీ యొక్క అంతః కరణములలో ఉన్నాడు. అజ్ఞానముతో కప్పబడి కేవలము వాదించువారు, లేక శుష్క తర్కములో లీనమైనవారు తినుటలో, త్రాగుటలోనే నిమగ్నులై యుండి మరియు శబ్దాడంబరములు చేయువారు ఆయనను తెలిసికొనజాలరు. ౧౪

౧౫ ఋషిః:- నృమేధః॥ దేవతా: ఇన్ద్రః ॥

ఛన్దః:- కకుమ్మతీ ఉష్ణిక్ ॥ స్వరః- ఋషభః॥

సమస్త ప్రపంచములోని పదార్థములకు దివ్యత్త్వము నిచ్చువాడు విశ్వకర్మ పరమేశ్వరుడు.

**త్వమిన్ద్రాభిభూరసి త్వం సూర్యమరోచయః॥**

**విశ్వకర్మా విశ్వదేవో మహాఁ అసి ॥ ౧౫ ॥** (ఋగ్వే॥ ౮ - ౯౮ - ౨)

**పదార్థము:-** ఓ, ఇన్ద్ర = పరమేశ్వరా! త్వమ్ = నీవు, అభిభూః అసి = సామర్థ్యములో అందరిని ఓడించిన విద్యమానుడవు. త్వమ్ సూర్యమ్ అరోచయః = సూర్యుడు మొదలగు జ్యోతి పుంజములకు కూడా నీ యొక్క ప్రకాశమును ఇచ్చినావు. నీవు, విశ్వకర్మా = సమస్త ప్రపంచము యొక్క శిల్పివి, (అన్ని విధముల పదార్థముల యొక్క నిర్మాతవు) మరియు, విశ్వదేవః = సమస్త ప్రపంచములోని పదార్థములకు దివ్యత్త్వమును ఇచ్చువాడవు. ఇందుకొరకు నీవు, మహాఁ అసి = మహానుభావుడవై యున్నావు. ౧౫

**భావార్థము:-** సూర్యుడు మొదలగు మెరియుచున్న గోళములు మనకు ఎంత ప్రియముగా నుండును. ఆయన లేకుండ ఏ పని కూడ నడవజాలదు. కాని సూర్యుడు మొదలగు మెరియుచున్న గోళముల యొక్క ప్రకాశకుడు కూడ పరమేశ్వరుడై యున్నాడు. ఇందుకొరకు అతనికి మించి ఏదియు లేదు.

## యజుర్వేదము నుండి:-

౧౬ ఋషిః: భువన పుత్రో విశ్వకర్మా॥ దేవతా: విశ్వకర్మా॥

ఛన్దః: నిచృదార్షీ త్రిష్టుప్॥ స్వరః: ధైవతః॥

సకల భువనము లందు వ్యాప్తుడై యున్నాడు విశ్వకర్మ పరమేశ్వరుడు

య ఽ ఇమా విశ్వా భువనాని జుహ్వదృషిర్హోతా న్యసీదత్పితా నః।
స ఽ ఆశిషా ద్రవిణమిచ్ఛమానః ప్రథమచ్ఛదవరాఀ౨ఽ ఆవివేశ ॥ ౧ ॥

(యజు॥ ౧౭ - ౧౭)

**పదార్థము:-** మానవులారా! ఋషిః = జ్ఞాన స్వరూపుడు, హోతా = సకల పదార్థములను ఇచ్చువాడు, గ్రహించువాడు, నః పితా = మా రక్షకుడునగు, యః = ఏ పరమేశ్వరుడు, ఇమా విశ్వాభువనాని = ఈ సకల భువనము లందు వ్యాప్తుడై, న్యసీదత్ = నిరంతరము స్థితుడై యున్నాడో, ఎవడు సమస్త లోకములను, జుహ్వత్ = ధరించి యున్నాడో, సః = అతడు, ఆశిషా = ఆశీర్వాదముతో మాకై, ద్రవిణమ్ = ధనమును, ఇచ్ఛమానః = కోరుచున్నవాడై, మరియు, ప్రథమచ్ఛత్ = విస్తృత పదార్థముల నాచ్ఛాదిత మొనర్చుచున్నవాడై, అవరాన్ = పూర్ణాకాశాదులందు, ఆవివేశ = చక్కగా వ్యాప్తుడగు చున్నాడని మీరెరుగుడు. ౧

**భావార్థము:-** సకల జగత్తును సృజించి, ధరించి, పాలించి ప్రళయమొనర్చువాడు. సకల జీవులకు సర్వ వస్తువులను ప్రధాన మొనర్చువాడునగు నే పరమేశ్వరుడు తన వ్యాప్తిచే నాకాశాది పదార్థములందు ప్రవేశించి యున్నాడో యతనినే విద్వాంసులందురు సతత ముపాసించ వలయును. ౧

౧౭ ఋషిః:- భువన పుత్రో విశ్వకర్మా ॥ దేవతా: విశ్వకర్మా॥

ఛన్దః:- భురిగార్షీ పఙ్క్తిః॥ స్వరః:- పఞ్చమః॥

సకల జగత్తుయొక్క ద్రష్ట విశ్వకర్మ పరమేశ్వరుడు

**కిగ్ం స్విదాసీదధిష్ఠానమారమ్భణం కతమత్స్విత్కథాసీత్।**
**యతో భూమిం జనయన్విశ్వకర్మా వి ద్యామౌర్ణోన్మహినా విశ్వచక్షాః॥ ౨ ॥**

(యజు॥ ౧౭ - ౧౮ )

**పదార్థము:-** విద్వాంసుడా! ఈ జగత్తునకు, అధిష్ఠానమ్ = ఆధారము, కిం స్విత్ ఆసీత్ = ఎంత ఆశ్చర్యరూపమై యున్నది? మరియు, ఆరమ్భణమ్ = ఈ కార్య జగత్తు యొక్క రచనకు ఆరంభ కారణము, కతమత్ = అనేకోపాదానములందేది? మరియు నది, కథా స్విత్ ఆసీత్ = ఏ విధముగ తర్కించదగినదై యున్నది? యతః = దేనిచే, విశ్వకర్మా =

సమస్త అఖిల కర్మలు ఎవనియో ఆ పరమేశ్వరుడు, విశ్వచక్షాః = సకల జగత్తు యొక్క ద్రష్ట, జగదీశ్వరుడు, భూమిమ్ = భూమిని, ద్యామ్ = సూర్యాదిలోకములను, జనయన్ = ఉత్పన్నమొనర్చు చున్న వాడునునై, మహినా = స్వమహిమచే, ఔర్ణోత్ = వివిధ విధముల నాచ్ఛాదిత మొనర్చుచున్నాడు. (కప్పుచున్నాడు). ౨

**భావార్థము:-** మానవులారా! ఈ జగత్తెక్కడ యున్నది? దీనికి కారణమేమిటి? ఎందు కుత్పన్నమగుచున్నది? అను ప్రశ్నలకు సమాధానమిది:- ఏ జగదీశ్వరుడు కార్య జగత్తు నుత్పన్నమొనర్చి స్వవ్యాప్తిచే సర్వమును ఆచ్ఛాదించి (కప్పి), సర్వజ్ఞత్వముచే సకలమును వీక్షించుచున్నాడో అతడీ జగత్తునకు ఆధారమును నిమిత్త కారణమునునై యున్నాడు. అతడు సర్వశక్తి మంతుడు. రచనాది, సామర్థ్య యుక్తుడునై యున్నాడు. జీవులకు పాప పుణ్యముల ఫలమిచ్చి భోగింపజేయుటకై ఈ సమస్త ప్రపంచమును రచించెనని మీరెరుగవలెను. ౨

౧౮ ఋషిః:- భువన పుత్రో విశ్వకర్మా ॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః: భురిగార్షీ త్రిష్టుప్॥ స్వరః:- ధైవతః॥

విశకర్వ పరమేశ్వరుడే ఉపాసనీయుడు, సర్వత్రరక్షకుడు

**విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతోబాహురుత విశ్వతస్పాత్।**

**సం బాహుభ్యాం ధమతి సం పతత్రైర్ద్యావాభూమీ జనయన్దేవ ఉ ఏకః॥ ౩ ॥**

**(యజు॥ ౧౭ - ౧౯)**

**పదార్థము:-** మానవులారా! మీరు, విశ్వతశ్చక్షుః = సకల సంసార ద్రష్ట, ఉత = మరియు, విశ్వతోముఖః = అన్ని వైపుల నుండి యందరి కుపదేశించు వాడు, విశ్వతోబాహుః = అన్ని విధముల యనంత బల పరాక్రమములు గలవాడు, ఉత = మరియు, విశ్వతస్పాత్ = సర్వత్ర వ్యాపించి యున్నవాడు, ఏకః = అద్వితీయుడు, అసహాయకుడు నగు నే, దేవః = స్వయం ప్రకాశకుడు, పతత్రైః = పతన శీలములకు పరమాణ్వాదులచే, ద్యావాభూమీ = తరణి (సూర్య) ధరణి (భూ) లోకములను, సం జనయన్ = కార్యరూపమున ప్రకటింపజేయుచు, బాహుభ్యామ్ = అనంత బల పరాక్రమములచే సకల జగత్తును, సం ధమతి = చక్కగా పొందుచున్నాడో, ఆ పరమేశ్వరుడే ఉపాసనీయుడు, సర్వత్ర రక్షకుడు నని యెరుగుడు. ౩

**భావార్థము:-** సూక్ష్మము కంటే సూక్ష్ముడు. పెద్దవాని కంటె పెద్ద, నిరాకారుడు, అనంత సామర్థ్యవంతుడు, సర్వ వ్యాపకుడు, ప్రకాశ స్వరూపుడు, అద్వితీయడునగు పరమాత్మ యెవడున్నాడో అతడే అతి సూక్ష్మ కారణము నుండి స్థూలమగు కార్యరూప జగత్తును రచించుటకు వినాశమొనర్చుటకు సమర్థుడు. అటువంటి ఇతనిని వదిలి ఇతరుని ఉపాసించు వాని కంటే భాగ్యహీనుడెవ రీ జగత్తులో నుండును? ౩

౧౯ ఋషిః:- భువన పుత్రో విశ్వకర్మా ॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- స్వరాడార్షీ త్రిష్టుప్॥ స్వరః:- ధైవతః॥

అన్నిటిని విశ్వకర్మ యగు ఈశ్వరుడు ధారణ మొనర్చుచున్నాడు

**కిగ్ంస్విద్వనం క ఉ స వృక్ష ఉ ఆస యతో ద్యావాపృథివీ నిష్టతక్షుః।**
**మనీషిణో మనసా పృచ్ఛతేదు తద్యదధ్యతిష్ఠద్ భువనాని ధారయన్ ॥౪॥** (యజు॥ ౧౭ - ౨౦)

**పదార్థము:-** మనీషిణః = మనో నిగ్రహము గల యోగులారా! మీరు, మనసా = విజ్ఞానముతో విద్వాంసులను, కిం స్విత్ = ఏది, వనమ్ = సేవించదగిన కారణరూప వనము? మరియు, కః ఉ = ఏది, సః వృక్షః ఆస = ఛిద్యమానము అనిత్యము కార్యరూపమునగు సంసారమై యున్నది? అటుల, పృచ్ఛత = అడుగుడు. యతః = దేని నుండి, ద్యావా పృథివీ = విస్తార యుక్తుడైన సూర్యుని, భూమ్యాది లోకములను ఎవడు, నిష్టతక్షుః = వేరు వేరుగ నొనర్చునో? యత్ = ఎవడు, భువనాని = ప్రాణులుండు స్థానమును లోక లోకాంతరములను, ధారయన్ = వాయు విద్యుత్సూర్యాదుల ద్వారా ధారణ మొనరింపజేయుచు, అధ్యతిష్ఠత్ = అధిష్ఠాతయై యున్నాడో, తత్ ఇత్ ఉ = ఆ ప్రసిద్ధమైన బ్రహ్మను ఈ సమస్తమునకు కర్తగా నెరుగుడు. ౪

**భావార్థము:-** ఈ మంత్రమందలి మొదటి మూడు చరణములలో ప్రశ్నలున్నవి. చివరి పాదము నందు సమాధానమున్నది. వృక్ష శబ్దముచే కార్యము, వన శబ్దముచే కారణమును గ్రహించబడును. ఎటుల సకల పదార్థములను - పృథివి, పృథివిని సూర్యుడు, సూర్యుని విద్యుత్తు, విద్యుత్తును వాయువు ధరించుచున్నదో అటులనే వీని నన్నిటిని ఈశ్వరుడు ధారణ మొనర్చుచున్నాడు. ౪

౨౦ ఋషిః:- భువన పుత్రో విశ్వకర్మా॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- ఆర్షీ త్రిష్టుప్॥ స్వరః:- ధైవతః॥

విశ్వకర్మ యగు జగదీశ్వరా! మాకు శుభగుణోపదేశ మొనర్చుము

**యా తే ధామాని పరమాణి యావమా యా మధ్యమా విశ్వకర్మన్నుతేమా।**

**శిక్షా సఖిభ్యో హవిషి స్వధావః స్వయం యజస్వ తన్వం వృధానః ॥ ౫ ॥ (యజు॥ ౧౭ - ౨౧)**

**పదార్థము:-** స్వధావః = ఎక్కువ అన్నము గలవాడా! విశ్వకర్మన్ = సకల శ్రేష్ఠకర్మలు నాచరించువాడా! జగదీశ్వరా! తే = నీ సృష్టిలో, యా పరమాణి = ఏ శ్రేష్ఠములు, యా అవమా = ఏ నికృష్టములు (నీచములు), యా మధ్యమా = ఏ మధ్య రకములున్నైన, ధామాని = సకల పదార్థములకు ఆధార భూతము లగు జన్మ స్థాన నామములున్నవో, ఇమా = వీని నన్నిటిని, హవిషి = ఆధాన ప్రధాన (ఇచ్చిపుచ్చుకొను) వ్యవహారమునందు, స్వయమ్ = స్వయముగ, యజస్వ = సంగత మొనర్చుము. ఉత = మరియు, మా యొక్క, తన్వమ్ = శరీరమును, వృధానః = వృద్ధి పరచుచు, సఖిభ్యః = మీ యాజ్ఞా పాలకులము, మిత్రులము నగు మాకు, శిక్షా = శుభ గుణోపదేశ మొనర్చుము. ౫

**భావార్థము:-** ఈ జగత్తులో నీశ్వరుడెటుల నికృష్ట మధ్యమ శ్రేష్ఠ పదార్థములను, స్థానములను రచించెనో అటులనే సభాపతి మొదలైన వారు మూడు రకముల స్థానములను నిర్మించి వస్తువులను పొంది, బ్రహ్మచర్యముచే శరీర బలమును పెంపొందింపజేసి, మిత్రులకు సుశిక్ష గరిపి ఐశ్వర్యవంతులు కావలయును. ౫

౨౧. ఋషిః:- భువన పుత్రో విశ్వకర్మా॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- భురిగార్షీ త్రిష్టుప్॥ స్వరః:- ధైవతః॥

అభీష్టసాధనకై మీరు విశ్వకర్మ పరమేశ్వరునినే ఉపాసించుడు.

**విశ్వకర్మా విమనా ఽ ఆద్విహాయా ధాతా విధాతా పరమోత సన్దృక్।**

**తేషామిష్టాని సమిషా మదన్తి యత్రా సప్తఋషీన్ పర ఽ ఏకమాహుః॥ ౬ ॥**

**(యజు॥ ౧౭ - ౨౬)**

**పదార్థము:-** మానవులారా! విశ్వకర్మా = సమస్త జగత్తును రచించు కర్మ గలవాడు, విమనాః = వివిధ విజ్ఞానములు గలవాడు, విహాయాః = వివిధ పదార్థములందు వ్యాప్తుడు, ధాతా = అందరిని ధరించువాడు, పోషించువాడు, విధాతా = రచించువాడు, సన్దృక్ = బాగుగ నందరిని చూచువాడు, పరః = సర్వోత్తముడున్నై, మరియు నెవనిని, ఏకమ్ =

అద్వితీయుడని, ఆహుః = చెప్పుదురో అనగా ఎవని విషయములో చెప్పుటకు రెండవవాడు సరితూగడో, అత్ = మరియు, యత్ర = ఎందు, సప్తఋషీన్ = పంచ ప్రాణములు, సూత్రాత్మ, ధనంజయము అను నేడింటిని పొంది, ఇషా = ఇచ్ఛతో జీవులు, సం మదన్తి = చక్కగా నానందమును పొందునో, ఉత్ = మరియు నెవడు, తేషామ్ = ఆ జీవుల యొక్క, పరమా = శ్రేష్టములైన, ఇష్టాని = సుఖమును సిద్ధింపజేయు కార్యములను సిద్ధింపజేయుచున్నాడో ఆ పరమేశ్వరుని మీరు ఉపాసించుడు. ౬

**భావార్థము:-** మానవు లందరు సకల జగత్స్రష్ట, ధర్త, పాలకుడు, నాశకుడు, అద్వితీయుడు నగు పరమేశ్వరునినే అభీష్ట సాధనకై ఉపాసించవలయును. ౬

౨౨. ఋషిః:- భువన పుత్రో విశ్వకర్మా ॥ దేవతా:- విశ్వకర్మా ॥

ఛన్దః:- నిచృదార్షీ త్రిష్టుప్ ॥ స్వరః:- ధైవతః॥

తండ్రి వలె సకల విశ్వమును పాలించువాడు విశ్వకర్మ పరమేశ్వరుడు

**యో నః పితా జనితా యో విధాతా ధామాని వేద భువనాని విశ్వా।**

**యో దేవానాం నామధా ఽ ఏక ఽ ఏవ తగ్ం సంప్రశ్నం భువనా యన్త్యన్యా॥ ౭ ॥**

**(యజు॥ ౧౭ - ౨౭)**

**పదార్థము:-** మానవులారా! యః = ఎవడు, నః పితా = మన పాలకుడు, జనితా = సకల వస్తూత్పాదకుడు, మరియు, యః = ఎవడు, విధాత = కర్మానుసారము ఫలమిచ్చువాడు, జగ న్నిర్మాత, విశ్వాభువనాని = సకల లోకములను, ధామాని = జన్మ స్థాన నామములను, వేద = ఎరుగుచున్నాడో, యః = ఎవడు, దేవానామ్ = విద్వాంసుల యొక్కయు, పృథివ్యాది పదార్థముల యొక్కయు, నామధాః = స్వవిద్యచే నామముంచువాడో, ఏకః = ఒకడు, అద్వితీయుడునై, ఏవ = నిశ్చయముగ నున్నాడో, ఎవనిని, అన్యా = ఇతరములైన, భువనా = లోక పదార్థములు, యన్తి = పొందుచున్నవో, సంప్రశ్నమ్ = చక్కగా సంప్రశ్నము లొనర్చ తగినవాడైన, తమ్ = ఆ పరమేశ్వరుని మీరెరుగుడు. ౭

**భావార్థము:-** తండ్రివలె సకల విశ్వమును పాలించువాడు, సమస్తమును ఎరుగువాడునగు నే పరమేశ్వరుడున్నాడో అతని యొక్కయు, అతని సృష్టి యొక్కయు విజ్ఞానము వలననే సకల మానవులు పరస్పరము కలిసి ప్రశ్నోత్తరము లొనర్చుకొనవలయును. ౭

౨౩. ఋషిః:- భువన పుత్రో విశ్వకర్మా ॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- ఆర్షీ త్రిష్టుప్ ॥ స్వరః:- ధైవతః॥

విశ్వకర్మ యగు బ్రహ్మయే ఉపాసించ తగినవాడు

**పరో దివా పర ఏనా పృథివ్యా పరో దేవేభిరసురైర్యదస్తి।**

**కగ్ం స్విద్గర్భం ప్రథమం దధ్ర ఆపో యత్ర దేవాః సమపశ్యన్త పూర్వే॥ ౮ ॥ (యజు॥ ౧౭ - ౨౯)**

**పదార్థము:-** మానవులారా! ఎవడు, ఏనా దివా = ఈ సూర్యాది లోకముల కంటె, పరః = పరుడు (పరమేశ్వరుడు), అత్యుత్తముడు, పృథివ్యా పరః = పృథి వ్యాది లోకముల కంటె పరుడు, దేవేభిః = విద్వాంసుల కంటెను, దివ్య ప్రకాశవంతులగు ప్రజల కంటెను, అసురైః = అవిద్వాంసుల కంటెను లేక అంతక రూప ప్రజల కంటెను, పరః = పరుడునై, అస్తి = ఉన్నాడో, యత్ర = ఎవని యందు, ఆపః = ప్రాణములు, కం స్విత్ = ఏదోనొక, ప్రథమమ్ = విస్తృతము, గర్భమ్ = గ్రహించదగినదియునగు పదార్థమును, దధ్రే = ధరించుచున్నవో, యత్ = ఎవనిని, పూర్వే = పూర్ణ విద్య నధ్యయన మొనర్చువారైన, దేవాః = విద్వాంసులు, సమపశ్యన్త = బాగుగ జ్ఞాన చక్షువులతో చూచుచున్నారో, అతడు బ్రహ్మయని మీరెరుగుడు. ౮

**భావార్థము:-** ఎవడు అందరి కంటే సూక్ష్ముడు, గొప్పవాడు, అతిశ్రేష్ఠుడు, సర్వధర్త, విద్వాంసులకు విషయము అనగా సకల విద్యలకు సమాధానరూపము, అనాది, చేతన మాత్రుడునై ఉన్నాడో ఆ బ్రహ్మయే ఉపాసించ తగినవాడు. ఇతరము కాజాలదు. ౮

౨౪. ఋషిః:- భువన పుత్రో విశ్వకర్మా॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- ఆర్షీ త్రిష్టుప్॥ స్వరః:- ధైవతః॥

విశ్వకర్మ పరమాత్మనే సకల మానవులు సేవించ వలయును

**తమిద్గర్భం ప్రథమం దధ్ర ఆపో యత్ర దేవాః సమగచ్ఛన్త విశ్వే।**

**అజస్య నాభావధ్యేకమర్పితం యస్మిన్విశ్వాని భువనాని తస్థుః॥ ౯ ॥ (యజు॥ ౧౭ - ౩౦)**

**పదార్థము:-** మానవులారా! యత్ర = ఏ బ్రహ్మయందు, ఆపః = కారణ మాత్రములైన ప్రాణములు, జీవులు, ప్రథమమ్ = విస్తార యుక్తము అనాదియునైన, గర్భమ్ = సకల లోకముల ఉత్పత్తికి స్థానమైన ప్రకృతిని, దధ్రే = ధారణ మొనర్చుచున్నవో, ఎందు, విశ్వే

దేవాః = సకల దివ్యాత్మలు మరియు అంతఃకరణ యుక్త యోగులు, సమగచ్ఛన్త = సంలీనమగుదురో, ఏది, అజస్య = అనుత్పన్నము అనాదియు నగు జీవము యొక్క లేక అవ్యక్తమైన కారణము యొక్క, నాభౌ = మధ్యన, అధి = అధిష్టాతృత్వముగ అన్నిటిపైన విరాజమానమై, ఏకమ్ = స్వయం సిద్ధమునై, అర్పితమ్ = స్థితమునై యున్నదో, యస్మిన్ = ఎందు, విశ్వాని భువనాని = సకల లోకోత్పన్న ద్రవ్యములు, తస్థుః = స్థిరము లగు చున్నవో, తమిత్ = మీ రతినినే పరమాత్మగనెరుగుడు. ౯

**భావార్థము:-** జగదాధారుడు, యోగిజన గమ్యుడు, అంతర్యామి, తనకు తానే ఆధారుడు, సర్వ వ్యాపకుడునై యెవడున్నాడో అతనినే సకల మానవులు సేవించ వలయును. ౯

౨౫. ఋషిః:- భువన పుత్రో విశ్వకర్మా ॥ దేవతా:- విశ్వకర్మా ॥

ఛన్దః:- భురిగార్షీ పఙ్క్తిః॥ స్వరః:- పఞ్చమః॥

విశ్వకర్మ యగు బ్రహ్మ నెరుగుటకు పవిత్రాత్ములే అర్హులు.

**న తం విదాథ య ఉ ఇమా జజానాన్యద్యుష్మాకమన్తరం బభూవ।**

**నీహారేణ ప్రావృతా జల్ప్యా చాసుతృప ఉ ఉక్థశాసశ్చరన్తి ॥ ౧౦ ॥ (యజు॥౧౭ - ౩౧)**

**పదార్థము:-** మానవులారా! బ్రహ్మను ఎరుగని పురుషులు, నీహారేణ = ధూమము వలె నుండు పొగ మంచు యను అజ్ఞానాంధకారముచే, ప్రావృతాః = బాగుగా ఆవరించబడినవారు. జల్ప్యా = ఈషన్మాత్ర సత్యాసత్యములు గల వాదాను వాదము లందు స్థిరులు, అసుతృపః = ప్రాణపోషకులు, చ = మరియు, ఉక్థశాసః = యోగాభ్యాసమును వదలి శబ్దార్థ సంబంధపు ఖండన మండనము లందున రమించువారునునై, చరన్తి = ఎటుల విచరించుచున్నారో, ఆ విధముగ నుండి మీరు, తమ్ = ఆ పరమాత్మను, న విదాథ = ఎరుగకున్నారు. యః = ఎవడు, ఇమాః = ఈ ప్రజలను, జజాన = ఉత్పన్నమొనర్చునో మరియు నే బ్రహ్మ, యుష్మాకమ్ = అధర్మలు అజ్ఞానులునగు మీ కంటెను జీవము కంటెను భిన్నుడై, అన్తరమ్ = సకల జీవులందు స్థితుడై యుండియు దూరస్థుడుగ, బభూవ = ఉండుచున్నాడో అట్టి అతి సూక్ష్ముడు, ఆత్మకు ఆత్మ అనగ పరమాత్మయునగు నాతనిని ఎరుగకున్నారు. ౧౦

**భావార్థము:-** బ్రహ్మచర్యాది వ్రత రహితులు, ఆచారహీనులు, విద్యా యోగాభ్యాస విరహితులు, ధర్మానుష్ఠాన విరతులు, సత్సంగ శూన్యులు, పురుషార్థహీనులు నైనవారు

అజ్ఞానాంధకారమున అణగిపోయినవారై బ్రహ్మను ఎరుగజాలకున్నారు. జీవులకు భిన్నుడ సర్వాంతర్యామి, సర్వ నియంత, సర్వ వ్యాపకుడునగు బ్రహ్మను ఎరుగుటకు పవిత్రాత్ములై అర్హులు. కాని ఇతరులు కాజాలరు. ౧౦

౨౬. ఋషిః:- వశిష్ఠః ॥ దేవతాః:- విశ్వకర్మా॥

ఛన్దః:- విరాడతిజగతీ॥ స్వరః:- నిషాదః॥

పాలకుడు విశ్వకర్మ జగదీశ్వరుడు

**చిత్తిం జుహోమి మనసా ఘృతేన యథా దేవా ఉ ఇహాగమన్వీతిహోత్రా ఉ ఋతావృధః॥ పత్యే విశ్వస్య భూమనో జుహోమి విశ్వకర్మణే విశ్వాహాదాభ్యగ్ం హవిః ॥ ౧౧ ॥**

**(యజు॥ ౧౭ - ౭౮)**

**పదార్థము:-** మానవులారా! యథా = ఎటుల, నేను, మనసా = విజ్ఞానము చేతను, ఘృతేన = నేతితోను, చిత్తిమ్ = సంచయ మొనర్చు క్రియను, జుహోమి = గ్రహించుచున్నానో, లేక ఎటుల, ఇహ = ఈ జగత్తు నందు, వీతిహోత్రాః = అన్ని దిక్కులందు ప్రకాశమానమైన యజ్ఞము కలవారు, ఋతావృధః = సత్యముచే వృద్ధినొందువారు, దేవాః = కామించువారు నగు విద్వాంసులు, భూమనః విశ్వస్య = బహురూపములు గల సకల సంసారము (ప్రపంచము) యొక్క, విశ్వకర్మణే = క్రియమాణ సకల కర్మల నొనర్చినవాడు, పత్యే = పాలకుడు నగు జగదీశ్వరునికై, అధాభ్యమ్ = నష్టమొనర్చ తగనది, హవిః = హోమ మొనర్చతగినదియు నగు పదార్థమును, విశ్వాహా ఆగమన్ = సర్వ దినములందు హోమమొనర్చుటకు వచ్చుచున్నారో, మరియు నేను హోమ మొనర్చదగు పదార్థములను, జుహోమి = హోమ మొనర్చుచున్నానో అటులనే మీరును ఆచరించుడు. ౧౧

**భావార్థము:-** కాష్ఠచితమైన యగ్ని ఎటుల నేతితో పెద్ద దగుచున్నదో అటులనే విజ్ఞానముచే నేను అభివృద్ధి చెందుదును గాక! ఎటుల ఈశ్వరోపాసన యొనర్చు విద్వాంసులు జగత్తు యొక్క కళ్యాణమునకు ప్రయత్నించెదరో అటులనే నేనును ప్రయత్నించెదను గాక! ౧౧

౨౭. ఋషిః:- శాసః॥ దేవతా:- ఈశ్వర సభేశౌ రాజానౌ॥

ఛన్దః:- భురిగార్షీ త్రిష్టుప్, విరాడార్ష్యనుష్టుప్॥ స్వరః:- ధైవతః॥ గాన్ధారః॥

ధర్మయుక్తములగు సర్వకర్మలు గలవాడు విశ్వకర్మ పరమేశ్వరుడు

వాచస్పతిం విశ్వకర్మాణమూతయే మనోజువం వాజే ఽ అద్యా హువేమ।
స నో విశ్వాని హవనాని జోషద్విశ్వశమ్భూరవసే సాధుకర్మా।
ఉపయామగృహీతోఽసీన్ద్రాయ త్వా విశ్వకర్మణఽఏష తే
యోనిరిన్ద్రాయ త్వా విశ్వకర్మణే ॥ ౧౨ ॥ (౮ - ౪౫)

**పదార్థము:-** మేము, అద్య = నేడు, వాజే = విజ్ఞానము, లేక యుద్ధము నిమిత్తము, వాచః పతిమ్ = ఎవడు వేద వాణికి స్వామి, లేక రక్షకుడు, విశ్వకర్మాణమ్ = ధర్మ యుక్తములగు సర్వకర్మలు గలవాడు, మనోజువమ్ = మనస్సు కోరు గతిని యెరుంగు వాడునునై యున్నాడో అట్టి పరమేశ్వరుని లేక సభాపతిని, హువేమ = కోరుచున్నాము. సాధుకర్మా = మంచి మంచి పనులు చేయువాడు, విశ్వశమ్భూః = సమస్త సుఖముల నుత్పత్తి జేయు వాడు నగు నే జగదీశ్వరుడు లేక యే సభాపతి, నః = మా, అవసే = ప్రేమ నభివృద్ధి పరచుటకై, విశ్వాని హావనాని = ప్రార్థించిన సకల ప్రార్థనా వచనములను, జోషత్ = ప్రేమతో విశ్వసిం (స్వీకరిం)చునో ఏ నీ యొక్క ప్రేమ భావమునకు, తే ఏషః = ఈ ఉక్త కర్మ, యోనిః = కారణమై యున్నదో అట్టి నీవు, ఉపయామగృహీతః = యమ నియమములచే★ గ్రహించబడువాడవై, అసి = ఉన్నావు. కావున, విశ్వకర్మణే = సర్వకార్యముల నుత్పన్నమొనర్చునదగు, ఇన్ద్రాయ = ఐశ్వర్యము నిమిత్తము, త్వా = నిన్ను ప్రార్థించుచున్నాము. మరియు, విశ్వకర్మణే = సర్వ కోరికలు సిద్ధించుటకై శిల్ప క్రియా కుశలత్వముచే నుత్తమైశ్వర్యవంతుడవైన నిన్ను సేవించుచున్నాము. ౧౨

**భావార్థము:-** ఏ పరమేశ్వరుడు మేము చేసిన పనులను పరిశీలించి తదనుసారము మమ్ము యథా యోగ్యమైన నియమములందు (నియమిం)చుచున్నాడో, ఎవ డెవరికిని దుఃఖము కలుగు ఛలకపటాది దుష్కృత్యము లొనర్చడో, ఏ పరమేశ్వరుని సహాయముతో మానవుడు మోక్షసిద్ధిని, బడసి ధర్మశీలుడగుచున్నాడో ఆ ఈశ్వరుడే పరమార్థ సిద్ధికి నిమిత్త మాత్రుడై మాకు సేవించదగియున్నాడు. ౧౨

---

★ ***యమములు:- అహింసా సత్య మస్తేయ బ్రహ్మచర్యా పరిగ్రహా యమాః॥ (యో॥సా॥పా॥౩౦)***
*అర్థ:* ౧ అహింస, ౨ సత్యము, ౩ అస్తేయము, ౪ బ్రహ్మచర్యము, ౫ అపరిగ్రహము, అను నీ ఐదు యమములు

౨౮. ఋషిః:- సోమాహుతిః॥ దేవతా:- అగ్నిః॥

ఛన్దః:- విరాడనుష్టుప్॥ స్వరః:- గాన్ధారః ॥

సుపాత్రులకై ధనమిచ్చువాడు విశ్వకర్మ పరమేశ్వరుడు

**స బోధి సూరిర్మఘవా వసుపతే వసుదావన్।**

**యుయోధ్యస్మద్ద్వేషాగ్ంసి విశ్వకర్మణే స్వాహా ॥ ౧౩ ॥** (యజు॥ ౧౨ - ౪౩)

**పదార్థము:-** వసుపతే = ధనముల పాలకుడా! వసుదావన్ = సుపాత్రులకై ధనమిచ్చువాడా! మఘవా = ప్రశంసిత విద్వాంసుడవు. సూరిః = బుద్ధిమంతుడవునగు ఏ నీవు సత్యమును, బోధి = ఎరుగుదువో, సః = ఆ నీవు, విశ్వకర్మణే = సంపూర్ణ శుభకర్మముల అనుష్ఠానమునకై, స్వాహా = సత్యవాణిని ఉపదేశించుచున్నవాడవై, అస్మత్ = మానుండి, ద్వేషాంసి = ద్వేషయుక్త కర్మలను, వియుయోధి = తొలగించుము. ౧౩

**భావార్థము:-** ఏ మనుష్యులు బ్రహ్మచర్యముతో పాటు జితేంద్రియులై ధర్మానుసార ముపదేశించి, విని ప్రయత్నించుచున్నారో, ఆ ధార్మిక విద్వాంసులే సంపూర్ణ సత్యాసత్యములను ఎరుగుటకు ఉపదేశించుటకు యోగ్యు లగు చున్నారు. హఠాభిమానులు క్షుద్రాశయులు నగు నితరులు కాజాలరు. ౧౩

౨౯. ఋషిః:- మధుచ్ఛన్దా॥ దేవతా:- పత్నీ॥

ఛన్దః:- ఆర్షీ త్రిష్టుప్ ॥ స్వరః:- ధైవతః॥

నిరంతరము దుఃఖముల నుండి వేరు పరచువాడు విశ్వకర్మ పరమేశ్వరుడు

**మాతేవ పుత్రం పృథివీ పురీష్యమగ్నిగ్ం స్వే యోనావభారుఖా।**

**తాం విశ్వైర్దేవైరృతుభిః సంవిదానః ప్రజాపతిర్విశ్వకర్మా వి ముఞ్చతు॥౧౪॥** (యజు॥ ౧౨-౬౧)

**పదార్థము:-** ఉఖా = ఎరుగదగినది, పృథివీ = భూమివలె నుండు నే విదుషీ స్త్రీ, స్వే యూనౌ = స్వకీయ గర్భాశయమందు, పురీష్యమ్ = పుష్టికర గుణము గలవాడు, అగ్నిమ్ = విద్యుత్తు వలె చక్కని ప్రకాశముతో కూడిన గర్భ రూపమునన్నున్న, పుత్రమ్ = పుత్రుని,

---

**౧. అహింసా = మనోవాక్కాయములతో నెల్లప్పుడు నే ప్రాణికి పీడ కలిగింపకుండుట,**

**౨. సత్యమ్ = చెప్పదలచినపుడు (త్రికరణ శుద్ధిగా) చూచినది చూచినటుల, వినినది వినినట్లు, ఊహించినది ఊహించినట్లు చెప్పుట, ఆలోచించుటయు.**

మాతేవ = తల్లివలె, అభాః = పుష్టపరచుచున్నదో లేక ధారణ మొనర్చుచున్నదో, తామ్ = ఆ బిడ్డను, సంవిదానః = చక్కగ బోధించువాడు, విశ్వకర్మా ప్రజాపతిః = సర్వోత్తమ కర్మలొనర్చువాడు, పరమేశ్వరుడు. విశ్వైః దేవైః = సకల దివ్యగుణములచేతను, ఋతుభిః = వసంతాది ఋతువుల చేతను, నిరంతరము దుఃఖము నుండి, వి ముఞ్చతు = వేరు పరచుగాక! ౧౪

**భావార్థము:-** తల్లి ఎటుల సంతానమును కని రక్షించుచున్నదో, అటులనే భూమి కారణరూపమగు విద్యుత్తును ప్రసిద్ధ పరచి రక్షించుచున్నది. పరమేశ్వరు డెటుల యథాతథ్యముగ పృథివ్యాది గుణముల నెరుగుచున్నాడో, ప్రతి నియత సమయము నందు ఋత్వాదులను, పృథివ్యాదులను ధరించి స్వకీయ నియత పరిధుల మధ్య నడిపించి ప్రళయ సమయమున భేదించుచున్నాడో అటులనే విద్వాంసులును యథా బుద్ధి వీని నెరిగి కార్య సిద్ధికై ప్రయత్నించవలయును. ౧౪

౩౦. ఋషిః:- విరూపః ॥ దేవతా:- అగ్నిః ॥

ఛన్దః:- త్రిష్టుప్ ॥ స్వరః:- ధైవతః ॥

ప్రజలను అన్ని వైపుల నుండి రక్షించువాడు విశ్వకర్మ యగు ఈశ్వరుడు

**యో ఉ అగ్నిరగ్నేరధ్యజాయత శోకాత్పృథివ్యా ఉ ఉత వా దివస్పరి।**

**యేన ప్రజా విశ్వకర్మా జజాన తమగ్నే హేడః పరి తే వృణక్తు॥ ౧౫ ॥ (యజు॥౧౩ - ౪౫)**

**పదార్థము:-** అగ్నే = విద్వాంసుడా! పృథివ్యాః = భూమిని, శోకాత్ = శోషణ మొనర్చు (అగ్ని నుండి), ఉత వా = లేక, దివః = సూర్యుని నుండి, అగ్నేః = విద్యుద్రూపాగ్ని నుండి, యః అగ్నిః = ఏ ఈ ప్రత్యక్షాగ్ని, అధ్యజాయత = ఉత్పన్నమగుచున్నదో, యేన = దేనిచే, విశ్వకర్మా = సకల కర్మల కాధారుడైన ఈశ్వరుడు, ప్రజాః = ప్రజలను, పరి = అన్నివైపుల నుండి, జజాన = రచించుచున్నాడో, తమ్ = ఆ యగ్నిని, తే హేడః = నీ క్రోధము, పరివృణక్తు = అన్ని విధముల ఛిన్న భిన్న మొనర్చవలయును. ౧౫

---

3. *అస్తేయమ్ = సర్వదా పరద్రవ్యము నపేక్షింపకుండుట,*

౪. *బ్రహ్మచర్యమ్ = గుప్తేంద్రియమైన ఉపస్థ యొక్క సంయమము,*

౫. *అపరిగ్రహః = దేహయాత్రకు కావలసిన వానికి మించి భోగ సాధనములను స్వీకరింపకుండుట.*

౧. *అహింస,* ౨. *సత్యము,* ౩. *అస్తేయము,* ౪. *బ్రహ్మచర్యము*

**భావార్థము:-** విద్వాంసులారా! మీరు ఏ యగ్ని పృథివిని భేదించుకొని పుట్టుచున్నదో, సూర్యుని వెలుతురు నుండి ఏ విద్యుత్తు వెడలుచున్నదో ఆ విఘ్నకారియైన యగ్ని నుండి సకలమును సంరక్షితములుగ నుంచుడు. మరియు నే యగ్నిచే నీశ్వరు డందరని రక్షించుచున్నాడో ఆ యగ్ని విద్యను గ్రహించుడు. ౧౫

౩౧ ఋషిః:- దేవా॥ దేవతా:- విశ్వకర్మా ॥

ఛన్దః:- విరాడార్షీ జగతీ॥ స్వరః:- నిషాదః॥

సకల కర్మల కాధారుడైన ఈశ్వరుడు విశ్వకర్మ

**ప్రజాపతిర్విశ్వకర్మా మనో గన్ధర్వస్తస్య ఋక్సామాన్యప్సరస ఏష్టయో నామ।**

**స న ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తస్మై స్వాహా వాట్ తాభ్యః స్వాహా ॥ ౧౬ ॥ (యజు॥ ౧౮ - ౪౩)**

**పదార్థము:-** మానవులారా! మీరు, విశ్వకర్మా = సకల కర్మల కాధారుడైన ఈశ్వరుడు, ప్రజాపతిః = ప్రజలను పాలించు మానవు డెవడున్నాడో, తస్య = అతని యొక్క, గన్ధర్వః = వాణ్యాదుల ధారణ మొనర్చునది, మనః = జ్ఞానము సాధించు మనస్సు, ఋక్సామాని = ఋక్సామ వేదముల మంత్రములు, అప్సరసః = హృదయాకాశమున వ్యాప్తమై ప్రాణాది పదార్థములందు పోవునవి, ఏష్టయః = విద్వాంసుల సత్కారము, సత్యము తోడ సాంగత్యము, విద్యా దానము మొదలైన వానిని నెరవేర్చు సాధనములన్నియు, నామ = ప్రసిద్ధములై యున్నవి. ఎటుల, సః = అతడు, నః ఇదమ్ బ్రహ్మ క్షత్రమ్ = మాకై ఈ వేదమును ధనుర్వేదమును, పాతు = రక్షించునో అటులనే, తస్మై = అతనికి, స్వాహా = సత్యవాణి, వాట్ = ధర్మప్రాప్తి, తాభ్యః = ఆ ఉక్త పదార్థములకై, స్వాహా = సత్యక్రియతో ఉపకార మొనర్చుడు. ౧౬

**భావార్థము:-** ఏ మానవులు పురుషార్థులు, మనస్వులు, వేదవేత్తలు నగుదురో వారే లోక భూషణులగుదురని గ్రహించవలయును. ౧౬

౩౨. ఋషిః:- ఉత్తరనారాయణః॥ దేవతా:- ఆదిత్యః॥

ఛన్దః:- భురిక్ త్రిష్టుప్॥ స్వరః:- ధైవతః॥

జగత్తు యొక్క సకల శరీర రూపములను నిర్మించువాడు విశ్వకర్మ పరాత్పరుడు

---

*౫. అపరిగ్రహము నను నీ ఐదును మనస్సుతో పాటు ఇంద్రియములను విషయముల నుండి యమింప - విరమింప జేయును. (అణచివేయును) కాబట్టి యమములనబడును. నియమములు:- శౌచ సన్తోష తపః స్వాధ్యా యేశ్వర ప్రణిధానాని నియమాః॥ (యోగ॥సా॥పా॥౩౨)*

అ॒ద్భ్యః సమ్భృ॑తః పృథి॒వ్యై రసా॑చ్చ వి॒శ్వక॑ర్మణ॒ః సమ॑వర్త॒తాగ్రే॑।
తస్య॒ త్వష్టా॑ వి॒దధ॑ద్రూ॒పమే॑తి॒ తన్మర్త్య॑స్య దేవ॒త్వమా॒జాన॒మగ్రే॑॥ ౧౭ ॥

(యజు॥ ౩౧ - ౧౭)

**పదార్థము:-** మానవులారా! అద్భ్యః = జలము కంటె, పృథివ్యై = పృథివి కంటె, విశ్వకర్మణః = సకల సత్య కర్మల కాశ్రయుడైన సూర్యుని కంటె, సమ్భృతః = చక్కగా పుష్టమైన (పోషింపబడిన), రసాత్ అగ్రే = రసము కంటె పూర్వము ఏ ఈ జగత్తంతయు, సమ్ వర్తత = వర్తమానమై యున్నదో, తస్య = ఆ ఈ జగత్తు యొక్క, తత్ రూపమ్ = ఆ స్వరూపమును, త్వష్టా = సూక్ష్మమొనర్చు ఈశ్వరుడు, విదధత్ = విధాన మొనర్చుచు, అగ్రే = ఆదిమ కాలములో, మర్త్యస్య = మనుష్యుని యొక్క, ఆజానమ్ = చక్కని కర్తవ్య కర్మను, దేవత్వమ్ = విద్యుత్తును, దేవత్వమును, ఏతి = పొందుచున్నాడు. ౧౭

**భావార్థము:-** మానవులారా! సంపూర్ణ కార్య మొనర్చు పరాత్పరుడు కారణము నుండి కార్యమును సృజించుచున్నాడు. జగత్తు యొక్క సకల శరీర రూపములను నిర్మించుచున్నాడు. అతని జ్ఞానము, అతని అజ్ఞాపాలనయే దేవత్వము అని ఎరుగుడు ౧౭

౩౩. ఋషిః:- గృత్సమదః ॥ దేవతా:- బ్రహ్మణస్పతిః॥

ఛన్దః:- నిచృ త్రిష్టుప్ ॥ స్వరః:- ధైవతః॥

సమస్త జగత్తును రచించు కర్మగలవాడైన పరమేశ్వరుడు విశ్వకర్మ

బ్రహ్మ॑ణస్పతే॒ త్వమ॒స్య య॒న్తా సూ॒క్తస్య॑ బోధి॒ తన॑యం చ జిన్వ।
విశ్వం॒ తద్భ॒ద్రం యద॑వన్తి దే॒వా బృ॒హద్వ॑దేమ వి॒దథే॑ సు॒వీరాః॑।
య ఉ॒ ఇ॒మా విశ్వా॑। వి॒శ్వక॑ర్మా। యో నః॑ పి॒తా। అన్న॑పతే ఉ॒న్నస్య॑ నో దేహి ॥ ౧౮ ॥

(యజు॥ ౩౪ - ౫౮)

---

*అర్థ: ౧. శౌచము, ౨. సంతోషము, ౩. తపస్సు, ౪. స్వాధ్యాయము, ౫. ఈశ్వర ప్రణిధానము అను నీ ఐదు నియమములు.*

*౧. శౌచ = శుద్ధి. ఇది రెండు విధములు. ౧. బాహ్యము, ౨. ఆభ్యంతరము. మృత్తిక, జలము మున్నగు వానితో శరీరమును, సాత్వికాహారాదుల భక్షణము వలన నుదరమును శుద్ధి చేసి కొనుట బాహ్యమనబడును. మైత్రి, కరుణ మున్నగు వాని ద్వారమున చిత్తమలయములైన రాగద్వేషములను పోగొట్టుకొనుట ఆభ్యంతర శుచియనబడును.*

**పదార్థము:-** బ్రహ్మణః = బ్రహ్మాండము యొక్క, పతే = రక్షకా! పరమేశ్వరా! దేవాః = విద్వాంసులు, విదథే = ప్రకటించదగిన వ్యవహారము నందు, యత్ = దేనిని రక్షించుచున్నారో, లేక (ఏది) ఉపదేశించుచున్నారో, మరియు దేనిని, సువీరాః = ఉత్తమ వీర పురుషులమైన మేము, బృహత్ = మిగుల శ్రేష్ఠమని, వదేమ = చెప్పెదమో, అస్య సూక్తస్య = బాగుగా చెప్పదగిన ఆ ఈ వచనమునకు, త్వమ్ = నీవు, యన్తా = నియమకర్తవు కమ్ము. చ = మరియు, తనయమ్ = విద్యను శుద్ధముగా విచారించు పుత్రుని వంటి ప్రియ పురుషునకు, బోధి = బోధించుము. మరియు, తత్ భద్రమ్ విశ్వమ్ = కల్యాణ కరములైన ఆ సకల జీవులను, జిన్వ = తృప్తి పరుచుము. యః = ఏ పరమేశ్వరుడు, ఇమా విశ్వా = ఈ సకలము నందు వ్యాప్తుడై, విశ్వకర్మా = సమస్త జగత్తును రచించు కర్మ గల వాడైన పరమేశ్వరుడు, యః = ఎవడు, నః పితా = మన పాలకుడు, అన్నపతే = ఓషదులను అన్నములను పాలించు నో యజమానుడా! అన్నస్య = అన్నమును, నః = మాకు, దేహి = ఇమ్ము. ౧౮

**భావార్థము:-** జగదీశ్వరా! నీవు మా విద్యను, సత్య వ్యవహారమును, నియమము నందుంచువాడవు కమ్ము. మా సంతానమును విద్యా సమన్వితునిగ నొనర్చుము. సర్వ జగత్తును యథావిధిగా రక్షించుము. న్యాయ యుక్త ధర్మమును, ఉత్తమ శిక్షను, పరస్పర ప్రీతిని ఉత్పన్న మొనర్చుము. ౧౮

## సామవేదము నుండి:-

౩౪. ఋషిః:- విశ్వకర్మా భౌవనః॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- త్రిష్టుప్॥ స్వరః:- ధైవతః॥

విశ్వమును సృష్టించువాడు విశ్వకర్మ పరమేశ్వరుడు

**విశ్వకర్మన్ హవిషా వావృధానః స్వయం యజస్వ తన్వాం౩ స్వా హి తే।**
**ముహ్యన్త్వన్యే అభితో జనాస ఇహాస్మాకం మఘవా సూరిరస్తు ॥ ౧ ॥** (సామ॥ ౧౫౮౯)

**పదార్థము:-** విశ్వకర్మన్ = విశ్వమును సృష్టించువాడా! ఓ పరమేశ్వరా! వావృధానః =

---

*౨. సంతోషః = జీవనయాత్రకు కావలసిన పరికరములకు మించి సాధన సామాగ్రిని సంపాదింపకుండుట. ప్రాప్తించిన సాధనములతో తృప్తిపడవలయును. సంగ్రహేచ్ఛ యుండరాదని భావము.*

*౩.తపః = శీతోష్ణములు, మానాపమానములు, ఆకలిదప్పులు మున్నగు ద్వంద్వములను సహించుట. హితము, మితము నైన భోజనము చేయుట.*

జగత్తును వృద్ధి చేయుచు నీవు, తన్వామ్ = విస్తృతమైన అగ్ని కుండములో, స్వా హి తే = స్వయముగ అగ్ని హోత్రము కొరకు అగ్ని స్థాపన చేసిన, హావిషా = (హావ్యముతో)= హోమమునకు వలయు సామాగ్రితో, స్వయమ్ = స్వయముగ, యజస్వ = యజ్ఞము చేయుదువు, అన్యే = సాధారణమైన అన్య అజ్ఞానులు, జనాసః = మనుష్యులు, ఇహ = ఈ విషయములో, అభితః = అంతట, ఎల్ల విధముల, ముహ్యాన్తు = మరచిపోతే మరచిపొంది కాని, అస్మాకమ్ = మాలో, మఘవాః = యజ్ఞము చేయు పురుషుడు, సూరిః = పాండిత్యము తెలిసినవాడు మరియు తమ యజ్ఞమును చూచి తానే యజ్ఞము చేయువాడు, అస్తు = కావలెను. (అగుగాక!) ౧

**భావార్థము:-** జగత్తును ధన ధాన్యములతో ఆరోగ్యము మొదలగు వానిని పెంచుతూ పరమాత్ముడు స్వయముగా సూర్యుడు మొదలగు సూర్యాది లోకముల రూపమును చాలా విస్తృతమైన యజ్ఞ కుండములో అగ్న్యాధానము చేయుచు (అగ్నిని స్థాపించుచు) వానిలో (దానిలో) ఓషధులు, వనస్పతులు మొదలగు వానితో హోమము చేయుటకు చేసి యున్నాడు. యజ్ఞము చేయువారు ఈ రహస్యమును తెలిసినవారు మరియు నీ యజ్ఞమును చూచి స్వయముగ.యజ్ఞానుష్ఠానము చేయువారు కావలయును. ౧

౩౫. ఋషిః:- నృమేధః॥ దేవతా:- ఇన్ద్రః ॥

ఛన్దః:- ఉష్ణిక్ ॥ స్వరః:- ఋషభః॥

సూర్యునికి ప్రకాశమునిచ్చువాడు, జగత్తునకు దేవుడు విశ్వకర్మ పరమేశ్వరుడు

**త్వమిన్ద్రాభిభూరసి త్వం సూర్యమరోచయః।**

**విశ్వకర్మా విశ్వదేవో మహాఁ అసి ॥ ౨ ॥ (సామ॥ ౧౦౨౬)**

**పదార్థము:-** ఇన్ద్ర = పరమేశ్వరా! త్వమ్ = నీవు, అభిభూః = అందరిని అణచువాడవై, అసి = ఉన్నావు, త్వమ్ = నీవే, సూర్యమ్ = సూర్యునికి, అరోచయః = ప్రకాశమును

---

*౪. స్వాధ్యాయః = పవిత్రములైన ప్రణ (ఓ౩మ్) వాదులను జపించుట, మోక్ష శాస్త్రము లగు వేదోపనిషదాదులను పఠించుట.*

*౫. ఈశ్వర ప్రణిధానాని = పరమ గురువైన పరమేశ్వరు నందు సర్వకర్మల నర్పించి కర్మ ఫలములను త్యజించుట.*

*ఇయ్యావి తప్పక చేయదగినవని నియమింపబడుట, విధింపబడుట చేత నియమము లనబడుచున్నవి.*

ఇచ్చుచున్నావు. నీవు, విశ్వకర్మా = జగత్తును సృష్టించువాడవు, విశ్వదేవః = జగత్తునకు దేవుడవు, మహాన్ = సర్వవ్యాపివై, అసి = ఉన్నావు. ౨

**భావార్థము:-** సూర్యుడు మొదలగు మెరియుచున్న గోళములు మనకు ఎంత ప్రియముగ నుండును. అయన లేకుండా ఏ పని కూడా నడవ జాలదు. కాని సూర్యుడు మొదలగు మెరియుచున్న గోళముల యొక్క ప్రకాశకుడు కూడా పరమేశ్వరుడై యున్నాడు. ఇందుకొరకు అతనిని మించి ఏదియూ లేదు. ౨

**అథర్వవేదము నుండి:-**

౩౬. ఋషిః:- అఙ్గిరాః ॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- బృహతీగర్భా త్రిష్టుప్॥

ప్రపంచమును సృష్టించువాడు విశ్వకర్మ పరమేశ్వరుడు

**యే భక్షయన్తో న వసూన్యానృధుర్యానగ్నయో అన్వతప్యన్త ధిష్ణ్యాః।**

**యా తేషామవయా దురిష్టిః స్విష్టిం నస్తాం కృణవద్విశ్వకర్మా ॥౧॥ (అథర్వ॥ ౨-౩౫-౧)**

**పదార్థము:-** యే = ఏ మనుష్యులైతే, భక్షయన్తః = ఉదరమును నింపుకొనుచు, వసూని = ధనములను, న ఆనృధుః = అభివృద్ధి పరచలేదో, మరియు, యాన్ = వాడు, ధిష్ణ్యాః = మాటలాడుటలో, పనిచేయుటలో మరియు బుద్ధిలో చతురుడు, అగ్నయః = అభివృద్ధి పొందుచున్న జ్ఞాని (మరియు అగ్నికి సమానమైన తేజస్వులైన) పురుషులు, అన్వతప్యన్త = తపించినారో లేక తపస్సు చేసినారో, (శోకము నొప్పుకున్నారో), తేషామ్ = వారు (పిసినారుల యొక్క), యా = ఎవరికైతే, అవయాః = వినాశ హేతువగు, దురిష్టిః = దుష్టమిత్రత్వముండునో, విశ్వకర్మా = అన్ని పనులు చేయుటలో చతురుడు (మరియు ప్రపంచమును సృష్టించువాడగు) పరమేశ్వరుడు, తామ్ = ఆ దుష్ట మిత్రత్వమును, నః = మనకొరకు, స్విష్టిమ్ = ఉత్తమమైన ఫలదాయకము, కృణవత్ = చేయుగాక ! ౧

**భావార్థము:-** స్వార్థము గల మనుష్యులు కేవలము తమ పొట్టనింపుకొనుట మాత్రమే తెలిసికొందురు. మరియు ధనమును ప్రోగుచేసి ఉపకారము చేయరో, వారి స్థితిని (దశ) ఉదార శీలురగు మహాపురుషులకు శోచనీయముగా నుండును. పనులలో నేర్పరులగు మనుష్యులకు (పరమేశ్వరా!) మంచి బుద్ధిని ఇవ్వుము. ఎందువలననగా వారి మనస్సు స్వార్థమును విడిచి ప్రపంచ క్షేమములలో నిమగ్నులై యుందురు గాక! మనుష్యులందరు

(విశ్వకర్మ) ఇచ్చినటువంటి కర్మలలో నేర్పరులై మరియు దుష్ట మిత్రత్వము యొక్క దుష్ట ఫలములను చూచి దుష్ట కర్మల నుండి రక్షింపబడి ఎల్లప్పుడు ఆనందముతో నుందురు గాక! ౧

౩౭. ఋషిః:- అఙ్గిరాః॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- త్రిష్టుప్॥

ప్రపంచమును సృష్టించువాడు విశ్వకర్మ పరమేశ్వరుడు

**యజ్ఞపతిమృషయ ఏనసాహుర్నిర్భక్తం ప్రజా అనుతప్యమానమ్।**

**మథవ్యాన్స్తోకానప యాన్ రరాధ సం నష్టేభిః సృజతు విశ్వకర్మా ॥ ౨ ॥ (అథర్వ॥ ౨-౩౫-౨)**

**పదార్థము:-** ఋషయః = సూక్ష్మదర్శి, (సూక్ష్మమును తెలుసుకొను ఋషి), ప్రజాః = మనుష్యులు మొదలగు ప్రజలపై, అనుతప్యమానమ్ = తపించి లేక తపస్సు చేసి (దయను) పొందువాడు, యజ్ఞపతిమ్ = ఉత్తమమైన కర్మలను కాపాడు పురుషుడు, ఏనసా = పాపముతో, నిర్భక్తమ్ = వేరు చేయబడినట్లు, ఆహుః = చెప్పుదురు. అతడు, యాన్ = దేనిని, మథవ్యాన్ = పితుకుటకు యోగ్యమైన, మర్థనము చేయుటకు యోగ్యమైన, స్తోకాన్ = సంతోషమును పొందువారు, సూక్ష్మ విషయములను, అప = ఆనందముతో, రరాధ = సిద్ధి పొందుదురు. విశ్వకర్మా = ప్రపంచమును సృష్టించువాడగు పరమేశ్వరుడు, తేభిః = తైః = వారి (సూక్ష్మ విషయములతో)తో, నః = మనను, సం సృజతు = కలుపవలయును. ౨

**భావార్థము:-** ఎవడైతే జీవులన్నిపై దయ మరియు ఉపకారము చేయునో అతడే ధర్మాత్ముడు, ఆప్త పురుషుడు, సత్య సిద్ధాంతములను ప్రత్యక్షము చేసికొని లేక ప్రమాణముతో తెలుసుకొని ప్రపంచములో ఆనందముతో అందరికి తెలుపును. విశ్వకర్మ పరమేశ్వరుడు ఆ నిశ్చితమైన వైదిక ధర్మములను మన అందరి హృదయములలో స్థాపించవలయును. దానితో మనము పురుషార్థ పూర్వకముగ ఎల్లప్పుడు ఆనందమును అనుభవించవలయును. ౨

౩౮. ఋషిః:- అఙ్గిరాః॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- త్రిష్టుప్॥

విశ్వకర్మ'యగు ఈశ్వరాజ్ఞను పాలించి ఆనందములను అనుభవించవలెను.

**అదాన్యాన్త్సోమపాన్ మన్యమానో యజ్ఞస్య విద్వాన్త్సమయే న ధీరః।**

**యదేనశ్చకృవాన్ బద్ధ ఏష తం విశ్వకర్మన్ ప్ర ముఞ్చా స్వస్తయే ॥3॥ (అథర్వ॥ 2-35-3)**

**పదార్థము:-** అదాన్యాన్ = దానమును ఇచ్చుటకు అయోగ్య పురుషులకు, సోమపాన్ = అమృత పానము చేయించువాడు, మన్యమానః = ఒప్పుకొను పురుషుడు, యజ్ఞస్య = శుభకర్మను, విద్వాన్ = తెలుసుకొనువాడు, మరియు, సమయే = సమయమున(ందు), ధీరః = ధీరుడు, న = ఉండడు, ఏషః = ఈ పురుషుడు, బద్ధః = (అజ్ఞానములో) బంధింపబడి, యత్ = ఎవడైతే, ఏనః = పాపమును, చకృవాన్ = చేసియున్నాడో, విశ్వకర్మన్ = ప్రపంచమును సృష్టించు ఓ పరమేశ్వరా! తమ్ = ఆ పురుషునకు, స్వస్తయే = ఆనందమును అనుభవించుట కొరకు, ప్ర ముఞ్చా = ముక్తుడను చేయుము. 3

**భావార్థము:-** మనుష్యుడు అవివేకము వలన మూఢుడై తన యొక్క మరియు ప్రపంచమునకు హాని కలుగచేయును. ఆ పురుషుడు తన యొక్క ప్రమాదముపై పశ్చాత్తాపము మరియు పాపకర్మములను విడిచి ఈశ్వరాజ్ఞను పాలించి ఆనందములను అనుభవించ వలయును. 3

38. ఋషిః:- అఙ్గిరాః ॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- భురిక్ త్రిష్టుప్॥

ప్రపంచమును రచించు పరమేశ్వరుడు విశ్వకర్మ

**యజ్ఞస్య చక్షుః ప్రభృతిర్ముఖం చ వాచా శ్రోత్రేణ మనసా జుహోమి।**

**ఇమం యజ్ఞం వితతం విశ్వకర్మణా దేవా యన్తు సుమనస్యమానాః ॥ 4 ॥**

**(అథర్వ॥ 2 - 35 - 5)**

**పదార్థము:-** (ఏ పురుషుడైతే), యజ్ఞస్య = పూజనీయమైన పనులను, చక్షుః = నేత్రములు (నేత్రములకు సమముగా ప్రదర్శకుడు), ప్రభృతిః = పుష్టి, బలము, చ = మరియు, ముఖమ్ = ముఖము (ముఖమునకు సమానముగా ముఖ్యమైనది), (దాని), వాచా = మాటలతో, శ్రోత్రేణ = చెవులతో, మరియు, మనసా = మనస్సుతో, జుహోమి = నేను స్వీకరించుదును. సుమనస్య మానాః = శుభములను చింతించు వారి వలె ఆచరణము చేయువారు, దేవాః = వ్యవహారములలో నేర్పరులగు మహా పురుషులు, విశ్వకర్మణా

= ప్రపంచమును రచించు పరమేశ్వరుడు, వితతమ్ = వ్యాపింపచేసియున్న, ఇమమ్ = ఈ, యజ్ఞమ్ = పూజనీయ ధర్మమును, ఆ యన్తు = పొందవలయును. ౪

**భావార్థము:-** మనుష్యులకు ఉచితము ఇది గదా! సత్య సంకల్పము, సత్యమును ఆచరణము చేయు ఋషి మహా పురుషుల యొక్క వేద ఉపదేశమును జిహ్వాతో (మాటలతో) చదువుట చదివించుట, చెవులతో వినుట వినిపించుట, మరియు మనస్సుతో మాటి మాటికి దానినే ఆలోచించుట, తాత్పర్యమేమనగా మాటి మాటికి విచారించి గ్రహించవలయును. మరియు అనుగ్రశీలు రందరు మహాత్ముడైన పరమేశ్వరుని ద్వారా ఇవ్వబడిన విజ్ఞానము మరియు ధర్మము యొక్క ప్రచారమును చేయవలయును. ౪

౪౦. ఋషిః:- భృగుః ॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- త్రిష్టుప్॥

మనుష్యుడు తన శుభ కర్మలను విశ్వకర్మ పరమాత్మునిలో సమర్పణ చేయవలెను

**ఏతం భాగం పరి దదామి విద్వాన్ విశ్వకర్మన్ ప్రథమజా ఋతస్య।**

**అస్మాభిర్దత్తం జరసః పరస్తాదచ్ఛిన్నం తన్తుమను సం తరేమ ॥౫॥ (అథర్వ॥ ౬-౧౨౨-౧)**

**పదార్థము:-** ప్రథమజాః = శ్రేష్టులలో ప్రసిద్ధుడు, విద్వాన్ = విద్వాంసుడగు నేను, ఋతస్య = సత్య ధర్మము యొక్క, ఏతమ్ = ఈ, భాగమ్ = సేవించదగిన వ్యవహారమును, విశ్వకర్మన్ = జగత్తును రచించు విశ్వకర్మ పరమేశ్వరునిలో, పరి దదామి = సమర్పణ చేయుదును. జరసః = వృద్ధాప్యము (తో)లో, పరస్తాత్ = దూరదేశములో, అస్మాభిః దత్తమ్ = తన ద్వారా ఇవ్వబడిన, అచ్ఛిన్నమ్ = క్రమము తప్పకుండ (విరగ కుండ), తన్తుమ్ అను = వ్యాపించి యున్న (లేక వస్త్రములో దారమునకు సమానముగ సర్వ వ్యాపకమైనది.) పరబ్రహ్మమునకు వెనువెంట, సమ్ = యథోచితముగ, తరేమ = మనము దాట వలయును. ౫

**భావార్థము:-** మనుష్యుడు తన శుభ కర్మలను పరమాత్మునిలో సమర్పణము చేసి అజరత్వమును (ముసలితనము లేనివాడై), అమరత్వమును, తత్వ జ్ఞానమును పొంది విద్యా దానము చేయవలయును. ౫

౪౧. ఋషిః:- భృగుః ॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- త్రిష్టుప్॥

విశ్వకర్మ పరమాత్మని ఆజ్ఞను పాలించువారు విశేష సుఖమునకు భాగస్వాములగుదురు

**త్రతం తన్తుమన్వేకే తరన్తి యేషాం దత్తం పిత్ర్యమాయనేన ।**

**అబన్ధ్వేకే దదతః ప్రయచ్ఛన్తో దాతుం చేచ్ఛిక్షాన్త్స స్వర్గ ఏవ ॥౬॥ (అథర్వ॥ ౬-౧౨౨-౨)**

**పదార్థము:-** యేషామ్ = ఏ లోకుల యొక్క, పిత్ర్యమ్ = పితృ దేవతలు, గౌరవ నీయులొక్క ప్రియ, దత్తమ్ = దానము, ఆయనేన = శాస్త్రానుసారముగ నుండునో, ఏకే = వారు; ఎవరు, తతమ్ = వ్యాపించియున్న, తన్తుమ్ అను = వస్త్రములో దారము వలె సర్వ వ్యాపకుడైన బ్రహ్మావెనువెంట, తరన్తి = ముక్తులగుదురు. ఏకే = ఒక్కొక్కడు, అబన్ధు = బంధురహితులకు (అనాధులకు), దదతః = ఇచ్చుచు, మరియు, ప్రయచ్ఛన్తః = అప్పుచెప్పుచు నుందురు. (ఎవడైతే), దాతుమ్ = దానము చేయుటకు, చ, ఇత్ = తప్పకుండ, శిక్షాన్ = సమర్థుడు కాగలడో, సః ఏవ = అతనికే (ఆయనకు), స్వర్గః = స్వర్గము లభించును. ౬

**భావార్థము:-** ఏ మనుష్యుడైతే తగిన పాత్రులకు సత్కారము చేసి, పరమాత్ముని యొక్క ఆజ్ఞను పాలించునో (పాలింతురో) వారే విశేష సుఖమునకు భాగస్వాములగుదురు. ౬

౪౨. ఋషిః:- భృగుః॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- త్రిష్టుప్॥

విశ్వకర్మ పరమాత్మునిలో శ్రద్ధ గలిగి యుండి సుఖములను పొందుదురురు గాక!

**అన్వారేభథామనుసంరభేథామేతం లోకం శ్రద్దధానాః సచన్తే।**

**యద్వాం పక్వం పరివిష్టమగ్నౌ తస్య గుప్తయే దమ్పతీ సం శ్రయేథామ్ ॥ ౭ ॥**

**(అథర్వ॥ ౬ - ౧౨౨ - ౩)**

**పదార్థము:-** దమ్పతీ = ఓ స్త్రీ పురుషులారా! సత్కర్మను, అన్వార భేథామ్ = ఎల్లప్పుడు ఆరంభము చేయుడు. అనుసంరభేథామ్ = కలిసి మెలసి ప్రారంభించుచునే యుండుడు. శ్రద్దధానాః = శ్రద్ధ కలిగిన మనుష్యులు, ఏతమ్ = ఈ (స్వర్గ), లోకమ్ = లోకమును, సచన్తే = ఎల్లప్పుడు సేవించెదరు. అగ్నౌ = అగ్నిలో, పక్వమ్ = వండినటువంటి, యత్ = ఏదైతే (అన్నము), వామ్ = నీ కొరకు, పరివిష్టమ్ = ఉన్నదో, తస్య గుప్తయే = దాని రక్షణ కొరకు, సమ్ శ్రయేథామ్ = మీరిద్దరు పరస్పరముగ ఆశ్రయము తీసుకొనుడు. ౭

**భావార్థము:-** స్త్రీ, పురుషులందరు గృహస్థాశ్రమములో క్రమముగ ప్రవేశించి పరమాత్మునిలో శ్రద్ధ కలిగి యుండుచు తమ కర్తవ్యమును క్రమముగా పాలించి ఎల్లప్పుడు సుఖములను అనుభవింతురు గాక. ౭

౪౩. ఋషిః:- భృగుః॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- జగతీ

విశ్వకర్మ పరమాత్మునిలో ఆనందము ననుభవింతురు గాక!

**యజ్ఞం యన్తం మనసా బృహన్తమన్వారోహామి తపసా సయోనిః।**
**ఉపహూతా అగ్నే జరసః పరస్తాత్ తృతీయే నాకే సధమాదం మదేమ ॥ ౮ ॥**

**(అథర్వ॥ ౬ - ౧౨౨ - ౪)**

**పదార్థము:-** మనసా = విజ్ఞానము, మరియు, తపసా = తపము అనగా ఉత్సాహముతో, సయోనిః = నివసించు నేను, యన్తమ్ = వ్యాపించు శీలము కలిగిన, బృహన్తమ్ = అందరిలో పెద్ద, యజ్ఞమ్ = పూజింపదగిన బ్రహ్మను, అన్వారోహామి = ఎల్లప్పుడు పెద్దవానినై పొందుదును. అగ్నే = సర్వ వ్యాపకుడవైన ఓ పరమేశ్వరా! జరసః = హీనమైన వయసుతో (వయో హానితో), పరస్తాత్ = దూర దేశములో, ఉపహూతాః = పిలువబడిన మనము, తృతీయే = మూడవ (జీవము మరియు ప్రకృతి కన్న భిన్నము), నాకే = సుఖ స్వరూపుడైన పరమాత్మునిలో, సధమాదమ్ = సంతోషము మరియు ఉత్సాహము, మదేమ = చేయవలయును. ౮

**భావార్థము:-** ఏ మనుష్యులు పూర్ణ విజ్ఞానము మరియు తపస్సుతో పరబ్రహ్మను వెతుకులాడి ఉపకారము చేయువారగుదురో వారు అజరులై (ముసలితనం లేనివారై), అమరులై ఆ పరమాత్మునిలో ఆనందమును అనుభవింతురు.

౪౪. ఋషిః:- భృగుః॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- జగతీ॥

విశ్వకర్మ పరమాత్మునిలో శ్రద్ధాళువై ఆనందమును పొందవలెను

**శుద్ధాః పూతా యోషితో యజ్ఞియా ఇమా బ్రహ్మణాం హస్తేషు ప్రపృథక్ సాదయామి।**
**యత్కామ ఇదమభిషిఞ్చామి వోఽహమిన్ద్రో మరుత్వాన్త్స దదాతు తన్మే ॥ ౯ ॥**

**(అథర్వ॥ ౬ - ౧౨౨ - ౫)**

**పదార్థము:-** శుద్ధాః = శుద్ధ స్వభావము కలిగినట్టి, పూతాః = పవిత్రమైన ఆచరణము కలిగినది, యజ్ఞియాః = పూజింపదగిన, ఇమాః = వీని, యోషితః = సేవచేయదగిన స్త్రీలను, బ్రహ్మణామ్ = బ్రహ్మ జ్ఞానులగు పురుషుల యొక్క, హస్తేషు = చేతుల మధ్య (విజ్ఞానము యొక్క బలముతో), ప్రపృథక్ = నానా విధములుగ, సాదయామి = నేను కూర్చొనబెట్టుచున్నాను. (ఓ విద్వాంసులగు స్త్రీ పురుషులారా!), యత్కామః = ఉత్తమ కోరిక గలవాడా! అహమ్ = నేను, ఇదమ్ = ఈ సమయములో, వః = నీ యొక్క, అభిషిఞ్చామి = అభిషేకము చేయుదును. సః = ఆ, మరుత్వాన్ = దోష నాశక గుణము గలవాడా! ఇన్ద్రః = సంపూర్ణ ఐశ్వర్యవంతుడవైన జగదీశ్వరా! తత్ = ఆ వస్తువు, మే = నాకు, దదాతు = ఇవ్వుము. ౯

**భావార్థము:-** పరమాత్ముడు విజ్ఞాన ప్రాప్తములో స్త్రీ, పురుషులను సమానముగ పుట్టించినాడు. ఇందు కొరకు మనుష్యునకు విద్వాంసురాలగు స్త్రీ పురుషుల కన్న గౌరవమైన విజ్ఞానమును పొంది పరమాత్మునిలో శ్రద్ధాళువై ఆనందమును పొందవలయును. ౯

౪౫. ఋషిః:- అథర్వా॥ దేవతా:- అగ్నిర్విశ్వకర్మా॥

ఛన్దః:- త్రిష్టుప్॥

పరోపకారి జనులకు ఆనందము నిచ్చువాడు విశ్వకర్మ పరమేశ్వరుడు

**యే వధ్యమానమను దీధ్యానా అన్వైక్షన్త మనసా చక్షుషా చ।**

**అగ్నిష్టానగ్రే ప్ర ముమోక్తు దేవో విశ్వకర్మా ప్రజయా సంరరాణః॥౧౦॥ (అథర్వ॥ ౨-౩౪-౩)**

**పదార్థము:-** యే = ఎవడైతే (మహా విద్వాంసుడు), వధ్యమానమ్ అను = బంధనములో పడుచు, (ప్రాణి) మీద, దేధ్యానా + సన్తః = వెలుతురు నిచ్చుచు, మనసా = మనసుతో, చ = మరియు, చక్షుషా = నేత్రములతో, అన్వైక్షన్త = దయతో చూచియున్నాడో, తాన్ = వాని, అగ్రే = అగ్రే - వర్తమానాన్= అగ్రభాగములో పోయిన వారికి (పోవు వారికి), అగ్నిః = సర్వము (అంతట) వ్యాపించి యున్నటువంటి, దేవః = ప్రకాశస్వరూపుడు, విశ్వకర్మా = అన్నిటిని రచించు పరమేశ్వరుడు, ప్రజయా = ప్రజలు (సృష్టితో), సంరరాణః = సంరమమాణః = ఆనందమును పొందుచు, ప్ర = బాగుగ, ముమోక్తు = (విఘ్నములతో) బంధనముల నుండి విడవడు గాక! (ముక్తుడగు గాక!) ౧౦

**భావార్థము:-** ఏ మహాత్ముడైతే తన మానసిక మరియు శారీరక శక్తితో అజ్ఞాన కారణము వలన (కలుగు) దుఃఖములో మునిగియున్న వారిని యుద్ధరించుటలో యోగ్యుడగుచున్నాడో, అతడు సర్వశక్తిమంతుడు. అన్నిటికి కర్తయయిన పరమేశ్వరుడు పరోపకారి జనులకు ఎల్లప్పుడు సహాయకుడు మరియు ఆనందము నిచ్చువాడగుచున్నాడు. ౧౦

౪౬. ఋషిః:- భృగ్వఙ్గిరాః॥ దేవతా:- అనడ్వాన్ ఇన్ద్రరూపః ॥

ఛన్దః:- త్రిష్టుప్॥

విశ్వకర్మ పరమాత్ముడు సర్వరక్షకుడు

**యస్య నేశే యజ్ఞపతిర్న యజ్ఞో నాస్య దాతేశే న ప్రతిగ్రహీతా।**

**యో విశ్వజిద్ విశ్వభృద్ విశ్వకర్మా ఘర్మం నో బ్రూత యతమశ్చతుష్పాత్** ॥ ౧౧ ॥

( **అథర్వ॥** ౪ - ౧౧ - ౫)

**పదార్థము:-** యజ్ఞపతిః = సంబంధము కలిగిన కర్తృత్వ పురుషుడు, న = కాని, మరియు, యజ్ఞః = సంబంధము కలిగిన కర్మ, న = లేని(ది), యజ్ఞస్య = ఎవడైతే, ఏదైతే (పరమేశ్వరుడు) అగు, ఈశే = ఈష్టే = ఈశ్వరుడు యున్నాడో, దాతా = దానము చేయువాడు, న = కాని, ప్రతిగ్రహీతా = గ్రహించువాడు, న = కాదు, అస్య = దేని యొక్క, ఈశే = ఈశ్వరుడు, యః = ఎవడైతే, విశ్వజిద్ = అందరిని జయించువాడు, విశ్వభృద్ = అందరిని పోషించువాడు, విశ్వకర్మా = అన్ని పనులు చేయువాడు, మరియు, యతమః = నిరాకారుడు, చతుష్పాత్ = నాలుగు దిశలలో ఉన్నటువంటి లేక చలనము కలిగినవాడు, ఘర్మమ్ = ఆ ప్రకాశ మానుడగు సూర్య సదృశుడగు పరమాత్మను, నః = మాకు, (ఓ ఋషులారా!), బ్రూత = తెలుపుడు. ౧౧

**భావార్థము:-** ఆ పరమాత్మునకు ఇతర శాసకుడు లేడు. అతడు సర్వశక్తిమంతుడు, సర్వ రక్షకుడు, సర్వ వ్యాపకుడు, ప్రకాశ స్వరూపుడు అయి యున్నాడు. ఆయనను ఉపాసించుట మరియు అన్వేషణచే (వెదకుటచే) మనుష్యులందరు తమ ఉన్నతిని పొందుదురు. ౧౧

౪౭. ఋషిః:- అథర్వా॥ దేవతా:- మన్త్రోక్తాః ॥

ఛన్దః:- అతిజగతీ॥

విశ్వకర్మ పరమేశ్వరుడు నన్ను కాపాడు గాక!

**విశ్వకర్మా మా సప్తఋషిభిరుదీచ్యా దిశః పాతు తస్మిన్ క్రమే తస్మిఞ్ఛ్రయే తాం పురం ప్రైమి।**
**స మా రక్షతు స మా గోపాయతు తస్మా ఆత్మానం పరి దదే స్వాహా** ॥౧౨॥

**(అథర్వ॥ ౧౯-౧౭-౭)**

**పదార్థము:-** విశ్వకర్మా = విశ్వకర్మ (అన్ని పనులు చేయు పరమేశ్వరుడు), సప్తఋషిభిః = సప్త ఋషులతో (చెవి, కన్ను, నాలుక, ముక్కు, చర్మము అను ఐదు జ్ఞానేంద్రియములు, మనస్సు మరియు బుద్ధితో) మా = నన్ను, ఉదీచ్యాః = కుడి మరియు ఎడమ, దిశః = దిశల నుండి, పాతు = కాపాడుము, తస్మిన్ = దానిలో, శ్రయే = ఆశ్రయింతును, తామ్ = దాని, పురమ్ = ముందుకు పోవు శక్తి (మరియు దుర్గ రూపుడైన పరమేశ్వరు)ని, ప్ర = బాగుగా, ఏమి = పొందబడుదును, సః = అతడు (జ్ఞాన స్వరూపుడైన పరమేశ్వరుడు), మా = నన్ను, రక్షతు = కాపాడుగాక, సః = అతడు, మా = నన్ను, గోపాయతు = పోషించును, తస్మై = వానిని, ఆత్మానమ్ = తన ఆత్మ (మనస్సుతో దేహము మరియు జీవుడు), స్వాహా = అందమైన వాణి (దృఢ, ప్రతిజ్ఞ)తో, పరి దదే = నేను యిచ్చెదను. ౧౨

**భావార్థము:-** ఏ మనుష్యుడు విశ్వకర్మయగు పరమేశ్వరుని అజ్ఞ పాలించుటలో ఆత్మను సమర్పించునో వాడు ప్రత్యేక స్థానములో ఆ పరమాత్ముని యొక్క నీడలో సురక్షితముగ నుండును. ఏ విధముగానైతే శూరవీరులైన పురుషులు కోటలో కాపాడబడుచుందురో అటులనే. ౧౨

౪౮ .ఋషిః:- అథర్వా ॥ దేవతా:- మన్త్రోక్తాః॥

ఛన్దః:- ప్రజాపత్యా త్రిష్టుప్॥

అందరిని చేయు విశ్వకర్మ పరమేశ్వరుడు

**విశ్వకర్మాణం తే సప్తఋషివన్తమృచ్ఛన్తు।**
**యే మాఘాయవ ఉదీచ్యా దిశోఽభిదాసాత్** ॥ ౧౩ ॥ ( **అథర్వ॥** ౧౯ - ౧౮ - ౭)

**పదార్థము:-** తే = వారు (దుష్టులు), సప్త ఋషి వన్తమ్ = సప్తఋషుల (మన యొక్క చెవి, కన్ను, ముక్కు, నాలుక, చర్మము అను పంచ జ్ఞానేంద్రియములు, మనస్సు, బుద్ధి)కు స్వామి, విశ్వకర్మాణమ్ = విశ్వకర్మ (అందరిని చేయు పరమేశ్వరుని)ను, ఋచ్ఛన్తు = సేవ చేయవలయును, యే = ఎవరైతే, అఘాయవః = చెడ్డను ఆలోచించువారు, మా = నన్ను, ఉదీచ్యాః = కుడి మరియు ఎడమ, దిశః = దిశల నుండి, అభిదాసాత్ = బాధించబడుగాక! అనగా బాధించకుండుగాక! ౧౩

**భావార్థము:-** మనుష్యులు ప్రయత్నము చేయవలయును గదా! పాపులు దుష్టాచరణములను విడిచి అన్నిటికి అధికారి యగు విశ్వకర్మయైన పరమేశ్వరుని ఆజ్ఞలో నుండి అన్నిచోట్ల అందరికి సుఖములను ఇచ్చుదురు గాక. ౧౩

౪౯. ఋషిః:- నృమేధః॥ దేవతా:- ఇన్ద్రః॥

ఛన్దః:- ఉష్ణిక్॥

విశ్వమునకు దేవుడు విశ్వకర్మ పరమేశ్వరుడు

**త్వమిన్ద్రాభిభూరసి త్వం సూర్యమరోచయః।**

**విశ్వకర్మా విశ్వదేవో మహాఁ అసి ॥ ౧౪ ॥ (అథర్వ॥ ౨౦ -౬౨ -౬)**

**పదార్థము:-** ఇన్ద్ర = ఓ ఇంద్రా! (గొప్ప ఐశ్వర్యము గల పరమాత్మా!) త్వమ్ = నీవు, అభిభూః = జయమును పొందిన వాడవై, అసి = ఉన్నావు. త్వమ్ = నీవు, సూర్యమ్ = సూర్యునికి, అరోచయః = కాంతిని ఇచ్చినావు. నీవు, విశ్వకర్మా = విశ్వకర్మవు (అన్నిటిని చేయువాడవు) సృష్టికర్తవగు విశ్వకర్మవు, విశ్వదేవః = విశ్వమునకు దేవుడవు (అందరికి పూజనీయుడవు). మరియు, మహాన్ = మహామహులకు మహా మహుడవు, పరమేశ్వరుడవు, సృష్టికర్తవు, విశ్వ రచయితవుగా, అసి = ఉన్నావు. ౧౪

**భావార్థము:-** మనుష్యుడు ఆ గొప్ప బలవంతుడగు విశ్వకర్మయైన పరమాత్మను ఉపాసన చేసి తన ఆత్మను శక్తివంతముగా చేయవలయును. ౧౪

౫౦. ఋషిః:- అఙ్గిరాః॥ దేవతా:- విశ్వకర్మా॥

ఛన్దః:- భురిక్ త్రిష్టుప్॥

ఓ విశ్వకర్మ పరమేశ్వరా! నీకు నమస్కారము మమ్ము రక్షించుము

ఘోరా ఋషయో నమో అస్త్వేభ్యశ్చక్షుర్యదేషాం మనసశ్చ సత్యమ్।

బృహస్పతయే మహిష ద్యుమన్నమో విశ్వకర్మన్ నమస్తే పాహ్యఽస్మాన్॥ ౧౫ ॥

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః (అథర్వ॥ ౨ - ౩౫ - ౪)

**పదార్థము:-** ఘోరాః = పాపకర్మలు చేయువారు క్రూరులుగా నుందురు. ఋషయః = సూక్ష్మ విషయములను తెలుసుకొను పురుషులు, ఏభ్యః = వారికి (ఋషులకు), నమః = అన్నము మరియు నమస్కారములు, అస్తు = అగుగాక! యత్ = ఏలననగా, ఏషామ్ = వారి (ఋషుల) యొక్క, మనసః = మనస్సునకు, చక్షుః = నేత్రము, చ = నిశ్చయముగ, సత్యమ్ = యథార్థమును చూచుచున్నది. మహిష = ఓ పూజనీయమైన పరమేశ్వరా! బృహస్పతయే = గొప్ప గొప్ప బ్రహ్మాండములకు స్వామివి (నీకు), ద్యుమత్ = స్పష్టముగా, నమః = నమస్కారము అగుగాక! విశ్వకర్మన్ = ప్రపంచమును సృష్టించువాడ వగు ఓ విశ్వకర్మా! నమస్తే = నీకు నమస్కారము. అస్మాన్ = మమ్ము, పాహి = రక్షించుము. ౧౫

**భావార్థము:-** ఏ మహాత్ములు ఆప్తులైన ఋషుల యొక్క మనస్సునకు సంబంధించిన, మాటకు సంబంధించిన, మరియు శారీరక కర్మలు ప్రపంచమును దుఃఖము నుండి ముక్తిపరచునో వారి ఉపదేశములు మనుష్యులందరు ప్రీతి పూర్వకముగ గ్రహించుదురు. మరియు ఆ పరమేశ్వరుడు సమస్త సృష్టి యొక్క కర్తగా మరియు (భర్తగా) భారము వహించు వాడుగ నుండును. ఆయన యొక్క ఉపకారములను హృదయములో ధారణ చేసుకొని ఆయన యొక్క ఉపాసన చేయవలెను. మరియు ఎల్లప్పుడు చేయదగిన పనులను చేయుచు ఉత్తమమైన వారిని కాపాడు చుండవలయును. ౧౫

## మూడుశాంతుల కర్థము

దీనియందు మూడు పర్యాయములు శాంతి పాఠముండుటకు ప్రయోజనమే మనగా సంసారమందు మూడు విధములగు దుఃఖములున్నవి. ౧. ఆధ్యాత్మికము, ౨. ఆధి భౌతికము, ౩. ఆధి దైవికము.

౧. **ఆధ్యాత్మికము:-** అనగా ఆత్మయందును, శరీరమందును, అవిద్య, రాగము (అసూయ) ద్వేషము, మూర్ఖత, జ్వరము, మొదలగు వానిచే కలుగు దుఃఖము.

౨. **అధి భౌతికము:-** అనగా శత్రు, వ్యాఘ్ర, సర్పాదులచే కలుగు దుఃఖము.

౩. **ఆధి దైవికము:-** అనగా అతివృష్టి, అతి శీతము, అత్యుష్ణము, భూకంపము, జల

ప్రళయము, మనస్సు యొక్కయు, ఇంద్రియముల యొక్కయు అశాంతిచే కలుగు దుఃఖము.

ఈ దుఃఖముల నుండి నీవు మమ్ము దూరము చేసి కళ్యాణ కారకమగు కర్మల యందు సదా ప్రవర్తింపజేయుము. నీవే కళ్యాణ స్వరూపుడవు. ప్రపంచమున కంతకు కళ్యాణ కర్తవు. ధార్మికులైన ముముక్షువులకు కళ్యాణము నిచ్చువాడవు. కాబట్టి సమస్త జీవులు అధర్మమును వదలి, ధర్మము నాచరించి, దుఃఖముల నుండి దూరులై పరమానందమును బొందునట్లు నీవే నీ కరుణచే సమస్త జీవుల హృదయ మందును ప్రవేశింతువు గాక!

## వేదము లెన్ని? అవి ఏవి? పౌరుషేయములా? అపౌరుషేయములా?

**వేదములు నాలుగు:-** ౧. ఋగ్వేదము, ౨.యజుర్వేదము, ౩.సామవేదము, ౪. అథర్వవేదము. ఇందుకు ప్రమాణము ముందు వ్రాయబడును.

**పౌరుషేయములు:-** అనగా ప్రయత్న పూర్వకముగా వెలువడినవి పౌరుషేయములు. మానవుని నుండి యుత్పన్నమైనవి పౌరుషేయములు. "పురుషస్య భావః పౌరుషమ్"

**అపౌరుషేయములు:-** అనగా అప్రయత్న పూర్వకముగా వెలువడినవి అపౌరుషేయములు. మానవుని నుండి యుత్పన్నము కానివి అపౌరుషేయములు.

ఇందుకు ప్రమాణము:- "**న పౌరుషేయత్వం తత్కర్తుః పురుషస్యాభావాత్**" (సాంఖ్య ॥ ౫ - ౪౬) తత్కర్తుః = వేదములను రచించిన, పురుషస్య = మానవుడు, అభావాత్ = లేనందున, పౌరుషేయత్వం న = వేదములకు పౌరుషేయత్వము (మనుజ ప్రణీతత్వము) లేదు. కావున అపౌరుషేయములు.

'వేదము లీశ్వరు నుండియే యుత్పన్నములైనవి కాని, మనుష్యుల వలన కాదు.' కావున వేదములు అపౌరుషేయములు.

"**విద జ్ఞానే**" అను ధాతువునకు "**ఘఞ్ లేక అచ్**" ప్రత్యయము పరమై "**వేదః**" అనురూప మేర్పడును. వేద మనగా జ్ఞానము అని అర్థము. ఇది అపౌరుషేయము, ఈశ్వర ప్రదత్త జ్ఞానము, నిత్యము. నిర్భ్రాంత మగు వేద జ్ఞాన ప్రకాశముచే అజ్ఞానాంధకారము దూరమగును.

ఈశ్వరుడు తన వేదవాణిని అగ్నియాది ఋషుల మూలమున లోకమందు ప్రకాశింపజేసెను. ఒకరాజు తన రాజ శాసనమును ఉత్తములగు మంత్రుల ద్వారా వెల్లడి పరచును గదా? అలాగే ఈశ్వరుడును ఆ విధముగా వెల్లడి పరచియున్నాడు.

ఇందుకు ప్రమాణము:-

**ఏవం వా అరేஉస్య మహతో భూతస్య నిఃశ్వసిత** **(శత॥కాం ౧౪ - అ౫**

**మేత దృగ్వేదో యజుర్వేదః సామవేదోஉథర్వాఙ్గిరసః॥** (బ్రా ౪ - కం ౧౦)

(ఏవం వా అరే ఉస్య) మహా విద్వాంసుడై యాజ్ఞవల్క్య మహర్షి తనకు పత్నియు, విదుషియు నగు మైత్రేయి కిట్లుపదేశించుచున్నాడు. "ఓ మైత్రేయీ! సర్వ వ్యాపకుడగు పరమేశ్వరుడు ఆకాశాదుల కంటే గొప్పవాడు. అతని నుండియే ఋగ్యజు సామాథర్వము లను నాలుగు వేదములు నుత్పన్నములైనవి. మనుష్య శరీరము నుండి శ్వాస బయటికి వచ్చి మరల శరీరమును బ్రవేశించునట్లు, సర్గారంభమున నీశ్వరుడు వేదముల నుత్పన్నమొనర్చి ప్రపంచమున బ్రకటించును. ప్రళయ కాలమున బ్రపంచమున వేదములుండవు. కాని, పరమేశ్వరుని జ్ఞానము నందు బీజమున నంకుర ముండునట్లు వేదము లెల్లపుడు నుండును. ప్రథమమున బీజమునం దంకురముండును. అయంకురమే తదుపరి వృక్షరూపమై మరల బీజమున నంకుర రూపమున నుండును. అట్లే వేదములు నీశ్వరుని జ్ఞానమున నెల్లప్పుడు నుండును. అవి నశింపవు. అవి ఈశ్వరుని విద్య. కావున నవి నిత్యములు.

**తస్మాద్యజ్ఞాత్సర్వహుత ఉ ఋచః సామాని జజ్ఞిరే।**

**ఛన్దాగ్ంసి జజ్ఞిరే తస్మాద్యజుస్తస్మాదజాయత ॥** **(యజు॥ ౩౧- ౭)**

(తస్మాత్ యజ్ఞాత్ సర్వహుతః) సత్-ఎవని కెన్నడు నాశము లేదో, చిత్ -ఎవడు సదాజ్ఞాన స్వరూపుడో, అజ్ఞానమావంతయు నెవని కెన్నడును గలుగదో, ఆనంద - ఎవడు సదాసుఖ స్వరూపుడో, ఎవనికి దుఃఖ లేశ మెన్నడును గలుగదో అట్టి సచ్చిదానంద రూప లక్షణములతో గూడి సర్వత్ర పరిపూర్ణుడై యుండుటచే పురుషుడును, సర్వ మానవులచే నుపాసింపబడ యోగ్యుడగు నిష్టదేవుడగుటచే సర్వహుతుడును, సర్వ సామర్థ్య యుక్తుడును నగు నా పరబ్రహ్మము నుండి (ఋచః) ఋగ్వేదము, (సామాని) సామవేదము, (జజ్ఞిరే) పుట్టెను. (తస్మాత్) ఆ పరమేశ్వరు నుండి (ఛన్దాంసి) అథర్వవేదము, (జజ్ఞరే) పుట్టెను. (తస్మాత్) అతని నుండి, (యజుః) యజుర్వేదము, (అజాయత) జన్మించెను.

వివరణ:- **"జజ్ఞిరే, అజాయత"** అను నేకార్థక క్రియలను రెండింటిని ప్రయోగించుట వలన వేదము అనేక విద్యా యుక్తములని యెరుగవలెను. అట్లే **"తస్మాత్"** అను పదమును రెండు మారులు ప్రయోగించుట వలన "వేదము లీశ్వరు నుండియే యుత్పన్నములైనవి కాని, మనుష్యుల వలన కాదు" అని నిశ్చయముగా నెరుగవలెను. వేద మంత్రము లన్నియు గాయత్రి మున్నగు ఛందస్సులతో గూడియే యున్నవి. అయినను **"ఛన్దాంసి"** అను పదము ప్రత్యేకముగ మంత్రమున ప్రయోగింపబడినందున నది నాలుగవది యైన అథర్వ వేదోత్పత్తిని దెలుపును.

**యస్మాదృచో అపాతక్షన్ యజుర్యస్మాదపాకషన్।**

**సామాని యస్య లోమాన్యథర్వాఙ్గిరసో ముఖం**

**స్కమ్భం తం బ్రూహి కతమః స్విదేవ సః ॥ (అథర్వ ॥ ౧౦ - ౭ - ౨౦)**

(యస్మాదృచో అపాతక్షన్) సర్వశక్తిమంతుడగు పరమేశ్వరుని నుండి ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, (అఙ్గిరసః) అథర్వ వేదము అను నాలుగు వేదములు జనించినవి. "అథర్వ వేదము ఈశ్వరుని ముఖతుల్యము; సామవేదము లోమ (రోమ) సమానము; యజుర్వేదము హృదయము వంటిది; ఋగ్వేదము ప్రాణము" అని పరమేశ్వరు డీ మంత్రమున వేదముల యుత్పత్తిని రూపకాలంకారముతో దెలిపియున్నాడు. (బ్రూహి కతమః స్విదేవ సః) నాలుగు వేదములు నే దేవుని నుండి యుత్పన్నము లైనవో యతనిని దెలుపుము. (స్కమ్భం తమ్) పరమేశ్వరుడు సర్వ జగద్ధారకుడు. అతని నామము స్కంభుడు. అతడే వేద కర్తయని యెరుగుము. మానవుల కుపాసింపదగిన యిష్ట దేవు డతడు తప్ప మరియొకడు లేడనియు నెరుగుము. వేద కర్తయు, సర్వశక్తి మంతుడు నగు పరమేశ్వరుని విడిచి అన్యునుపాసించు నభాగ్యుడెవడుండును.

వేదము సమస్త సత్య విద్యలు గల గ్రంథము - సత్యమును గ్రహించుటకును అసత్యమును త్యజించుటకును వేదమే ఆధారము. ఈశ్వరుడు సర్వజ్ఞుడు గనుక అతనికి తెలియని విద్యలు లేవు. కావున వేదము అన్ని విద్యలతో గూడియున్నది. వేద ధర్మము మనుష్యులకు ముఖ్య ధర్మము. వేదమందలి ధర్మము మానవులందరికి పరమ ధర్మము. వేద కర్మలే లోకమున కంతటికిని ఆచరణీయములు. వేదమందు అసంభవమైన కథలు గాని, మానవ చరిత్రలు గాని, మతమతాంతర సిద్ధాంతములు గాని, పక్షపాతము గాని, అన్యాయము గాని యెంత మాత్రమును లేదు. వేదము ఈశ్వరీయ జ్ఞానము.

"ఋగ్వేద ఏవాగ్నే రజాయత యజుర్వేదో వాయోః సామవేద ఆదిత్యా దైతరేయ బ్రాహ్మణ పఞ్చకమ్।" (ఐతరేయ బ్రాహ్మణము ౩౨) "అగ్నే ఋగ్వేదో వాయోర్యజుర్వేదః సూర్యో స్సామ వేదః"॥ (శతపథ బ్రాహ్మణము ౧౧ - ౫ - ౨ - ౩)

**అగ్నివాయురవిభ్యస్తు త్రయం బ్రహ్మ సనాతనమ్।**

**దుదోహ యజ్ఞ సిద్ధ్యర్థమృగ్యజుః సామలక్షణమ్॥** (మనుస్మృతి ౧ - ౨౩)

ఇట్టి ప్రమాణముల చేత అగ్ని, వాయు, ఆదిత్య, అంగీరసు లను నలుగురు ఋషుల మూలమున ఋగ్, యజు, సామ, అథర్వ వేదములను ఈశ్వరుడు వెల్లడి పరచెనని సిద్ధమగుచున్నది. అందరి జీవుల కంటే నా నల్గురే మిక్కిలి పవిత్రాత్ములుగా నుండిరి.

పై ప్రమాణముల బట్టి వేదములు నాలుగని, మానవ కృతములు కావని అవి పరమేశ్వరుని కృతములని, అపౌరుషేయములని స్పష్టమైనది. కావున వేదములు నాలుగు, మరియు అపౌరుషేయములు.

## ప్రణవ వేదము

మన సోదరులెందరో చతుర్వేదములు గాక ప్రణవ వేదమను నది కూడా నొకటుండెననియు, వ్యాసులవారు ఐదు వేదములను నాలుగు వేదములుగ జేసి నారనియు (అనగా ప్రణవ వేదమును నాలుగు వేదములందు విభజించిరని) యందురు. కేవలమది వట్టి భ్రమయే యని విదితమగుచున్నది. ఎందుకనిన - దానికెక్కడను ప్రమాణము లేదు. అకార - ఉకార- మకారముల సంయోగ రూప ఓంకారమునకు ప్రణవ మని పేరు. అందలి ఒక్కొక్క మాత్రకు విస్తారముగా నర్థము చేసిన ఒక్కొక్క వేదమున కర్థము కాగలదను నది మాత్రము సహేతుకముగా సంగతమగును. ఎట్లన:- **అకారముచే** విరాట్, అగ్ని, విశ్వాదులు; **ఉకారముచే** హిరణ్యగర్భ, వాయు, తైజ సాదులు; **మకారముచే** ఈశ్వర, ఆదిత్య, ప్రాజ్ఞాదులు. ఇట్లెన్నియో అర్థములు ప్రణవ మనెడు ఓంకారమునకు సప్రమాణముగా నొప్పును. గమనింతురు గాక-

**సర్వేవేదా యత్పదమామనన్తి తపాంసి సర్వాణి చ యద్వదన్తి।**

**యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్॥**

**(కఠోప॥ ౨ - ౧౫)**

అనగా - సకల వేదశాస్త్రములు, ధర్మానుష్ఠానము లనెడు సమస్త తపశ్చర్యలు మొదలైనవి ఎవని గొనియాడుచు, వర్ణించుచున్నవో, తాపసులెవని బొందుటకు బ్రహ్మచర్యాది వ్రతములను పాలించుచున్నారో, అతని నామమే "ఓ౩మ్" అని యెరుగ దగును. పరమేశ్వరుని నిజ నామముగను, వేదములన్నిటికి మూల బీజముగను యున్న నీ ప్రణవ రూప ఓంకారమునే ప్రణవ వేదమని యంగీకరించిన నష్టమేమియు లేదు. కాని ప్రణవ వేద మొక భిన్న మంత్ర సంహిత యని మాత్రము సిద్ధము కాదు. (వి.ద. పుట-32) కావున ప్రణవ వేదము లేదు.

## చతుర్వేదీయ విశ్వకర్మ సూక్త మన్త్రాః

ఈ క్రింది మంత్రములను ప్రతి దినము పారాయణము చేయుట, స్వాధ్యాయము చేయుట, మరియు మననము చేయుట వలన విద్యా, విజ్ఞానము, సంపద లభించు మార్గము ప్రశస్తమగును. యజ్ఞముతో సాధన చేసినట్లైతే (అనగా యజ్ఞము నందు ఈ మంత్రములతో ఆహుతుల నిచ్చినట్లైతే) అత్యధికమైన లాభము కలుగును.

**గమనిక:-** యజ్ఞము నందు ఆహుతుల నిచ్చునపుడు ప్రతి మంత్రమునకు మొదట '**ఓ౩మ్**' అని, చివర "**స్వాహా**" అని పఠించ వలయును. పిదప "**ఇదం విశ్వకర్మణే - ఇదన్న మమ**" అని పఠించవలయును.

ఉదా: **ఓ౩మ్** ..............................................।

............................................... **స్వాహా**॥

ఇదం విశ్వకర్మణే - ఇదన్న మమ॥

**ఋగ్వేదము నుండి:-**

ఓం య ఇమా విశ్వా భువనాని జుహ్వదృషిర్హోతా న్యసీదత్ పితా నః।
స ఆశిషా ద్రవిణమిచ్ఛమానః ప్రథమచ్ఛదవరాన్ ఆ వివేశ॥

౨★ కిం స్విదాసీదధిష్ఠానమారమ్భణం కతమత్స్విత్కథాసీత్।
యతో భూమిం జనయన్విశ్వకర్మా వి ద్యామౌర్ణోన్మహినా విశ్వచక్షాః॥ ౨॥

3. విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతోబాహురుత విశ్వతస్పాత్।
సం బాహుభ్యాం ధమతి సం పతత్రైర్ద్యావాభూమీ జనయన్దేవ ఏకః॥ 3 ॥

౪. కిం స్విద్వనం క ఉ స వృక్ష ఆస యతో ద్యావాపృథివీ నిష్టతక్షుః।
మనీషిణో మనసా పృచ్ఛతేదు తద్యదధ్యతిష్ఠద్భువనాని ధారయన్ ॥ ౪ ॥

౫★ యా తే ధామాని పరమాణి యావమా యా మధ్యమా విశ్వకర్మన్నుతేమా।
శిక్షా సఖిభ్యో హవిషి స్వధావః స్వయం యజస్వ తన్వం వృధానః॥ ౫ ॥

౬★ విశ్వకర్మన్ హవిషా వావృధానః స్వయం యజస్వ పృథివీముత ద్యామ్।
ముహ్యన్త్వన్యే అభితో జనాస ఇహాస్మాకం మఘవా సూరిరస్తు॥ ౬ ॥

౭★ వాచస్పతిం విశ్వకర్మాణమూతయే మనోజువం వాజే అద్యా హువేమ
స నో విశ్వాని హవనాని జోషద్విశ్వశంభూరవసే సాధుకర్మా ॥ ౭ ॥

౮. చక్షుషః పితా మనసా హి ధీరో ఘృతమేనే అజనన్నమ్నమానే।
యదేదన్తా అదదృహన్త పూర్వ ఆదిద్ ద్యావాపృథివీ అప్రథేతామ్ ॥ ౮ ॥

౯★ విశ్వకర్మా విమనా ఆద్విహాయా ధాతా విధాతా పరమోత సన్దృక్।
తేషామిష్టాని సమిషా మదన్తి యత్రా సప్తఋషీన్పర ఏకమాహుః ॥ ౯ ॥

౧౦. యో నః పితా జనితా యో విధాతా ధామాని వేద భువనాని విశ్వా।
యో దేవానాం నామధా ఏక ఏవ తం సమ్ప్రశ్నం భువనా యన్త్యన్యా॥ ౧౦ ॥

౧౧. త ఆయజన్త ద్రవిణం సమస్మా ఋషయః పూర్వే జరితారో న భూనా।
అసూర్తే సూర్తే రజసి నిషత్తే యే భూతాని సమకృణ్వన్నిమాని ॥ ౧౧ ॥

౧౨. పరో దివా పర ఏనా పృథివ్యా పరో దేవేభిరసురైర్యదస్తి।
కం స్విద్గర్భం ప్రథమం దధ్ర ఆపో యత్ర దేవాః సమపశ్యన్త విశ్వే ॥ ౧౨ ॥

౧౩. తమిద్గర్భం ప్రథమం దధ్ర ఆపో యత్ర దేవాః సమగచ్ఛన్త విశ్వే।
అజస్య నాభావధ్యేకమర్పితం యస్మిన్విశ్వాని భువనాని తస్థుః॥ ౧౩ ॥

౧౪. న తం విదాథ య ఇమా జజానాన్యద్యుష్మాకమన్తరం బభూవ।
నీహారేణ ప్రావృతా జల్ప్యా చాసుతృప ఉక్థశాసశ్చరన్తి ॥ ౧౪ ॥

౧౫★ త్వమిన్ద్రాభిభూరసి త్వం సూర్యమరోచయః।
విశ్వకర్మా విశ్వదేవో మహాన్ అసి ॥ ౧౫ ॥

యజుర్వేదము నుండి:-

౧౬. య ఽ ఇమా విశ్వా భువనాని జుహ్వదృషిర్హోతా న్యసీదత్పితా నః।
స ఽ ఆశిషా ద్రవిణమిచ్ఛమానః ప్రథమచ్ఛదవరాన్౨ఽ ఆవివేశ ॥ ౧ ॥

౧౭★ కిగ్ంస్విదాసీదధిష్ఠానమారమ్భణం కతమత్స్విత్కథాసీత్।
యతో భూమిం జనయన్విశ్వకర్మా వి ద్యామౌర్ణోన్మహినా విశ్వచక్షాః॥ ౨ ॥

౧౮. విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతోబాహురుత విశ్వతస్పాత్।
సం బాహుభ్యాం ధమతి సం పతత్రైర్ద్యావాభూమీ జనయన్దేవ ఽ ఏకః॥ ౩ ॥

౧౯. కిగ్ంస్విద్వనం క ఽ ఉ స వృక్ష ఽ ఆస యతో ద్యావాపృథివీ నిష్టతక్షుః।
మనీషిణో మనసా పృచ్ఛతేదు తద్యదధ్యతిష్ఠద్ భువనాని ధారయన్ ॥౪॥

౨౦★ యా తే ధామాని పరమాణి యావమా యా మధ్యమా విశ్వకర్మన్నుతేమా।
శిక్షా సఖిభ్యో హవిషి స్వధావః స్వయం యజస్వ తన్వం వృధానః ॥ ౫ ॥

౨౧★ విశ్వకర్మా విమనా ఽ ఆద్విహాయా ధాతా విధాతా పరమోత సన్దృక్।
తేషామిష్టాని సమిషా మదన్తి యత్రా సప్తఋషీన్ పర ఽ ఏకమాహుః॥ ౬ ॥

౨౨. యో నః పితా జనితా యో విధాతా ధామాని వేద భువనాని విశ్వా।
యో దేవానాం నామధా ఽ ఏక ఽ ఏవ తగ్ంసమ్ప్రశ్నం భువనా యన్త్యన్యా॥ ౭ ॥

౨౩. పరో దివా పర ఽ ఏనా పృథివ్యా పరో దేవేభిరసురైర్యదస్తి।
కగ్ంస్విద్గర్భం ప్రథమం దధ్ర ఆపో యత్ర దేవాః సమపశ్యన్త పూర్వే॥ ౮ ॥

౨౪. తమిద్గర్భం ప్రథమం దధ్ర ఽ ఆపో యత్ర దేవాః సమగచ్ఛన్త విశ్వే।
అజస్య నాభావధ్యేకమర్పితం యస్మిన్విశ్వాని భువనాని తస్థుః॥ ౯ ॥

౧౫★ త్వమిన్ద్రాభిభూరసి త్వం సూర్యమరోచయః।
విశ్వకర్మా విశ్వదేవో మహాన్ అసి ॥ ౧౫ ॥

యజుర్వేదము నుండి:-

౧౬. య ఉ ఇమా విశ్వా భువనాని జుహ్వదృషిర్హోతా న్యసీదత్పితా నః।
స ఉ ఆశిషా ద్రవిణమిచ్ఛమానః ప్రథమచ్ఛదవరాన్ ౨ ఉ ఆవివేశ ॥ ౧ ॥

౧౭★ కిగ్ం స్విదాసీదధిష్ఠానమారమ్భణం కతమత్స్విత్కథాసీత్।
యతో భూమిం జనయన్విశ్వకర్మా వి ద్యామౌర్ణోన్మహినా విశ్వచక్షాః॥ ౨ ॥

౧౮. విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతోబాహురుత విశ్వతస్పాత్।
సం బాహుభ్యాం ధమతి సం పతత్రైర్ద్యావాభూమీ జనయన్దేవ ఉ ఏకః॥ ౩ ॥

౧౯. కిగ్ం స్విద్వనం క ఉ ఉ స వృక్ష ఉ ఆస యతో ద్యావాపృథివీ నిష్టతక్షుః।
మనీషిణో మనసా పృచ్ఛతేదు తద్యదధ్యతిష్ఠద్ భువనాని ధారయన్ ॥౪॥

౨౦★ యా తే ధామాని పరమాణి యావమా యా మధ్యమా విశ్వకర్మన్నుతేమా।
శిక్షా సఖిభ్యో హవిషి స్వధావః స్వయం యజస్వ తన్వం వృధానః ॥ ౫ ॥

౨౧★ విశ్వకర్మా విమనా ఉ ఆద్విహాయా ధాతా విధాతా పరమోత సన్దృక్।
తేషామిష్టాని సమిషా మదన్తి యత్రా సప్తఋషీన్ పర ఉ ఏకమాహుః॥ ౬ ॥

౨౨. యో నః పితా జనితా యో విధాతా ధామాని వేద భువనాని విశ్వా।
యో దేవానాం నామధా ఉ ఏక ఉ ఏవ తగ్ం సమ్ప్రశ్నం భువనా యన్త్యన్యా॥ ౭ ।

౨౩. పరో దివా పర ఉ ఏనా పృథివ్యా పరో దేవేభిరసురైర్యదస్తి।
కగ్ం స్విద్గర్భం ప్రథమం దధ్ర ఆపో యత్ర దేవాః సమపశ్యన్త పూర్వే॥ ౮ ॥

౨౪. తమిద్గర్భం ప్రథమం దధ్ర ఉ ఆపో యత్ర దేవాః సమగచ్ఛన్త విశ్వే।
అజస్య నాభావధ్యేకమర్పితం యస్మిన్విశ్వాని భువనాని తస్థుః॥ ౯ ॥

సామవేదము నుండి:-

౩౪★ విశ్వకర్మన్ హవిషా వావృధానః స్వయం యజస్వ తన్వాం౩ స్వా హి తే।
మహ్యన్త్వన్యే అభితో జనాస ఇహాస్మాకం మఘవా సూరిరస్తు ॥ ౧ ॥

౩౫★ త్వమిన్ద్రాభిభూరసి త్వం సూర్యమరోచయః।
విశ్వకర్మా విశ్వదేవో మహాన్ అసి ॥ ౨ ॥

అథర్వవేదము నుండి:-

౩౬★ యే భక్షయన్తో న వసూన్యానృధుర్యానగ్నయో అన్వతప్యన్త ధిష్ణ్యాః।
యా తేషామవయా దురిష్టిః స్విష్టిం నస్తాం కృణవద్విశ్వకర్మా ॥౧॥

౩౭★యజ్ఞపతిమృషయ ఏనసాహుర్నిర్భక్తం ప్రజా అనుతప్యమానమ్।
మథవ్యాన్స్తోకానప యాన్ రరాధ సం నష్టేభిః సృజతు విశ్వకర్మా ॥ ౨ ॥

౩౮★ అదాన్యాన్త్సోమపాన్ మన్యమానో యజ్ఞస్య విద్వాన్త్సమయే న ధీరః।
యదేనశ్చకృవాన్ బద్ధ ఏష తం విశ్వకర్మన్ ప్ర ముఞ్చా స్వస్తయే ॥౩॥

౩౯★ యజ్ఞస్య చక్షుః ప్రభృతిర్ముఖం చ వాచా శ్రోత్రేణ మనసా జుహోమి।
ఇమం యజ్ఞం వితతం విశ్వకర్మణా దేవా యన్తు సుమనస్యమానాః ॥ ౪ ॥

౪౦★ ఏతం భాగం పరి దదామి విద్వాన్ విశ్వకర్మన్ ప్రథమజా ఋతస్య।
అస్మాభిర్దత్తం జరసః పరస్తాదచ్ఛిన్నం తన్తుమను సం తరేమ ॥౫॥

౪౧ తతం తన్తుమన్వేకే తరన్తి యేషాం దత్తం పిత్ర్యమాయనేన ।
అబన్ధ్వేకే దదతః ప్రయచ్ఛన్తో దాతుం చేచ్ఛిక్షాన్త్స స్వర్గ ఏవ ॥౬॥

౪౨.అన్వారేభథామనుసంరభేథామేతం లోకం శ్రద్దధానాః సచన్తే।
యద్వాం పక్వం పరివిష్టమగ్నౌ తస్య గుప్తయే దమ్పతీ సం శ్రయేథామ్ ॥ ౭ ॥

౪౩. యజ్ఞం యన్తం మనసా బృహన్తమన్వారోహామి తపసా సయోనిః।
ఉపహూతా అగ్నే జరసః పరస్తాత్ తృతీయే నాకే సధమాదం మదేమ ॥ ౮ ॥

౪౪. శుద్ధాః పూతా యోషితో యజ్ఞియా ఇమా బ్రహ్మాణాం హస్తేషు ప్రపృథక్ సాదయామి।
యత్కామ ఇదమభిషిఞ్చామి వో౽హమిన్ద్రో మరుత్వాన్స దదాతు తన్మే ॥ ౯ ॥
౪౫★ యే వధ్యమానమను దీధ్యానా అన్వైక్షన్త మనసా చక్షుషా చ।
అగ్నిష్టానగ్రే ప్ర ముమోక్తు దేవో విశ్వకర్మా ప్రజయా సంరరాణః॥౧౦॥
౪౬★ యస్య నేశే యజ్ఞపతిర్న యజ్ఞో నాస్య దాతేశే న ప్రతిగ్రహీతా।
యో విశ్వజిద్ విశ్వభృద్ విశ్వకర్మా ఘర్మం నో బ్రూత యతమశ్చతుష్పాత్ ॥ ౧౧ ॥
౪౭★ విశ్వకర్మా మా సప్తఋషిభిరుదీచ్యా దిశః పాతు తస్మిన్ క్రమే తస్మిఞ్ఛ్రయే తాం పురం ప్రైమి।
స మా రక్షతు స మా గోపాయతు తస్మా ఆత్మానం పరి దదే స్వాహా ॥౧౨॥
౪౮★ విశ్వకర్మాణం తే సప్తఋషివన్తమృచ్ఛన్తు।
యే మాఘాయవ ఉదీచ్యా దిశో౽భిదాసాత్ ॥ ౧౩ ॥
౪౯★ త్వమిన్ద్రాభిభూరసి త్వం సూర్యమరోచయః।
విశ్వకర్మా విశ్వదేవో మహాఁ అసి ॥ ౧౪ ॥
౫౦★ ఘోరా ఋషయో నమో అస్త్వేభ్యశ్చక్షుర్యదేషాం మనసశ్చ సత్యమ్।
బృహస్పతయే మహిష ద్యుమన్నమో విశ్వకర్మన్ నమస్తే పాహ్యస్మాన్॥ ౧౫ ॥

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః

# విశ్వకర్మ మహా యజ్ఞము

నాచే వ్రాయబడిన "వైదిక సూక్తము"లను గ్రంథము నందు గల 69వ పుటలో గల ఋత్విజు నెన్నిక- సంకల్పము నుండి 74వ పుటలో గల శాంతికరణ మంత్రముల వరకు పఠించి, 78వ పుటలో గల ఆచమనము నుండి 84వ పుటలో గల అష్టాజ్యాహుతుల వరకు ఆహుతులనిచ్చి పిదప ఈ పుస్తకము నందలి 48వ పుటలో గల 'చతుర్వేదీయ విశ్వకర్మ సూక్త 50 మంత్రములతో' ఆహుతుల నివ్వవలయును. ఒక వేళ సమయం లేనట్లయితే నక్షత్రపు గుర్తు పెట్టిన 30 మంత్రములతో ఆహుతుల నిచ్చి పిదప వైదిక సూక్తములను గ్రంథము నందు గల 85వ పుటలో గల ప్రాతఃకాల హవన మంత్రము నుండి 87వ పుటలో గల గాయత్రీ మంత్రము వరకు ఆహుతులనిచ్చి 90వ పుటలో గల పూర్ణాహుతి మంత్రముతో ఆహుతి నిచ్చి 87వ పుటలో గల అవశిష్టఘృతాహుతి మంత్రము నుండి 88వ పుటలో గల శాన్తిపాఠం వరకు సమస్త విధి గావించి ముగించవలెను.

ప్రథమాధ్యాయము సమాప్తము

# ద్వితీయాధ్యాయము

## విశ్వకర్మ - శిల్పులకు కీర్తి

వివిధ విశిష్ట కర్మలచే విశ్వమును వర్ధిల్ల జేయుట

**యస్యాం వేదిం పరిగృహ్ణన్తి భూమ్యాం యస్యాం యజ్ఞం తన్వతే విశ్వకర్మాణః।**
**యస్యాం మీయన్తే స్వరవః పృథివ్యామూర్ధ్వాః శుక్రా ఆహుత్యాః పురస్తాత్।**
**సా నో భూమిర్వర్ధయద్వర్ధమానా॥** **(అథర్వ ॥ ౧౨ - ౧ - ౧౩)**

**పదార్థము:-** ఏ భూమి మీద, విశ్వకర్మాణః = విశ్వకర్మ శిల్పులు - అన్ని పనులలో నేర్పరులు, యజ్ఞ వేదికను నిర్మించెదరో, చుట్టు కూర్చుండెదరో ఏ భూమిపైన యజ్ఞమును - దేవపూజ, సంగతి కరణము, దానము ★ మున్నగు వ్యవహారములను శ్రేష్టతమ కర్మను పరోపకార కార్యములను విస్తరించెదరో, ఏ పృథివిపై ఉన్నతమైన - ఎత్తైన తెల్లని ధవళ కాంతులతో దేదీప్యమానము లగు యజ్ఞ యూపములను విజయ స్తంభములను పూర్ణాహుతికి పూర్వము పాతెదరో, ఆ వర్ధిల్లు భూమి మమ్ము వర్ధిల్ల - పెంపొందింప జేయుగాక।

**భావార్థము:-** ప్రతి కార్యమును నేర్పుతో ఓర్పుతో సొంపుగ చేయుచు కర్మ కౌశలముచే కీర్తిమంతులై ప్రపంచమున ప్రఖ్యాతి గాంచవలయును. వివిధ కర్మలను నైపుణ్యముగ చేయుటలో సిద్ధహస్తులగు శిల్పులై ప్రపంచమునకు ఉపకారము చేయుచు శాశ్వత కీర్తిని ఆనందమును బడయ వలయును.

ఏ భూమిపై వివిధ స్థానములలో యజ్ఞ వేదికలు నిర్మించబడునో అందరి ఉన్నతిలో తమ ఉన్నతి కలదని తలంచు విశ్వకర్మ శిల్పులు విశిష్ట కర్మల నొనర్చెదరో ఉత్తమోత్తమ కర్మలచే ఉర్వి జనుల కుపకారము చేయుదురో తాము ఉత్తములై ఉత్తములను గౌరవించెదరో అచ్చట అందరాయురారోగ్యాలతో వర్ధిల్లెదరు.

ఏ భూమిపై ప్రజలు యజ్ఞ వేదిక చుట్టూ కూర్చుండి ఘృతాది హవ్య పదార్థముల నాహుతు లొసంగెదరో, ఏ భూమిపై ఎల్లప్పుడు ఉన్నతిని బలమును కలిగించు పరోపకార

---

★ *దేవపూజ = విద్వాంసుల సత్కారము, సంగతి కరణము = ఉత్తమ పదార్థముల సేకరణము, దానము = కష్టపడి న్యాయమార్గమున సంపాదించిన ద్రవ్యము పరుల ప్రయోజనార్థము వినియోగించుట - ఒక వస్తువుపై తనకు గల స్వామిత్వమును పరులకు సంక్రమింపజేయుట.*

కార్యములను చేయుదురో, ఉత్సాహ వర్ధక ఉపదేశములను ప్రవచింతురో, ఆ ఈ మా మాతృభూమి మన ఉన్నతికి కారణమగు గాక! (విరాట్ ౩ - ౧౦ - ౧౯౭౫)

## విశ్వకర్మలచే విశ్వశాంతి

**యామన్వైచ్ఛద్ధవిషా విశ్వకర్మాన్తరర్ణవే రజసి ప్రవిష్టామ్।**

**భుజిష్యం౧ పాత్రం నిహితం గుహా యదావిర్భోగే అభవన్మాతృమద్భ్యః॥**

**(అథర్వ ॥ ౧౨-౧-౬౦)**

**పదార్థము:-** విశ్వకర్మా = వివిధ కర్మల నొనర్చుటలో చతురుడగు విశ్వకర్మ, ఇచ్ఛిపుచ్చుకొను గుణములు గలవాడై - త్యాగ భావముతో జలము నందు, అంతరిక్షమున - మట్టియందు ప్రవేశించి యున్న ఏ పృథివిని అన్వేషించాడో, మాతృభూమిగ అభిలషించాడో దానిని మాతృభూమిగ తలంచు వారి కొరకు ఏ భోజన పదార్థమును, రక్షణ సాధనమును గుహలో దాచి యుంచిన పదార్థము వలె అది అనుభవించుటకు ప్రకటిత మగును.

**భావార్థము:-** భూ మండలమున విహరించుచు, వివిధ స్థానాలలో విభిన్న వాతావరణము లందు వివేకము గలవారు విశిష్ట కర్మల నొనర్చుచు అందరిని అన్న జలాదులతో సంతృప్తుల జేయచు తాము ఆనందము ననుభవింతురు. విశ్వమును శాంతి ధామముగ చేయుదురు. (విరాట్ ౮-౪ -౧౯౭౭)

## విశ్వకర్మల సత్కారము

**యే ధీవానో రథకారాః కర్మారా యే మనీషిణః।**

**ఉపస్తీన్ పర్ణ మహ్యం త్వం సర్వాన్ కృణ్వభితో జనాన్॥** **అథర్వ ౩-౫-౬)**

**పదార్థము:-** పాలన మొనర్చు రాజ్యాధ్యక్షా! నీవు నా కొరకు సర్వజనులను ఎవరైతే తీక్ష్ణ బుద్ధి మంతులో, రథకారాః = రథములను నిర్మించువారో మరియు ఎవరైతే మనన శీలురో మహా విద్వాంసులో, శిల్పకళా విదులో, కార్మికులో వారందరిని నలువైపుల నుండి సమీపస్థుల జేయుము - సమీపమునకు కొనితెమ్ము.

**భావార్థము:-** రాజ్యాధ్యక్షులు, ప్రభుత్వాధినేతలు, ప్రజల మేలు కొరకు రాజ్యాభివృద్ధి రథములను భూ జల, ఆకాశ మార్గములలో పయనించు విమానాది వాహనాలన నిర్మించు విశ్వకర్మలను - శిల్పులను సముచితముగా సత్కరించి, వివిధ వృత్తుల నభివృద్ధి పరచి దేశమును సమున్నత మొనర్చదగును. (విరాట్ ౯-౯ -౧౯౮౩)

## శిల్పుల స్వాగత సత్కారము

**యే ధీవానో ........................................................... మనీషిణః।**

**ఉపస్తీన్ ............................................................... జనాన్ ॥**

**(అథర్వ ॥ ౩-౫-౬)**

**పదార్థము:-** మంత్రివర్యా! పాలించు పరమేశ్వరా! నీవు నా కొరకు ఎవరైతే ధీమంతులు - తీక్షణమైన బుద్ధిగలవారు, రథకారాః = రథములను నిర్మించువారు, ఎవరైతే మనన శీలురు శిల్పులు- గలరో వారినందరిని నలువైపుల సమీప వర్తులుగ చేయుము.

**భావార్థము:-** రాజులు, రాజ్యాధ్యక్షులు - ప్రజలు బుద్ధిమంతులను భూమి, జలము, అంతరిక్షము నందు సంచరించ గలుగు రథములను, వాహనములను నిర్మించగల రథకారులను, లోహకారులను, వివిధ శిల్పకర్మల నెరిగిన శిల్పులను - విశ్వకర్మ జనులను సత్కరించవలయును. వారి వలన ప్రపంచోన్నతిని సాధింపవలయును.

(విరాట్ ౧౫-౧౨ -౧౯౭౮)

## ఉత్తమ జ్ఞానుల - శిల్పుల సత్కారము

**ఉగ్రో రాజా మన్యమానో బ్రాహ్మణం యో జిఘత్సతి।**

**పరా తత్ సిచ్యతే రాష్ట్రం బ్రాహ్మణో యత్ర జీయతే ॥** (అథర్వ ౫-౧౯ -౬)

**పదార్థము:-** యః రాజా = ఏ రాజైతే, ఉగ్రః మన్య మానః = తన్ను తాను గొప్ప వానినిగ తలంచుచు, బ్రాహ్మణమ్ = జ్ఞానిని- మేధావి వర్గమును, జిఘత్సతి =

నాశనమొనర్పదలచునో, యత్ర = ఎచ్చట- ఏ దేశమున, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు★, జీయతే = అణచివేయబడునో, తత్ = ఆ, రాష్ట్రమ్ = రాష్ట్రము- దేశము, పరాసిచ్యతే = మిక్కిలి పతనమగును.

**భావార్థము:-** కనుక జ్ఞానులను - జ్ఞాన విజ్ఞాన వేత్తలను మేధావులను శిల్పులను సర్వతంత్ర స్వతంత్రులుగా నుండి సర్వోన్నతికి ప్రయత్నించు నటుల సన్మానింపవలయును. సముచితముగ సత్కరింపవలయును. (విరాట్ ౩౧-౮ -౧౯౭౯)

## శిల్పకర్మ - బ్రాహ్మణకర్మ

**వచనాద్రథకారస్యాఽధానేఽస్య సర్వ శేషత్వాత్।** (మీమాంసా దర్శనం ౨-౧-౪౩)

రథకారునికి (శిల్పికి) అగ్న్యాధానము చేయుటలో బ్రాహ్మణకర్మ యున్నందుచే ఇతనికి అగ్న్యాధానము యొక్క అర్హత కలుగుచున్నది. ఎందుకనగా:- ఇది మూడు వర్ణములకు ముఖ్యము. (అగ్న్యాధాన మనగా యజ్ఞకుండము నందు అగ్నిని ప్రతిష్ఠించుట)

శిల్పులకు అగ్న్యాధానము యొక్క అధికారము కలదు. ఎట్లనగా:- శిల్పకర్మ అన్ని కర్మలకు మూలమైనది. యజ్ఞాది కర్మలలో బ్రాహ్మణులకు, శస్త్రాది కర్మలలో క్షత్రియులకు, కృషి కర్మలలో వైశ్యులకు శిల్ప విద్య అవసరము, అనివార్యము. కనుక వర్ణత్రయమునకు ముఖ్యమైనందున శిల్పియగు రథకారునకు అగ్న్యాధానము చేయునధికార మున్నది. "**వర్షాసు రథకార ఆదధీత**" అనగా వర్షాకాలములో రథకారులు అగ్న్యాధానము చేయుట. శిల్పికిచ్చట అగ్న్యాధానము యొక్క అధికారమున్నదని స్పష్టమగుచున్నది. కావున శిల్పకర్మ శూద్రునిది కాదు. ఒకవేళ శూద్రుని దైతే అతనికి అగ్న్యాధానము యొక్క అర్హత లేదు కదా! కాబట్టి "శిల్పకర్మ ద్విజులదే! కావున శిల్పులు ద్విజులే!!"

**న్యాయ్యో వా కర్మసంయోగాత్ శూద్రస్య ప్రతిషిద్ధత్వాత్ ।**

(మీమాంసా దర్శనము ౬-౧-౪౫)

---

★ ***అధ్యాపన మధ్యయనం యజనం యాజనం తథా।***
*దాన ప్రతిగ్రహశ్చైవ బ్రాహ్మణానామకల్పయత్ ॥* ***(మను॥ ౧ -౮౮)***
***అర్థము:*** *౧. వేదములను చదువుట, ౨. చదివించుట, ౩.యజ్ఞము చేయుట, ౪.చేయించుట, ౫. దానము ఇచ్చుట, ౬. తీసుకొనుట - ఈ ఆరు బ్రాహ్మణుని కర్మలు. పై కర్మలు ఎవని యందు గలవో వానినే బ్రాహ్మణు డని అందురు.*

పైన చెప్పబడిన విషయము వాస్తవము. ఎట్లనగా:- శిల్పికి కర్మలతో సంబంధము కన్పడుచున్నది. శూద్రునకు నిషేధించబడినది. అట్టి నిషేధము లేని శిల్పి ద్విజుడే.

**ఉక్తమనిమిత్తత్వమ్** (మీమాంసా దర్శనము ౬-౧-౪౯).

శూద్రుని యొక్క యోగ్యత తెలిసిన తరువాత అతనిలో శూద్రత్వము లేనందున ఉపనయనాధికారము కలదు. వైదిక సిద్ధాంత ప్రకారము ఎవడు అయోగ్యుడో, ఎవడు అజ్ఞానియో, ఎవడు మూర్ఖుడో వాడు శూద్రుడు. కనుక శూద్రత్వము ఒక జాతి - కులము కాదు.

ఇచ్చట జ్ఞాపకముంచుకొనదగిన ముఖ్య విషయ మేమనగా జన్మనుండి జాతిని ఒప్పుకొను వారు తమ సిద్ధాంతమును శాస్త్ర విరుద్ధముగా పరిగణింతురు. ఎందుకనగా వారి సిద్ధాంతములో రథకారులైన - శిల్పులైన వారు ద్విజులుగా లెక్కింపబడుట లేదు. అయితే మరి వారికి అగ్న్యాధానము యొక్క అర్హత ఏల ఈయబడినది? ఒకవేళ రథకారులు - శిల్పులు మూడు వర్ణములలో నున్నచో వారికి అగ్న్యాధానము సమ్మతమైనదే! మరి ప్రత్యేకించి రథకారులకు - శిల్పులకు వర్షఋతువులో అగ్న్యాధానము ఎందులకు చెప్పబడినది? వైదిక సిద్ధాంత ప్రకారము ఇది దోషము కాదు. కర్మల అధీనములో **"వర్ణవ్యవస్థ"** యంగీకరించబడును. ఇందుకొరకు ఇచ్చట **"శిల్పులకు"** అగ్న్యాధానము యొక్క అధికారము ఇవ్వబడినది. కావున ఇందు ఏ దోషము లేదు.

భారత సారమగు ఇతిహాస సముచ్చయ ౩౭ వ అధ్యాయములో నహుష యుధిష్ఠర సంవాదము నందు ఇట్లు వ్రాయబడినది.

**"శిల్ప మధ్యయనం నామవృత్తం బ్రాహ్మణ లక్షణమ్"** అనగా శిల్పకర్మను అధ్యయనము చేసి దానికి క్రియాత్మక రూపము ఇచ్చుట బ్రాహ్మణ లక్షణము. కావున శిల్పకర్మ బ్రాహ్మణ కర్మయే.

సిద్ధాన్త కౌముదిలో పాణిని సూత్రము (౬-౨-౬౭)యొక్క వ్యాఖ్య ఈ విధముగా నున్నది.

**"రథకారో నామ బ్రాహ్మణః"** అనగా రథకారులు- శిల్పులు ఉత్తమ శ్రేణిలో గణింపబడ్డారు. కావున రథకారులు - శిల్పులు బ్రాహ్మణులే. కాబట్టి శిల్పకర్మ బ్రాహ్మణకర్మ.

మీ మాంసా దర్శనము, భారతము, సిద్ధాన్త కౌముది ప్రమాణములతో శిల్పకర్మ బ్రాహ్మణకర్మ యని స్పష్టమైనది.

# భువన పుత్ర విశ్వకర్మ

విశ్వకర్మ అను పేరు గల మహర్షి అంగిర వంశములో జన్మించెను. మహర్షి అంగిర విషయములో ఎక్కువ చెప్పుట లేదు. ఈశ్వరుడు అతని ద్వారానే సృష్టిలో అథర్వ వేద జ్ఞానమును ప్రకాశింపజేసెను. అయితే వీరిని బ్రహ్మర్షి యందురు. బ్రహ్మ వేదజ్ఞానము ఇచ్చిన ఋషులలో ఒకరు. ఋషి దయానందుల వారు ఈ విషయముపై ఋగ్వేదాది భాష్యభూమికలో వేదోత్పత్తి విషయములో ఈ విధముగ వ్రాసిరి:-

**అగ్నివాయురవ్యాఙ్గిరో మనుష్య దేహ ధారీ జీవ ద్వారేణ**

**పరమేశ్వరేణ శ్రుతిర్వేదః ప్రకాశీకృత ఇతి బోధ్యమ్।**

పరమేశ్వరు డాది యందు అగ్ని, వాయు, ఆదిత్య, అంగిర అను మానవ దేహ ధారి జీవుల ద్వార వేదములను ప్రకాశింపజేసెను. ఇది నిశ్చయము.

**మానవ దేహ ధారి జీవులు**

| **ఋగ్వేదము,** | **యజుర్వేదము,** | **సామవేదము,** | **అథర్వవేదము.** |
|---|---|---|---|
| **అగ్ని,** | వాయు, | **ఆదిత్య** | **అంగిర** |

పరమేశ్వరుడు అథర్వ వేదమును అంగిర ఋషి ద్వార ప్రకాశింపజేసెను. ఈ అంగిర ఋషి వంశీయుడే శిల్ప ప్రవర్తకు డగు విశ్వకర్మ.

మహాభారతము అనుశాసన పర్వము అధ్యాయము ౮౩ లో ఇట్లు వ్రాయబడెను.

**అగ్నియస్త్వఙ్గిరాః శ్రీమాన్ కవిర్బ్రహ్మో మహాశయాః।**

అనగా పరమాత్ముని పుత్రుడు అంగిర అగ్నేయ పేరు గలిగిన గొప్ప విద్వాంసుడు. మరియు ఉన్నత ఆశయములు గల వ్యక్తి.

ఈ మహర్షి అంగిరకు ఏడుగురు పుత్రులు జన్మించిరి. వీరి పేర్లు వారుణి అంగిర, కేవలాంగిరసుడు, గౌతమాంగిరసుడు, బృహస్పతి, సంవర్త, సుధన్వ, అప్త్యలు నను వారు.

అంగిర యొక్క ఏడుగురి పుత్రుల పేర్లు నెటివ్ లయబ్రెరి కొల్హాపూర్ లో ఉన్న **"భారతవర్షీయ ప్రాచీన ఆర్వాచీన కోషము"**లో దొరుకును. దీని ఆధారముపై పూనానుండి

ప్రకాశింపబడిన మరాఠీ గ్రంథము **"విశ్వకర్మ కులోత్సాహము"**లో అంగిరస వంశ వృక్షము కూడ ఈ ప్రకారముగా ఇవ్వబడినది.

పైన చెప్పబడిన అంగిరసుని ఏడుగురి పుత్రులలో **"అప్త్య"** పేరు గల పుత్రుడు గొప్ప విద్వాంసుడు . మరియు తేజస్వి. ఇతనికి ఒక భువనుడను పేరు గల పుత్రుడుండెను. భువన ఋషి పేరుతో విఖ్యాతుడయ్యెను. ఈ భువన ఋషి పుత్రుడే శిల్ప ప్రవర్తకు డగు విశ్వకర్మ.

## బ్రహ్మఋషి అంగిర

**వారుణి అంగిర, కేవలాంగిరస, గౌతమాంగిరస, బృహస్పతి, సంవర్త, సుధన్య, అప్త్య.**

మహర్షి భువన

శిల్ప ప్రవర్తకు డగు విశ్వకర్మ

ఆశ్వలాయన (సర్వాను క్రమణిక) వ్యాఖ్యాత శ్రీ షడ్గురు భాష్యము. ఎనిమిదవ అష్టకములోని ఎనిమిదవ అధ్యాయములో ఇట్లు చెప్పబడి యున్నది.

**భువనో నామ అప్త్య పుత్ర ఇతి। ఏవం చ భువన పుత్రత్వేన**
**విశ్వకర్మణః అఙ్గిర వంశజత్వ ఋషి గోత్ర త్వం చ॥**

అనగా భువనుడు అను పేరు గల అప్త్య పుత్రుడు మరియు భువన పుత్రుడు అగుట వలన విశ్వకర్మ అంగిరస వంశీయుడు. మరియు ఋషి గోత్రీయుడు.

శ్రీషడ్గురు వ్యాఖ్యానములో దీనిని స్పష్టము చేసెను. విశ్వకర్మ తండ్రి పేరు భువనుడు. మరియు అతని గోత్ర ప్రవర్తకుడు. అంగిరసుని శ్రేష్ఠమైన వంశములో జన్మించెను. (విశ్వకర్మ దిగ్దర్శన్)

వీరిని భువనపుత్ర విశ్వకర్మ యని, శిల్ప ప్రవర్తకు డగు విశ్వకర్మయని, భౌవన విశ్వకర్మ యని యందురు. వీరు వేదాలలో కొన్ని మంత్రములకు ద్రష్ట. అనగా ఋషి మరియు భువన పుత్ర విశ్వకర్మయే సృష్టిలో ప్ర ప్రథమ రాజు. (ఇందుకు ప్రమాణము ఐతరేయ బ్రాహ్మణము) (విశ్వకర్మ దిగ్దర్శన్)

# పంచ శిల్ప విభాగము

శిల్ప ప్రవర్తకు డగు విశ్వకర్మకు ఐదుగురు మానస పుత్రులు గలరు. అనగా శిష్యులు. వారే సానగ, సనాతన, అహభువన, ప్రత్న, సుపర్ణలు.

విశ్వకర్మ శిల్పమును ఐదు విభాగములు చేసి ఒక్కొక్క విభాగమునకు ఒక్కొక్కరిని అధిష్ఠాతలుగా నియమించెను.

**ప్రథమ విభాగము లోహ శిల్పము:-**

విశ్వకర్మ ఒక **"లోహ-ఇనుప"** విభాగమును స్థాపించి **"సానగ"** నామము గల తన శిష్యునకు పూర్ణ శిక్షణ యిచ్చి అన్ని విషయములలో అధిక నైపుణ్యునిగా మరియు విశేషజ్ఞునిగా చేసి ఈ విభాగమునకు అధిష్ఠాతగా జేసెను. ప్రత్యేక విభాగమునకు ఉచ్ఛపదాధికారికి మేనేజర్, పిన్సిపాల్, ఇంజనియర్ మొదలగు పేర్లను పెట్టెదరు. ఈ విధముగ విశ్వకర్మ తన ఈ ప్రథమ శిల్ప విభాగము యొక్క అధిష్ఠాతకు **"మను"** అని పేరు పెట్టెను.

**ద్వితీయ విభాగము దారు శిల్పము:-**

ఎట్లు లోహ సంబంధమగు కార్యములను సాధించుటకు విశ్వకర్మ లోహ విభాగమును స్థాపించెనో అట్లే **"దారు - కఱ్ఱ వస్తు నిర్మాణ"** విభాగమును కూడ స్థాపించెను. ఈ విభాగమునకు అధిష్ఠాత పదవిపై **"సనాతన"** అను పేరు గల శిష్యుని నియమించి యితనికి **"మయ"** అని పేరు పెట్టెను.

**తృతీయ విభాగము తామ్ర శిల్పము:-**

**"రాగి, ఇత్తడి, కంచు"** మొదలగు ధాతువులతో సంబంధిత వస్తువుల రచన హితార్థము విశ్వకర్మ ఒక విభాగమును కూడ స్థాపించెను. ఈ విభాగము యొక్క అధిష్ఠాత పదవిపై **"అహభువన"** అను పేరు గల శిష్యుని నియమించి యితనికి **"త్వష్ట"** అని పేరు పెట్టెను.

**చతుర్థ విభాగము శిలా శిల్పము:-**

**"శిలా శిల్పము"★** ను విస్తృత పరచుటకు విశ్వకర్మ ఒక విభాగమును కూడ స్థాపించెను. ఈ విభాగమునకు అధిష్ఠాత పదవిపై "ప్రత్న" అను పేరు గల శిష్యుని నియమించి యితనికి **"శిల్పి"** అని పేరు పెట్టెను.

---

***★ శిల్పమనగా రాతితో విగ్రహములు చేయుట కాదు. కోటలు, నగర నిర్మాణం, రాజ సౌధములు, వాహనములు, గృహ నిర్మాణము మొదలగు వానిని చేయుట. మరియు సాంకేతిక విద్య కూడా శిల్పమే.***

పఞ్చమ విభాగము స్వర్ణ శిల్పము:-

సౌందర్యము మరియు విజ్ఞానయుక్త అలంకారముల నిర్మాణమునకు స్వర్ణమునకు సంబంధించిన శిల్పమును అభివృద్ధి పరచు టవసరమై యుండెను. అందుకని విశ్వకర్మ ఒక విభాగమును స్థాపించెను. ఈ విభాగమునకు అధిష్ఠాత పదవిపై "సుపర్ణ" అను పేరుగల శిష్యుని నియమించి యితనికి "విశ్వజ్ఞ" అని పేరు పెట్టెను. పైన చెప్పబడిన ఐదు విభాగముల అధిష్ఠాతలు మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞ మొదలగు వారు గొప్పశిల్పులు- ఆచార్యులు.

ఈ ఆచార్యు లైదుగురు విశ్వకర్మ పుత్రు లని మరియు విశ్వకర్మ ముఖము నుండి వీరి ఉత్పత్తి అయిన దని ప్రజలలో భ్రమ వ్యాపించినది.

విశ్వకర్మ ముఖము నుండి ఉత్పత్తి అయిన దనుట ప్రకృతి విరుద్ధము. తల్లి లేకుండ ఉత్పత్తి యగుట అసంభవము. ముఖము నుండి ఉత్పత్తి అయిన దనుటకు తాత్పర్యము గురు- శిష్య సంబంధము.

పైన చెప్పబడిన విభాగముల అధిష్ఠాతలై వారు తమ తమ విభాగముల పనుల సంచాలనము చేయుటకై విశ్వకర్మ క్రమశః పంచ శిల్ప విద్యల విషయ జ్ఞాన మొసగి యోగ్యులుగా చేసెను. అప్పుడే వారు తమ తమ పేర్లతో విఖ్యాతులైరి. ఈ విధముగా ప్రపంచములో మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞ మొదలగు వారు విశ్వకర్మ ముఖారవిందము నుండి ఉద్భవించిరి. ఇచ్చట మనము గమనించ దగిన విషయము- శిక్షణ నిచ్చిన గురువు మరియు శిక్షణను గ్రహించిన శిష్యుల పరస్పర సంబంధము గురు శిష్యులే యని అనబడుదురు. కాని తండ్రి కుమారు లని కూడ అనబడుచున్నారు. ఇందుకు ప్రమాణము:-

**అజ్ఞో భవతి వై బాలః పితా భవతి మన్త్రదః॥** (మనుస్మృతి ౨-౧౨౩)

జ్ఞాన రహితుడు బాలుడు, జ్ఞానము నిచ్చువాడు తండ్రియని మనుస్మృతి చెప్పుచున్నది.

విశ్వకర్మ ఈ ఐదుగురికి శిల్ప విద్య జ్ఞానమును యిచ్చిన వారు. అందుకని వారు వీరికి తండ్రి, జ్ఞానమును పొందిన వారు వీరికి కుమారు లని ప్రసిద్ధమైనది. వీరు జ్ఞానమును కూడ ముఖము ద్వారానే ఇచ్చిరి. వీరి పేరు కూడ వారి ముఖము ద్వారానే ప్రసిద్ధమైనది. ఈ కారణమున ముఖము నుండి. ఉత్పత్తి అనే దానికి తాత్పర్యము, గురు-శిష్యులే, వేరు కాదు. (విశ్వకర్మ దిగ్దర్శన్)

గమనిక: పంచశిల్ప విభాగములను మిక్కిలి తెలుసుకొన గోరువారు నాచే అనువదించబడిన "విశ్వకర్మ దిగ్దర్శన్" అను గ్రంథమును చూడగలరు.

## రాజ్య ప్రణాళిక స్థాపన

పురుషులను నిర్భయులు, ఉన్నత శీలుల చేయుటకును, ఏ విద్యనైన లోక లోకాంతరములలో విస్తరింప జేయుటకు అనుశాసన మవసరము.

విశ్వకర్మ ద్వార స్థాపించబడిన ఈ పంచ విభాగముల ద్వారా శిల్పము విస్తరింప ప్రారంభమయ్యెను. నగర నిర్మాణము మరియు ప్రయాణ సౌకర్యముల కొరకు అనేక విధ రథముల (వాహనముల) నిర్మాణము జరుగుచుండెను. నిర్విఘ్నముగ జల ప్రయాణము చేయుటకు సుదృఢము మరియు వేగముగా వెళ్ళే నౌకలు గూడ తయారవసాగెను. ఇందు వలన విద్వాంసులందరి సమక్షమున ఇప్పుడు రాజ్యశాసన ప్రణాళికను ఎందుకు స్థాపించ కూడదను ఒక ప్రశ్నొదు రయ్యెను. దీని వలన దేశ దేశాంతరములలో రాక పోకలకు అనేక సౌకర్యములు లభ్యమగును. ప్రయాణము చేయుటకు ఏ భయము కూడ యుండదు. మరియు అచ్చటచ్చట ప్రజలు నివసించు స్థానములలో యుండు దుష్టులను లేక అశిక్షత జనులను వశపరచుకొని వారిని సభ్యులుగ సుశిక్షులుగ జేయ వచ్చును.

పై ఆలోచన ననుసరించి విశ్వకర్మ కశ్యపు డను పేరుగల ఒక విద్వాంసుడు మరియు ధర్మాత్ముడగు పురుషుని రాజును జేయుటకు ఎన్నుకొనెను. కాని విద్వాంసులు మరియు ప్రజలు విశ్వకర్మతో ఇట్లు ప్రార్థించిరి. ఓ భగవాన్! వర్తమాన స్థితిలో కశ్యపుని రాజును చేయవలదు. రాజ్య వ్యవస్థ కొరకు సమస్త సాధనములు సమకూరు వరకును పృథివిని జయించే వరకు తాము స్వయమే రాజ్య శాసనమును సంభాలించండి. సరియైన మార్గంలో నడిపించండి. శక్తి యొక్క అండలేక ఇంత విశాలముగా విస్తరించిన ప్రజలను శీఘ్రాతిశీఘ్రముగా ఒకే త్రాటితో బంధించుట దుష్కరము. ఈ కార్యమును తమరు తమ విద్య వల్లనే సాధించగలరు. అందుకని తమరు దయచేసి స్వయముగా రాజ్యాసనారూఢులు కండు. విశ్వకర్మ ఇందుకు అంగీకరించ లేదు. నేను రాజ్య భోగములను అనుభవించుటకు రాలేదు యని విద్వాంసులందరికి సమాధానము చెప్పెను. నా విద్య ద్వారా ఇతరుల ఐశ్వర్య ఉపభోగములను పొందుటయే నా జీవనము

యొక్క ధ్యేయ మని బదులు చెప్పెను. కాని ఈ సమయమున కశ్యపుని రాజును చేయుట అన్యాయ మని మిమ్ములను మించి ఈ భూమిని ఎవరును పాలించజాలరు. మీరు మా ప్రార్థన స్వీకరించనిచో మే మందరము నీటిలో దూకుదుము అని శ్రద్ధాళువులగు ప్రజలు అనిరి. కశ్యపుడు కూడ దీనిని సమర్థించుచు విశ్వకర్మతో ఓ భగవాన్! యదార్థముగా ఈ సమయమున మీరే రాజు అగుటకు యోగ్యులు-అర్హులు. నేను ఈ సమయమున రాజ్యాసనారూఢు నగుటకు అనధికారి నగుదునని వినయ పూర్వకముగా ప్రార్థించెను. రాజునకు కావలసిన సమస్త సాధనములను స్వయముగా సమకూర్చే యోగ్యత నాలో లేదు. మీ ద్వారానే సాధనములు సమకూర్చబడి రాజ్య వ్యవస్థ స్థాపిత మగును. ప్రథమము మిమ్ములను రాజ్యాభిషేకముతో సన్మానించనిదే మా హృదయమునకు సంతోషము కలుగ జాలదు. ఈ వినయ పూర్వక ప్రార్థనను విశ్వకర్మ త్రోసిపుచ్చలేదు. ప్రజలందరి సమక్షమున "**విశ్వకర్మ ప్రజాపతి**"కి జై అను కరధ్వనుల మధ్య కశ్యపుడు స్వయముగనే మహా వైభవముతో విశ్వకర్మకు రాజ్యాభిషేకము చేసిరి.

విశ్వకర్మ కర్తవ్య పాలన కొరకు నియమాను సారముగా రాజ్యశాసనమునకు సంబంధించిన సమస్త సాధనములను సమకూర్చ ప్రారంభించెను. అచ్చటచ్చట దుర్గములు మొదలగు రక్షణ స్థానములను స్థాపించి వివిధ అస్త్ర శస్త్రములు, శతఘ్నులు (తోపులు), భుశుండులు (తుపాకులు), ఖడ్గములు మరియు గండ్రగోడ్డళ్ళు మొదలగు వానిని తయారు చేసెను★ రాకపోకల కొరకు పృథివిపై నడచు సుదృఢ రథములు మరియు జలములో నడచు భిన్న భిన్న విధముల నౌకలను తయారు చేసి రాజ్య శాసనమునకు యోగ్యమైన సమస్త సాధనములను ఏర్పాటు చేసెను.

తరువాత అల్పకాలములోనే విస్తార యుక్తముగ పృథివిని జయించు ప్రణాళికలను ఏర్పరచు కొనెను. యోగ్యులకు అస్త్ర శస్త్ర సంచాలన క్రియలను నేర్పించి వేగముగా పయనించు వాహనముల ద్వారా దేశ దేశాంతరములకు పంపించెను. ఈ విధముగా అచిరకాలమునందే పృథివి నంతటిని తన ఆధీనములోనికి తీసుకొనెను.

పృథివి యంత ఆధీనములోకి వచ్చిన తరువాత దిగ్విజయ స్వరూప అశ్వమేధ యజ్ఞము చేసిన పిదప ప్రజలు బలవంత పరచినను తన శాసనాధికార ఉత్తరదాయిత్వమును త్యజించి ప్రజలందరి సమక్షమున కశ్యపుని రాజుగా చేసెను.

---

★ **తోపులు మరియు తుపాకులు చేయు విధానము విస్తారపూర్వకముగా శుక్రనీతి, అధ్యాయము ౪ లో వ్రాయబడి యున్నది.**

పైన చెప్పబడిన అఖ్యాయికా శ్రీ సాయణాచార్య కృత భాష్యము ఐతరేయ బ్రాహ్మణము మరియు పఞ్చకాధ్యాయము ౩౯- ఖండము ౮-పుట ౯౪౮ లో వ్రాయబడియున్నది. ప్రమాణము కొరకు మరియు పాఠకుల అవలోకనార్థము ఈ క్రింద ఇవ్వబడుచున్నది.

**భువనాఖ్యస్య పుత్రం విశ్వకర్మానామకం రాజానముదాహరతి।**

భువన పుత్రుడైన విశ్వకర్మ రాజు అయిన చరిత్ర ఐతరేయ బ్రాహ్మణము చెప్పుచున్నది. (సాయణ భాష్యము)

**ఏతేన హవా ఐన్ద్రేణ మహాభిషేకేన కశ్యపో విశ్వకర్మాణం భౌవనమభిషిషే చ। తస్మాదు విశ్వకర్మా భౌవనః సమన్తం సర్వతః పృథివీం జయన్పరీయాయాశ్వేన చ మేధ్యేనేజే★ ఇతి॥**

కశ్యప మహర్షి భువనపుత్రుడైన విశ్వకర్మకు రాజ్యాభిషేకం చేసెను. రాజ్య ప[illegible]గూఢుడైన విశ్వకర్మ సంపూర్ణ భూమండలమును జయించి అశ్వమేధ యజ్ఞమును చేసి సమస్త భూమండలమును స్వాధీనము చేసికొనెను.

విశ్వకర్మ కశ్యపుని రాజును చేసినందున ప్రజలు ఆగ్రహము జెందిన విషయమును సాయణాచార్యుడు ఈ విధముగా వ్రాసెను:-

**భూమిర్దేవతా జగౌ భౌవనప్రృతికిఞ్చిద్వాక్యం గాథారూపముక్తవతీసేవ-మ్పూర్వేమహర్షయ పాహరన్తి తాం గాథాన్దర్శయతిః న మామర్త్యః కశ్చన దాతుమర్హతి విశ్వకర్మన్భౌవనం మాం దిదాసిథ। నిమఙ్క్ష్యేఽహం సలిలస్య మధ్యే మోఘస్త ఏష కశ్యపాయాఽఽససఙ్గర ఇతి ఇతి॥**

**భూమిరిత్యస్యార్థః-**

మా శాసనమును మీరు ఇతరుల కివ్వాలనుకున్నారు. ఇది ఉచితము కా[illegible]. అ[illegible] భూమిపై నున్న విద్వాంసులంద రనిరి. ఒక వేళ మీరు కశ్యపుని రా[illegible] చేసినట్లైతే మే[illegible] నీటిలో దూకుదుము.

ఆ తరువాత విశ్వకర్మ సమస్త భూమండలమును స్వాధీనము చేసుకొని రాజ్యవ్యవస్థను స్థాపించి రాజ శాసనమును గ్రహించు మని కశ్యపుని ఆదేశించెను. అప్పుడు కూడ కొంతమంది విద్వాంసులు నిరోధించిరి . సాయణాచార్యుడు ముందు వ్రాయుచున్నాడు.

★ **ఈ ప్రసంగము ఐతరేయ బ్రాహ్మణము పఞ్చకము ౮ - ఖణ్డము ౨౧ ఐదవ అధ్యాయములో లభించును.**

భువనాఖ్యస్య పుత్ర హే విశ్వకర్మన్ కశ్చిదపి మనుష్యో మాం భూమిన్దాతున్నార్హతి।

అతః ఏవ మీమాంసకా విచార్య సర్వస్వదానే మహభూమిదానన్నివారిత వన్తః॥

ఓ భువన పుత్ర విశ్వకర్మా! ప్రపంచములో ఏ వ్యక్తి కూడ భూమిని అన్యునికి ఇవ్వజాలడు. అనగా భూమి రాజ్యము మొదలగునవి కుటుంబీకుల కొరకే వదలి వేయవలయును.

పైన చెప్పబడిన విధముగ భువన పుత్ర విశ్వకర్మకు సంబంధించిన వ్యాఖ్యచేయుచు శ్రీ సాయణాచార్యుడు**"భూమిరహ"** వాక్యము పైన ఇలా వ్రాసెను:-

**"భౌవనాభిషేక మహాత్మ్యం ప్రశంసితుం పురాతన మహర్షి ప్రోక్తముదాహరణన్దర్శయతి"**

అనగా భువన పుత్ర విశ్వకర్మ ఋషి మహాత్మ్యమును ప్రశంస చేయుటకు పురాతన మహర్షులతో చెప్పిన ఉదాహరణము ఐతరేయ బ్రాహ్మణములో కనిపిస్తుంది.

ఇచ్చట ఇది చాల దుఃఖముతో వ్రాయవలసి వస్తుంది. సాయణాచార్యులు లాంటి ప్రాచీన భాష్యకారులు కూడా ఈ ఐతరేయ బ్రాహ్మణ ఉదాహరణ ఏ ప్రాచీన ఇతిహాసము నుండి ఎత్తి వ్రాయబడినదో తెలుపలేదు. అస్తు!

ఈ ఆఖ్యాయికతో భువన పుత్ర మహర్షి విశ్వకర్మ కేవలము శిల్ప శక్తి సంపన్నుడే కాదు. కాని రాజ్యపాలన విచక్షణత, ప్రజావత్సలత, త్యాగము, తపస్విత, ఇతిహాస విఖ్యాత మొదలగు అనేక భావములు అతనిలో గోచరమగును. ప్రజలు విశ్వకర్మ యొక్క రాజ్యపాలన విచక్షణ చూచియే వారితో శాసనాధికారిగా నుండుటకు ప్రార్థించిరి. కాని భూమి యొక్క పాలన మరియు ఉపయోగము క్షత్రియులే చేయవలెనను విధానము కలదు. బ్రాహ్మణునిది కాదు. బ్రాహ్మణుని కర్తవ్యమైతే సర్వగుణ సంపన్నుడగు కారణమున రాజ్య విపత్తి కాలమున రాజ్యమును సుసంగఠిత పరచుటకై రక్షార్థము తన భూమి యొక్క సర్వాధికారమును క్షత్రియునకు కొసగవలెను. ఏలయన అది అతని వృత్తి కాదు. ఇందుకే విశ్వకర్మ బ్రాహ్మణత్వ కర్మానుసారము రాజ్య వ్యవస్థను సుసంగఠిత పరచు వరకు రాజ్య సత్తాను తన చేతిలో ఉంచుకొనెను. ఆ పైన పూర్తిగా సుసంగఠితమైన తరువాత కశ్యపునకు రాజ్యాధికారము నిచ్చి అతనిని రాజని వెల్లడించెను. ఈ విధముగా భువన పుత్ర విశ్వకర్మయే సృష్టిలో ప్రథమము రాజ్య ప్రణాళికను స్థాపించి విధి విధానముగా రాజును చేసి అశ్వమేధ యజ్ఞము యొక్క పరిపాటిని నడుపు శ్రేయము భువన పుత్ర విశ్వకర్మకే లభించినది. (విశ్వకర్మ దిగ్దర్శన్)

# విశ్వకర్మ పరమేశ్వరుడు శరీర ధారి కాడు, నిరాకారుడు

సృష్టికర్తయైన విశకర్మ పరమేశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు, సర్వశక్తిమంతుడు, న్యాయకారి, దయాళుడు, సర్వాధారుడు, సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి, సర్వేశ్వరుడు, శరీరధారికాడు, నిరాకారుడు. ఇందుకు ప్రమాణము:-

**"అకాయమ్"** (యజు॥ ౪౦-౮) స్థూల, సూక్ష్మ, కారణ శరీరములు లేనివాడు. అనగా కాళ్ళు, చేతులు, తల, ముక్కు, మున్నగు వానితో కూడి కనబడునది స్థూల శరీరము; పంచ ప్రాణములు, పంచ జ్ఞానేంద్రియములు, పంచ సూక్ష్మ భూతములు, మనస్సు, బుద్ధి యను నీ పదు నేడు తత్త్వములతో గూడినది సూక్ష్మ శరీరము; జీవుడు సుషుప్తిని - గాఢ నిద్రను బొందును. ఇదే కారణ శరీరము - ఈ శరీరములు లేనివాడు. కావున విశ్వకర్మ పరమేశ్వరుడు శరీరధారి కాడు.

**"న తస్య ప్రతిమా ౭ అస్తి"** (యజు॥ ౩౨ - ౩) తస్య = ఆ పరమాత్మునికి, ప్రతిమా = ప్రతిమ - పరిమాణము, అతనికి సరితూగు సాధనము లేక తుల్యావధి సాధన ప్రతికృతి (మారు రూపము), మూర్తి లేక ఆకృతి (రూపము), న అస్తి = లేదు. కావున విశ్వకర్మ పరమేశ్వరుడు నిరాకారుడు.

**"న తస్య ప్రతిమా ౭ అస్తి"** అను మంత్ర భాగానికి పండితులు కొందరు "నతస్య = భక్తులచే నమస్కరింపబడు భగవంతునికి, ప్రతిమా = ప్రతికృతి - బొమ్మ-విగ్రహము, అస్తి = కలదు" అని యర్థం చెప్పి విగ్రహారాధన వేద సమ్మత మని చెప్పుటకు పూనుకుంటారు. అయితే **"నతస్య"** అను మాటను రెండు పదాలుగా (న, తస్య) విడదీసి అర్థం చెప్పితే "తస్య = ఆ భగవంతునికి, ప్రతిమా = బొమ్మ, న+అస్తి = లేదు" అనగా విగ్రహారాధన వేద సమ్మతం కాదు అని తేలుతుంది. చూడండి, పరస్పరం ఎంత విరుద్ధంగా ఈ అర్థాలు ఉన్నవో! ఈ రెండర్థాలలో ఏది సరియైనది? ఏది కాదు?

ఈ సందర్భంలో విగ్రహారాధ కులయిన ఆ పండితులు తమ వాదనకి బలంగా **'న తస్య'** వేర్వేరు పదాలు కావని ఒకే పదమని, ఎందుకంటే వేదంలో సంహితా పాఠమునకు పద పాఠము కంటే నధిక ప్రామాణ్యం కలదని కారణం చెప్పుతుంటారు. ఉదాహరణలు కూడా చూపిస్తారు. కావున వీరి వాదనను బట్టి నిరాకారుడైన భగవంతునికి ప్రతిమ కల్పించి పూజింపవచ్చునని తేలుతుంది.

ఇది వైదికులకు సమ్మతం కాదు. ఏలయన:- స్వరశాస్త్రం సంగతి తెలిసిగాని, తెలియకగాని పౌరాణిక పండితులు ఎత్తుకోరు. ఎత్తుకుంటే తమ వాదం నిలబడదు. ఎట్లనగా:- **"నతస్య"** పదంలో నకారం మీద "అ"కారం ఉదాత్తము. "త" కారం మీది "అ"కారం కూడ ఉదాత్తమే. స్వరశాస్త్రాన్ని బట్టి చూచినచో ఒకే పదంలో రెండు ఉదాత్త స్వరాలు ఉండకూడదు. కనుక **"నతస్య"** ఒకే పదం కాదని, "న" పదం వేరు, **"తస్య"** పదం వేరు; అని స్వర శాస్త్రాన్ని బట్టి నిర్ణయమౌతుంది.

కాబట్టి భగవంతునికి ప్రతిమ లేదను నర్థమే సరియైనదిగా స్వరశాస్త్రాన్ని బట్టి వైదికులు నిర్ణయిస్తారు. అందువల్ల వేదాంగములయిన శిక్షా వ్యాకరణాదుల సహాయంతో వేదమంత్రాల నర్థం చేసుకోడానికి ప్రయత్నించాలి. (దయానంద హృదయము, పుట ౬౫)

పై ప్రమాణములను బట్టి విశ్వకర్మ పరమేశ్వరుడు శరీరధారి కాడు, నిరాకారుడు యని స్పష్టమైనది.

**గమనిక:-** శరీరధారి కాని, నిరాకారుడైన విశ్వకర్మ పరమేశ్వరునకు ఆకారమును కల్పించి ఉపాసించువారు అంధకారమును పొందుదురు. **ఇందుకు ప్రమాణము:-**

**"అన్ధన్తమః ప్ర విశన్తి యేఽసమ్భూతిముపాసతే"** (యజు ॥౪౦ - ౯) ఎవరు పరమేశ్వరుని త్యజించి ప్రకృతి రూప జడ వస్తువును ఉపాసించుచున్నారో వారు ఆవరణ మొనర్చు అంధకారమును నిస్సందేహముగా పొందుచున్నారు.

## విశ్వకర్మలా? విశ్వకర్మ బ్రాహ్మణులా? విశ్వబ్రాహ్మణులా?

విశ్వకర్మబ్రాహ్మణ శబ్దములో **"కర్మ"** శబ్దము లోపించి **"విశ్వబ్రాహ్మణ"** శబ్దముగ మారినది. విశ్వకర్మబ్రాహ్మణ పదము మూడు శబ్దములతో తయారయినది. విశ్వ+కర్మ+ బ్రాహ్మణ, దీని సిద్ధి ఈ విధముగా యున్నది. **"విశ ప్రవేశనే"** అను ధాతువునకు **"క్వన్"** ప్రత్యయమును జోడించగా **"విశ్వ"** అను శబ్దము, **"డుకృఞ్ కరణే"** అను ధాతువునకు **"మనిన్"** ప్రత్యయమును జోడించగా "కర్మ" అను శబ్దము, బృంహేర్నోఽచ్చ (ఉ॥ ౪-౧౪౬) బృహి వృద్ధౌ + మనిన్, నకారము యొక్క అకారము మరియు రత్వమై "బ్రహ్మన్" శబ్దము (బ్రహ్మ మరియు బ్రహ్మ) ఏర్పడుచున్నది. మరల **"తస్యేదమ్"** (పా॥ ౪-౩ - ౧౨౦) బ్రహ్మన్+ అణ్- ఈ ప్రకారముగా బ్రాహ్మణ (న॥లిఙ్గ) శబ్దము తయారయినది.

దీని అర్థము బ్రహ్మ- పరమేశ్వరుడు మరియు వేదజ్ఞానము. ధాతువుల అర్థమును బట్టి వేద జ్ఞానమును కర్మల ద్వారా ప్రవేశింపజేయువాడు - విశ్వకర్మ బ్రాహ్మణుడు.

"బ్రాహ్మణః **ఇమాని** బ్రాహ్మణాని" బ్రహ్మమునకు (వేదమునకు, తత్త్వమునకు, తపమునకు) సంబంధించినవి బ్రాహ్మణములగును. "బ్రాహ్మణాని" అను శబ్దము తద్ధితవృత్తి చేత సాధువైనది. "**విశ్వాని బ్రాహ్మణాని యస్య సః విశ్వబ్రాహ్మణః**" అని బహువ్రీహి సమాసము చేత ఈ శబ్దమును సాధింపవచ్చును.

"**విశ్వకర్మణః** బ్రాహ్మణః **విశ్వబ్రాహ్మణః**" అని విగ్రహము. ఇది "**శాక పార్థివ**" శబ్దము వలె మధ్యమ శబ్ద మగు "**కర్మ**" శబ్దము లోపింపగా మిగిలిన రూపము. సంస్కృత భాష యందు కొన్ని శబ్దములు సమసించునప్పుడు మధ్యమ శబ్దము లోపించుట కద్దు. పండితులకు తెలియును.

విశ్వమునకు జ్ఞాన విజ్ఞానముల నందించు బ్రహ్మ, వేదవేత్తలు విశ్వబ్రాహ్మణులు ఈశ్వరు నెరిగి, వేదములను చదువుటతో పాటు విశ్వమున కుపకరించు, విశ్వ కళ్యాణమునకు తోడ్పడు వివిధ శిల్పకర్మ నొనర్చు వారు విశ్వబ్రాహ్మణులు. కావున "**విశ్వబ్రాహ్మణు**" లని చెప్పుకొన వలయును

## ఆచార్య - ఆచార్యులు - ఆచారి

విశ్వబ్రాహ్మణ సోదరులారా! ఈ రోజులలో విశారద, భూషణ, విద్వాన్ అను పట్టాలు ఎట్లు ఇస్తున్నారో ఆ రోజులలో (పూర్వ కాలములో) "**ప్రాక్ శాస్త్రి, శాస్త్రి, ఆచార్య**" అను పట్టాలిస్తుండేవారు. ఇప్పుడు కూడ ఉత్తర భారతదేశములో ఇస్తున్నారు. కావున "**ఆచార్య**" అనునది పట్టా-హోదా-పదవి. ఈ పట్టా విశ్వబ్రాహ్మణులకు ఎలా వచ్చిందంటే "**శిల్పి**" అన్ని వృత్తుల వారికి గురువు. ఎలాగంటే లేఖకులకు గంటమును - లేఖినిని, సాలీలకు మగ్గమును, కుమ్మరులకు సారెను, రైతులకు వ్యవసాయ పరికరములను, గాయకులకు వాద్యములను మరియు ఇతర అన్ని వృత్తుల వారికి ఆయా పరికరములను తయారుచేసి వానిని ఉపయోగించు పద్ధతిని గూడ బోధించాలి. కావున గురువు. అందువలన '**ఆచార్య**' శబ్దమును పేరు చివర చేర్చుకొను అధికారము వచ్చినది. కాని "**ఆచార్య**" అను పదవిని నిరుపయోగము చేసికొనుచున్నారు. **ఎట్లనగా:-** పేరు పొడి అక్షరములలో వ్రాస్తూ చివరన "**ఆచార్య**" (ఆచార్యులు, ఆచారి) అని వ్రాయుటకు బదులు "**చార్య**" (చార్యులు, చారి)

అని వ్రాస్తున్నారు. ఉదా॥ వెంకటరామాచార్య= వెం॥రా॥ఆచార్య (వి. ఆర్. ఆచార్య) అని వ్రాయుటకు బదులు వెం॥రా॥చార్య (వి.ఆర్.చార్య) అని వ్రాస్తున్నారు. ఇట్లు వ్రాయుట వలన వీరికి పదచ్ఛేదన రాదని తెలుస్తుంది. పదచ్ఛేదన:- వెంకటరామాచార్య=వెంకటరామ+ఆచార్య. దీనికి బదులు వెంకటరామా+చార్య అని వ్రాయుట తప్పు. పొడి అక్షరాలలో వెం॥రా॥ఆచార్య (వి.ఆర్.ఆచార్య) దీనికి బదులు వెం॥రా॥చార్య (వి. ఆర్.చార్య) అని వ్రాయుట తప్పు. అందుకని తప్పు అర్థము వస్తుంది. "**ఆచార్యః**" శబ్ద సిద్ధి ఈ విధముగా నున్నది. "**చర గతౌ భక్షణే చ, ఆఙ్**" పూర్వకమగు నీ ధాతువునకు "**ణ్యత్**" ప్రత్యయమును జోడించగా "**ఆచార్యః**" అను శబ్దమేర్పడుచున్నది. దీని అర్థము **యః ఆచారం గ్రాహయతి సర్వా విద్యా వా బోధయతి స ఆచార్యః** = సత్యాచారమును గ్రహింపజేయువాడు సమస్త విద్యలను ప్రాప్తింపజేయువాడు ఆచార్యుడు అనగా గురువు. "**చార్యః**" శబ్ద సిద్ధి ఈ విధముగా నున్నది. "**చర గతౌ భక్షణే చ**" అను ధాతువునకు "**ణ్యత్**" ప్రత్యయమును జోడించగా "**చార్యః**" అను శబ్ద మేర్పడుచున్నది. దీని అర్థము తినుట, తిరుగుట. అనగా తినటము, తిరగటము. ఎంతో ఉన్నతమైన అర్థానిచ్చే "**ఆచార్య**" (ఆచార్యులు, ఆచారి) శబ్దాన్ని వదలి అనర్థాన్నిచ్చే "**చార్య**" (చార్యులు, చారి) శబ్దాన్ని వ్రాసికొనుటలో ఔచిత్యమేమిటి? తెలిసో తెలియకో 'ఆ' అనే అక్షరమును తొలగించి వ్రాయుట వలన ఎంత అనర్థకము కలుగుతుందో ఆలోచించండి. కావున "**చార్య**" (చార్యులు, చారి) శబ్దమును వ్రాయుట మాని "**ఆచార్య**" ( ఆచార్యులు, ఆచారి) అను శబ్దమును వ్రాసికొని సార్థక నామధేయులు కండి.

**ద్వితీయాధ్యాయము సమాప్తము**

---

## అర్థవేదము



"అథర్వ వేదము యొక్క ఉపదేశము అర్థవేదము. దీనిని శిల్ప శాస్త్రమందురు. ఇది విశ్వకర్మ కృతము. దీని ద్వారా విజ్ఞానము, కళా కౌశలము మరియు పృథివి నుండి ఆకాశ పర్యంతము విద్యను నేర్చుకొని వివిధ ప్రకారములగు విజ్ఞాన యుక్త పదార్థములను నిర్మించవలెను."

**- మహర్షి దయానంద సరస్వతి**

# ఓంకార స్వరూప విశ్వకర్మ పరమేశ్వరుడు

| | | | |
|---|---|---|---|
| ఋగ్వేదము, | యజుర్వేదము, | సామవేదము, | అథర్వవేదము. |
| అగ్ని, | వాయు, | ఆదిత్య, | అంగిర. |

వారుణి అంగిర, కేవలాంగిరస, గౌతమాంగిరస, బృహస్పతి, సంవర్త, సుధన్వ, ఆప్త్య.

మహర్షిభువన

శిల్ప ప్రవర్తకు డగు విశ్వకర్మ

| | | | | |
|---|---|---|---|---|
| సానగ, | సనాతన, | అహభువన, | ప్రత్న, | సుపర్ణ. |
| = | = | = | = | = |
| మను, | మయ, | త్వష్ట, | శిల్పి, | విశ్వజ్ఞ. |
| = | = | = | = | = |
| అయ శిల్పాధికారి, | దారు శిల్పాధికారి, | తామ్ర శిల్పాధికారి, | శిలా శిల్పాధికారి, | స్వర్ణ శిల్పాధికారి, |

శిల్ప ప్రవర్తకు డగు విశ్వకర్మను, భువన పుత్ర విశ్వకర్మ యని, భౌవన విశ్వకర్మ యని అందురు. వీరు వేదములలో కొన్ని మంత్రములకు ద్రష్ట. అనగా ఋషి. మరియు భువన పుత్ర విశ్వకర్మయే సృష్టిలో ప్రప్రథమ రాజు అని ఐతరేయ బ్రాహ్మణము చెప్పుచున్నది.

**గమనిక:-** ౧. ఓంకార విశ్వకర్మ పరమేశ్వరుడు శరీరధారికాడు, నిరాకారుడు. ఇందుకు ప్రమాణము:- యజు॥ ౪౦- ౮, మరియు ౩౨-౩.ఇదే పుస్తకము నందు 59వ పుటలో చూడండి.

౨. శిల్ప ప్రవర్తకు డగు విశ్వకర్మకు సానగ, సనాతన, అహభువన, ప్రత్న, సుపర్ణ అనువారు మానస పుత్రులు. అనగా శిష్యులు. ఇందుకు ప్రమాణము:- ఇదే పుస్తకము నందు 35వ పుటలో చూడండి.

# తృతీయాధ్యాయము

## యజ్ఞోపవీత ధారణ విధి

బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థాశ్రమములందుండి, ఆ యాశ్రమ ధర్మముల పాలించుచున్నంత వరకు మానవులు యజ్ఞోపవీతముల ధరించి యుండ వలయు ననునది వైదికుల మతము. కాబట్టి తాను ధరించిన యజ్ఞోపవీతము జీర్ణమై పోయినపుడు వెంటనే మరియొక క్రొత్త జందెమును ధరింప వలయును. అట్లు జందెము ధరించుటకు ముందు ఆచమన మంత్రములతో ముమ్మారాచమనము చేసి మరియు అఙ్గ స్పర్శ మంత్రములతో అంగములను స్పర్శింపవలెను. పిదప జందెమును ధరింప వలయును.

## ఆచమన మంత్రములు

ఉద్ధరిణెడు జలమును తన కుడి చేతిలో పోసికొని ఈ క్రింద వ్రాయబడిన మూడు మంత్రములను ఒక్కొక్క దానిని క్రమముగ నుచ్చరించుచు ముమ్మారు ఆచమింప వలయును.

౧ **ఓమ్ అమృతోపస్తరణమసి స్వాహా ॥ (౧వ ఆచమనము)**

౨ **ఓమ్ అమృతాపిధానమసి స్వాహా ॥ (౨వ ఆచమనము)**

3 **ఓం సత్యం యశః శ్రీర్మయి శ్రీః శ్రయతాం స్వాహా॥ (3వ ఆచమనము)**

**(అశ్వలా॥ గృ॥ ౧-౨౪- ౧౨- ౨౧-౨౨)**

## అఙ్గస్పర్శ మంత్రములు

ఆచమనానంతరము ఎడమ చేతియందు జలముంచుకొని కుడిచేతి అనామికతో, మధ్యమాంగుళిని జోడించి ఆరెంటి కొనలను ఎడమచేతి యందు గల జలములో ముంచి "ఈ క్రింది మంత్రముల" పఠించుచు వరుసగ ముఖ, నాసిక, నయన, కర్ణ, బాహూర్వాది అంగముల స్పృశింప వలయును (అనామికతో అనగా ఉంగరపు వ్రేలితో).

౧ **ఓం వాఙ్మఽ ఆస్యేఽస్తు ॥ (నోటిని రెండు వైపుల తాకవలెను)**

౨ **ఓం నసోర్మే ప్రాణోఽస్తు ॥ (నాసిక రంధ్రములను తాకవలెను)**

3 **ఓమ్ అక్ష్ణోర్మే చక్షురస్తు॥ (రెండు నేత్రములను తాకవలెను)**

౪ ఓం కర్ణయోర్మే శ్రోత్రమస్తు॥ (రెండు చెవులను తాకవలెను)
౫ ఓం బాహ్వోర్మే బలమస్తు ॥ (రెండు భుజములను తాకవలెను)
౬ ఓమ్ ఊర్వోర్మఽఓజోఽస్తు॥ (రెండు తొడలను తాకవలెను)
౭ ఓమ్ అరిష్టాని మేఽఙ్గాని తనూస్తన్వా మే సహ సన్తు॥

(శరీర మంతట జలమును చల్లుకొన వలయును)(పార॥గృ॥ ౧-౩-౨౫)

## యజ్ఞోపవీత మంత్రము

పిదప క్రొత్త జందెమును సరిచేసి రెండు చేతులతో పట్టుకొని ఈ క్రింది "యజ్ఞోపవీత మంత్రమును" పఠించి తలమీదుగ మొదట హారములాగ వేసుకొని అనంతరము ఎడమ భుజము నుండి కుడిచేతి క్రిందికి తీసుకొనవలయును.

**ఓం యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్ ।**

**ఆయుష్యమగ్ర్యం ప్రతిముఞ్చ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః॥**

(పార॥ గృ॥ ౨- ౨-౧౧)

అని పఠించి క్రొత్త జందెమును ధరింప వలయును. అటుపై "గాయత్రీ మంత్రమును' ' జపించి తరువాత ఈ క్రింది "శ్లోకమును" పఠించి పాత జందెమును తలపైగా తీసి "నదిలోగాని, చెట్టుపైన గాని" వేయ వలయును.

**శ్లో॥ ఏతావద్దిన పర్యన్తం బ్రహ్మత్వం ధారితం మయా ।**

**జీర్ణత్వాత్ త్వత్పరిత్యాగో గచ్ఛ సూత్ర యథా సుఖమ్ ॥ (యజ్ఞో॥ రహ ॥ పుట ౪౪)**

తరువాత పైన చెప్పినట్లు మరల ఆచమన మంత్రములతో ముమ్మారాచమించి, అంగస్పర్శ మంత్రములతో అంగస్పర్శ నొనరింపవలయును.

## యజ్ఞోపవీత మంత్రార్థము

ప్రజాపతికి ముందుగా ఏ యజ్ఞోపవీతము సహజమో, శ్రేష్ఠమైన జ్ఞాన సూచకమో, స్వచ్ఛమో, ఆయుష్కరమో, ముఖ్యమో, పాపములను పోగొట్టునదియో, పరిశుభ్రమై నట్టిదియో అట్టి యజ్ఞోపవీతము తేజము, బలము ఇచ్చుగాక!

**గమనిక:** పాపములను పోగొట్టునదియు, ననగా మనలోని పాప గుణములను పోగొట్టును. కాని లోగడ చేసిన పాప ఫలమును అనుభవించవలసినదే.

**శ్లోకార్థము:** ఇంతవరకు నేను నిన్ను ధరించాను. జీర్ణమైనందువలన నిన్ను తీసి వేయుచున్నాను. ఓ యజ్ఞోపవీతమా! వెళ్ళుము. సుఖముగ నుండుము.

# ప్రాతః స్మరణ మంత్రములు

తెల్లవారు ఝామున ౪ గంటలకు లేచి శయ్యమీద కూర్చుండి భగవంతు నీ క్రింది మంత్రములతో స్మరింప వలయును.

౧. ఓం ప్రాతరగ్నిం ప్రాతరిన్ద్రం హవామహే ప్రాతర్మిత్రావరుణా ప్రాతరశ్వినా ।
ప్రాతర్భగం పూషణం బ్రహ్మణస్పతిం ప్రాతః సోమముత రుద్రం హువేమ ॥

౨. ప్రాతర్జితం భగముగ్రం హువేమ వయం పుత్రమదితేర్యో విధర్తా ।
ఆధ్రశ్చిద్యం మన్యమానస్తురశ్చిద్రాజా చిద్యం భగం భక్షీత్యాహ ॥

౩. భగ ప్రణేతర్భగ సత్యరాధో భగేమాం ధియముదవా దదన్నః ।
భగ ప్ర ణో జనయ గోభిరశ్వైర్భగ నృభిర్నృవన్తః స్యామ ॥

౪. ఉతేదానీం భగవన్తః స్యామోత ప్రపిత్వ ఉత మధ్యే అహ్నామ్ ।
ఉతోదితా మఘవన్త్సూర్యస్య వయం దేవానాం సుమతౌ స్యామ ॥

౫. భగ ఏవ భగవాన్ అస్తు దేవాస్తేన వయం భగవన్తః స్యామ ।
తం త్వా భగ సర్వ ఇజ్జోహవీతి స నో భగ పురఏతా భవేహ ॥

(ఋగ్వే॥ ౭-౪౧-౧ నుండి ౫ వరకు)

## స్నాన మంత్రములు

పరమేశ్వరుని నీ క్రింది మంత్రములతో స్మరించుచు స్నానము చేయ వలెను.

ఓమ్ ఆపో హి ష్ఠా మయోభువస్తా న ఊర్జే దధాతన । మహే రణాయ చక్షసే ॥

౨ యో వః శివతమో రసస్తస్య భాజయతేహ నః । ఉశతీరివ మాతరః ॥

3 తస్మా అరఙ్గమామ వో యస్య క్షయాయ జిన్వథ । ఆపో జనయథా చ నః ॥

(ఋగ్వే॥ ౧౦- ౯- ౧నుండి 3 వరకు)

# పంచ మహా యజ్ఞములు

**అధ్యాపనం బ్రహ్మయజ్ఞః పితృయజ్ఞస్తు తర్పణమ్ ।**
**హోమో దైవో బలిర్భౌతో నృయజ్ఞోऽతిథిపూజనమ్॥ (మను॥ ౩-౭౦)**

౧. **బహ్మయజ్ఞము:** వేదాది శాస్త్రములను చదువుట, చదివించుట, సంధ్యోపాసనము-సంధ్యావందనము మొదలగు వానిని చేయుట.

౨. **దేవయజ్ఞము** : ప్రాతః కాలము, సాయంకాలము హోమము అనగా నిత్యాగ్ని హోత్రము చేయుట.

౩. **పితృయజ్ఞము:** తల్లిదండ్రులు మొదలగు వారిని అన్నాదుల ద్వారా తృప్తి పరచుట.

౪. **భూతయజ్ఞము** : కుక్కలకు, పేద వారికి, కుష్టు మొదలగు పాప రోగులకు, కాకి మొదలగు పక్షులకు, చీమలు మొదలగు కీటకములకు అన్న భాగము ఇచ్చుట.

౫. **అతిథి యజ్ఞము** : అతిథులకు భోజనము మరియు సేవ ద్వారా సత్కారము చేయుట, ఇవి పంచ మహా యజ్ఞములు.

**స్వాధ్యాయేనార్చయేదర్షీన్హోమైర్దేవాన్యథావిధి ।**
**పితౄన్ర్ఛాద్ధైశ్చ నౄనన్నైర్భూతాని బలికర్మణా॥ (మను॥ ౩- ౮౧)**

గృహస్థుడు ప్రతిదినము వేదాది శాస్త్రముల స్వాధ్యాయము ద్వారా ఋషులను పూజింప = సత్కరింప వలయును. యథావిధి అగ్నిహోత్రముతో దేవతలను = వాయు, జలము, ఓషధులు, మొదలగు దివ్య గుణములు కలిగిన భౌతిక దేవతలను పుష్టివంతులుగ చేయవలయును. శ్రాద్ధము అనగా శ్రద్ధా పూర్వకముగ సత్కారము = సేవ, శుశ్రుతతో పితరుల = తల్లిదండ్రులు మొదలగు వారిని తృప్తి చేయవలయును. అన్నము మొదలగు దానితో అతిథులను పూజింప = సత్కరింప వలయును. మరియు బలి (అన్నము) కర్మతో అన్య ప్రాణులను కూడ రక్షింప ప్రయత్నము చేయవలయును.

పైన చెప్పబడిన ౧. బ్రహ్మ యజ్ఞము, ౨. దేవ యజ్ఞము, ౩. పితృయజ్ఞము, ౪. భూత యజ్ఞము, ౫. అతిథి యజ్ఞము అను ఈ పంచ మహా యజ్ఞములను ప్రతి మానవుడు ప్రతిరోజు తప్పక చేయ వలయును.

# ౧. బ్రహ్మ యజ్ఞము

దీనిని సంధ్య అనియు, సంధ్యా వందన మనియు, సంధ్యోపాసన మనియు, సంధ్య వార్చుకొనుట అనియు అంటారు. దీనిని రెండు పూటలు తప్పని సరిగా చేయవలయును.

## గాయత్రీ మంత్రము

ఈ క్రింది గాయత్రీ మంత్రమును పఠించుచు తల వెంట్రుకలు ముడి వేసుకొన వలయును. ముడివేయుట వలన కేశము లిటునటు చెదరక యుండును. గాయత్రీ మంత్రముతో పరమేశ్వరుని ప్రార్థించుట వలన సత్కార్యము లందు మనుజులకు రక్షణ కలుగును.

ఋషిః :- విశ్వామిత్రః ॥ దేవతా: - సవితా॥ ఛన్దః: - నిచృద్గాయత్రీ॥ స్వరః :- షడ్జః॥

**ఓం భూర్భువః స్వః । తత్సవితుర్వరేణ్యం భర్గో**

**దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్॥**

**(యజు॥౩౬-౩, ఋగ్వే॥౩-౬౨-౧౦-,సామ॥౧౪౬౨)**

## ఆచమన మంత్రము

ఈ క్రింది మంత్రముతో పరమేశ్వరుని ప్రార్థించి ముమ్మారు ఆచమనము చేయవలెను. జలము లేకున్న చేయకుండ వచ్చు. కాని మంత్రమును పఠించ వలయును. ఆచమనము వలన కంఠము నందలి కఫాదులు పోగలవు.

**ఓం శన్నో దేవీరభిష్టయ ఆపో భవన్తు పీతయే।**

**శంయోరభి స్రవన్తు నః** ॥ (యజు॥ ౩౬-౧౨)

## ఇంద్రియ స్పర్శ మంత్రములు

ఆచమనానంతరము ఎడమ అరచేతి యందు పంచ పాత్రలోని జలమును ఉద్ధరిణితో పోసుకొని కుడిచేతి అనామిక (ఉంగరపు) వ్రేలితో మధ్య వ్రేలుని జోడించి ఆ రెంటి కొనలను ఎడమ చేతిలోగల జలములో ముంచి, ఈ క్రింది మంత్రములను పఠించుచు ఆయా అంగములను స్పృశింప వలయును. ఈశ్వర ప్రార్థనా పూర్వకముగ నీ మంత్రములతో ఇంద్రియములను స్పృశించుట వలన ఇంద్రియము లన్నియు బలము కలవియై యుండునని అభిప్రాయము. మొదట కుడి భాగమును. అనంతరము ఎడమ భాగములను స్పృశింపదగును, అనగా తాకవలయును.

౧. ఓం వాక్ వాక్ ॥ (నోటిని రెండు వైపుల తాకవలయును)

౨. ఓం ప్రాణః ప్రాణః ॥ (ముక్కు రంధ్రములను తాకవలయును)

౩. ఓం చక్షుః చక్షుః ॥ (నేత్రములను తాకవలయును)

౪. ఓం శ్రోత్రం శ్రోత్రమ్ ॥ (చెవులను తాకవలయును)

౫. ఓం నాభిః॥ (నాభిని తాకవలయును)

౬. ఓం హృదయమ్ ॥ (హృదయమును తాకవలయును)

౭. ఓం కణ్ఠః ॥ (కంఠమును తాకవలయును)

౮. ఓం శిరః ॥ (శిరస్సును తాకవలయును)

౯. ఓం బాహుభ్యాం యశోబలమ్ ॥ (భుజములను తాకవలయును)

౧౦.ఓం కరతలకరపృష్ఠే ॥ (అరచేతులను- వెనుక భాగములను తాకవలయును)

## మార్జన మంత్రములు

ఈ క్రింది మంత్రములను పఠించుచు అనగా పరమేశ్వరుని నామార్థములను స్మరించుచు మార్జనము చేసికొన వలయును. అనగా ఇంద్రియ స్పర్శ మంత్రములకు చెప్పినట్లుగ వ్రేళ్ళను జోడించి జలములో ముంచి ఆ యా అంగములపై నీటిని చల్లుకొన వలయును..

౧. ఓం భూః పునాతు శిరసి ॥ (శిరస్సుపై నీటిని చల్లుకొనవలయును)

౨. ఓం భువః పునాతు నేత్రయోః ॥ (నేత్రములపై నీటిని చల్లుకొనవలయును)

౩. ఓం స్వః పునాతు కణ్ఠే ॥ (కంఠముపై నీటిని చల్లుకొనవలయును)

౪. ఓం మహః పునాతు హృదయే ॥ ( హృదయముపై నీటిని చల్లుకొనవలయును)

౫. ఓం జనః పునాతు నాభ్యామ్ ॥ (నాభిపై నీటిని చల్లుకొనవలయును)

౬. ఓం తపః పునాతు పాదయోః ॥ (పాదములపై నీటిని చల్లుకొనవలయును)

౭. ఓం సత్యం పునాతు పునః శిరసి ॥ (మరల శిరస్సుపై నీటిని చల్లుకొనవలయును)

౮. ఓం ఖం బ్రహ్మ పునాతు సర్వత్ర ॥ (శరీర మంతట నీటిని చల్లుకొనవలయును)

## ప్రాణాయామ మంత్రము

ఈ క్రింది మంత్రము యొక్క అర్థముతో బాటు మనస్సు నందు పఠించుచు పూర్వము చెప్పినట్లు కనీసము ముమ్మారైనను ప్రాణాయామములను చేయ వలయును.

**ఓం భూః॥ ఓం భువః । ఓం స్వః । ఓం మహః॥ ఓం జనః । ఓం తపః॥ ఓం సత్యమ్ ॥**

(తై॥ ఆ॥ ప్రపా॥ ౧౦-అను॥ ౧౭)

## అఘమర్షణ మంత్రములు

ఈశ్వరుని స్తుతించి పాపముల నుండి దూరముగా నుండుమని యుపదేశించు మంత్రములు అఘమర్షణ మంత్రము లనబడును. అఘ మనగా పాపము.

౧. ఓమ్ ఋతం చ సత్యం చాభీద్ధాత్తపసోఽధ్యజాయత ।
తతో రాత్ర్యజాయత తతః సముద్రో అర్ణవః ॥౧॥

౨. సముద్రాదర్ణవాదధి సంవత్సరో అజాయత ।
అహోరాత్రాణి విదధద్విశ్వస్య మిషతో వశీ ॥౨॥

౩. సూర్యాచన్ద్రమసౌ ధాతా యథాపూర్వమకల్పయత్ ।
దివం చ పృథివీం చాన్తరిక్షమథో స్వః ॥౩॥

(ఋగ్వే॥ ౧౦- ౧౯౦-౧,౨,౩)

## పునః ఆచమన మంత్రము

ఈ క్రింది మంత్రమును పఠించి మరల ముమ్మారు ఆచమనము చేయవలయును.

ఓం శన్నో దేవీరభిష్టయ ఆపో భవన్తు పీతయే ।
శంయోరభి స్రవన్తు నః (యజు॥ ౩౬-౧౨)

## మనసా పరిక్రమ మంత్రములు

ఈ క్రింది మనసా పరిక్రమ మంత్రములను పఠించి పరమేశ్వరుని అద్భుత శక్తిని, సృష్టి నియమములను మనసా ధ్యానించి వర్ణిత జడ చేతనములను సదుపయోగము చేసికొనదగును. మనసా పరిక్రమ యనగా మనస్సును అన్ని దిశలలో త్రిప్పుట.

౧ ఓం ప్రాచీ దిగగ్నిరధిపతిరసితో రక్షితాదిత్యా ఇషవః।
తేభ్యో నమోఽధిపతిభ్యో నమో రక్షితృభ్యో నమ ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు ।
యో౽స్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మస్తం వో జంభే దధ్మః ॥ ౧ ॥

౨ దక్షిణా దిగిన్ద్రోఽధిపతిస్తిరశ్చిరాజీ రక్షితా పితర ఇషవః ।
తేభ్యో నమోఽధిపతిభ్యో నమో రక్షితృభ్యో నమ ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు ।

యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మస్తం వో జంభే దధ్మః ॥౨॥

౩ ప్రతీచీ దిగ్వరుణోఽధిపతిః పృదాకూ రక్షితాన్నమిషవః ।
తేభ్యో నమోఽధిపతిభ్యో నమో రక్షితృభ్యో నమ ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు ।
యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మస్తం వో జంభే దధ్మః ॥ ॥

౪ ఉదీచీ దిక్సోమోఽధిపతిః స్వజో రక్షితాశనిరిషవః ।
తేభ్యో నమోఽధిపతిభ్యో నమో రక్షితృభ్యో నమ ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు ।
యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మస్తం వో జంభే దధ్మః ।

౫ ధ్రువా దిగ్విష్ణురధిపతిః కల్మాషగ్రీవో రక్షితా వీరుధ ఇషవః ।
తేభ్యో నమోఽధిపతిభ్యో నమో రక్షితృభ్యో నమ ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు ।
యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మస్తం వో జంభే దధ్మః ॥ ॥

౬ ఊర్ధ్వా దిగ్బృహస్పతిరధిపతిః శ్విత్రో రక్షితా వర్షమిషవః ।
తేభ్యో నమోఽధిపతిభ్యో నమో రక్షితృభ్యో నమ ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు ।
యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మస్తం వో జంభే దధ్మః ॥౬॥

(అథర్వ॥ ౩- ౨౭- ౧ నుండి ౬ వరకు)

## ఉపస్థాన మంత్రములు

ఈ క్రింది మంత్రములను పఠించి, ఉపస్థాన మనగా భగవంతుని సమీపమున కూర్చొని అతనిని సాక్షాత్కరించుచున్నామా యన్నటుల అతనిని కీర్తించుట ఉపస్థానము. మరియు పరమేశ్వర సాన్నిధ్యము బొందుట.

౧ ఓమ్ ఉద్వయం తమసస్పరి స్వః పశ్యన్త ఉత్తరమ్ ।
దేవం దేవత్రా సూర్యమగన్మ జ్యోతిరుత్తమమ్ ॥౧॥

౨ ఉదు త్యం జాతవేదసం దేవం వహన్తి కేతవః । దృశే విశ్వాయ సూర్యమ్ ॥౨॥

౩ చిత్రం దేవానాముదగాదనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః ।

ఆప్రా ద్యావాపృథివీ ౨ అన్తరిక్షగ్ం సూర్య ౨ ఆత్మా జగతస్తస్థుషశ్చ స్వాహా ॥౩॥

౪ తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్రముచ్చరత్ ।

పశ్యేమ శరదః శతం జీవేమ శరదః శతగ్ం శృణుయామ శరదః శతం

ప్ర బ్రవామ శరదః శతమదీనాః స్యామ శరదః శతం భూయశ్చ శరదః శతాత్ ॥౬॥

(యజు॥ ౩౫- ౧౪, ౩౩- ౩౧, ౭-౪౨, ౩౬-౨౪.)

## గాయత్రీ (గురు) మంత్రము

ఈ క్రింది గాయత్రీ మంత్రమును అర్థ సహితముగ నిత్యము ప్రాతః సాయం సంధ్యలలో నేకాంత దేశమున పరమేశ్వరుని ధ్యానింప వలెను.

ఓం భూర్భువః స్వః। తత్సవితుర్వరేణ్యం భర్గో

దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్ ॥

## సమర్పణము

ఈ క్రింది వాక్యములతో నిరాకారుడైన పరమేశ్వరుని ప్రార్థించవలయును.

హే పరమేశ్వర ! దయానిధే ! భవత్కృపయాऽనేన

జపోపాసనాది కర్మణా ధర్మార్థ కామమోక్షాణాం సద్యః సిద్ధిర్భవేన్నః ॥

## నమస్కార మంత్రము

ఈ క్రింది మంత్రముతో నిరాకారుడైన పరమేశ్వరునకు నమస్కరించవలెను.

ఓం నమః శంభవాయ చ మయోభవాయ చ నమః శఙ్కరాయ చ

మయస్కరాయ చ నమః శివాయ చ శివతరాయ చ। (యజు ॥౧౬-౪౧.)

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః

బ్రహ్మయజ్ఞము సమాప్తము.

పై మంత్రములతో పరమాత్ముని నమస్కరించి "శన్నోదేవీ ............" అను నీ మంత్రముతో మూడాచమనములనుజేసి, అగ్నిహోత్రము చేయ నారంభించవలయును.

## గాయత్రీ మంత్ర భావార్థము

౧. ఓ సచ్చిదానంద స్వరూపా! ఓ నిత్యశుద్ధ ముక్త స్వభావా! ఓ నిరాకారా! సర్వశక్తి మంతుడ వగు నో న్యాయువాదీ ! ఓ కరుణామృత వారధీ! నీ దివ్యము, స్వీకరించదగినదియు నగు విజ్ఞాన రూపమును మేము నిత్యముపాసింతుము, మాకు ధారణ శక్తి గల బుద్ధి నిత్తువు గాక! మే మా బుద్ధి సహాయమున బ్రహ్మచర్యాది సద్వ్రతముల నాచరింతుము గాక! విద్యా విజ్ఞానాదులను పొంది పరమ సుఖములనందుదుముగాక!

౨. సచ్చిదానంద స్వరూపుడును, నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావుడు నగు నో దయానిధీ! నీవే మాకందరకు పాలకుడవు, న్యాయాధీశుడవు, అభీష్ట సుఖముల నొసంగు ఇష్టదేవుడవు. కాన నో ఆనంద నిధీ! నీ దయ చేత మేమందరము సదాచార ప్రవర్తనము గల వారమై యుండునట్లు సుబుద్ధిని ప్రసాదించుము.

## ప్రాణాయామ మంత్రముల కర్థము

భూః= ఎవడు ప్రాణమునకు గూడ ప్రాణమైన వాడో, భువః = ఎవడు సమస్త దుఃఖముల నుండి తొలగజేయువాడో, స్వః = ఎవడు స్వయం సుఖ స్వరూపుడును తన యుపాసకు లందరకు సమస్త సుఖముల బొందజేయు వాడునునై యున్నాడో, అట్టి సకల జగదుత్పాదకుడును, మహః = అన్నిటి కంటే పెద్దయు, పూజ్యుడు నగుటచే పరమేశ్వరునకు మహస్సని పేరు. జనః = సర్వజగత్తు నుత్పన్నము చేయటచే నతనిని జనుడని యందురు. తపః = దుష్టులకు సంతాపము నిచ్చు జ్ఞాన స్వరూపు డగుటచే తపస్సందురు. ఇందు "యస్య జ్ఞానమయం తపః" అను ముండకోపనిషత్ వాక్యము ప్రమాణము. సత్యమ్ = అవినాశి యగుటచే పరమేశ్వరుడు సత్యమనబడును. వ్యాపకు డగుటచే బ్రహ్మ యనబడును.

## సమర్పణార్థము

ఓ పరమేశ్వరా! దయానిధే! నీ కృపవలన మా ఈ జప ఉపాసనాది కర్మముల ద్వారమున ధర్మార్థ కామమోక్షములు వెంటనే సిద్ధించును గాక!

## నమస్కార మంత్రార్థము

సుఖ స్వరూపుడగు పరమేశ్వరునకు నమస్కారము. సర్వోత్తమ సుఖ ప్రదాత యగు నీశ్వరునకు నమస్కారము. కల్యాణ కారకుడగు దేవునకు నమస్కారము. స్వభక్తులను సుఖకర కార్యములలో నియుక్తము జేయు భగవంతునకు నమస్కారము. మంగళ స్వరూపునకు, మోక్ష సుఖ ప్రదాతకు నమస్కారములు.

# ౨. దేవయజ్ఞము

దీనిని నిత్యాగ్నిహోత్రమనియు, అగ్నిహోత్రమనియు, హోమమనియు, హవనమనియు అంటారు. నిత్యము సంధ్య చేసినట్లు దీనిని కూడా రెండు పూటలు చేయవలయును. కాని ఉదయము, సంధ్య తరువాత అగ్నిహోత్రము, సాయంత్రము అగ్నిహోత్రము తరువాత సంధ్య చేయవలయును.

## ఆచమన మంత్రములు

ఉద్ధరిణితో జలమును తన కుడిచేతిలో పోసికొని ఈ క్రింది మూడు మంత్రములను "ఒక్కొక్క దానిని క్రమముగ పఠించుచు ముమ్మారు ఆచమింపవలయును.

౧. **ఓమ్ అమృతోపస్తరణమసి స్వాహా॥** (౧ **ఆచమనము**)

౨. **ఓమ్ అమృతాపిధానమసి స్వాహా॥** (౨ **ఆచమనము**)

3. **ఓం సత్యం యశః శ్రీర్మయి శ్రీః శ్రయతాం స్వాహా ॥ 3 ॥** (౩ **ఆచమనము**)

(**ఆశ్వ॥గృ॥**౧-౨౪-౧౨-౨౧-౨౨)

## అంగ స్పర్శ మంత్రములు

ఆచమనానంతరము ఎడమ చేతిలో జలముంచుకొని కుడచతి అనామిక (ఉంగరపు) వ్రేలితో మధ్యవ్రేలును జోడించి ఆ రెండు కొనలను ఎడమచేతిలో గల జలములో ముంచి "ఈ క్రింది మంత్రముల"ను పఠించుచు వరుసగ ముఖ, నాసిక, నయన, కర్ణ, బాహూర్వాది అంగముల స్పృశింపవలయును. మొదట కుడి భాగమును, అనంతరము ఎడమ భాగములను స్పృశింప దగును. అనగా తాకవలయును.

౧. ఓం వాఙ్మఽ ఆస్యేఽస్తు ॥ ౧ ॥ (నోటిని రెండువైపుల తాకవలయును)

౨. ఓం నసోర్మే ప్రాణోఽస్తు ॥ ౨ ॥ (ముక్కు రంధ్రములను తాకవలయును)

౩. ఓమ్ అక్ష్ణోర్మే చక్షురస్తు ॥ ౩ ॥ (రెండు నేత్రములను తాకవలయును)

౪. ఓం కర్ణయోర్మే శ్రోత్రమస్తు ॥ ౪ ॥ (రెండు చెవులను తాకవలయును)

౫. ఓం బాహ్వోర్మే బలమస్తు ॥ ౫ ॥ (రెండు భుజములను తాకవలయును)

౬. ఓమ్ ఊర్వోర్మఽ ఓజోఽస్తు ॥ ౬ ॥ (రెండు తొడలను తాకవలయును)

౭. ఓమ్ అరిష్టాని మేఽఙ్గాని తనూస్తన్వా మే సహ సన్తు॥౭॥(శరీరమంతటను చల్లుకొన వలయును)

(పార॥గృ॥౧-౩-౨౫)

పిదప దుర్గంధ రహితములు, పరిశుద్ధములు నగు ఎండు సమిధలను యజ్ఞ కుండము నందు చక్కగ పేర్చ వలయును. పుచ్చిన సమిధలను వాడరాదు.

## అగ్న్యాధాన మంత్రము

ఈ క్రింది మంత్రమును పఠించుచు నేతిలో ముంచిన సమిధల రెంటిని గైకొనిగాని, కొబ్బరి చిప్ప (కుడక) యందు నేతి వత్తి వేసి గాని, కర్పూరముతో గాని వెలిగింపవలయును.

**ఓం భూర్భువః స్వః॥** (అని వెలిగించి)

తరువాత ఆ వెలిగించిన యగ్నిని ఈ క్రింది మంత్రమును పఠించి యజ్ఞకుండమున నుంచవలయును.

(గోభి ॥ గృ ॥ ౧-౧-౧౧)

**ఓం భూర్భువః స్వర్ద్యౌరివ భూమ్నా పృథివీవ వరిమ్ణా ।**

**తస్యాస్తే పృథివి దేవయజని పృష్ఠేఽగ్నిమన్నాదమన్నాద్యాయాదధే ॥**

(అని కుండము నందుంచవలెను)

(యజు ॥ ౩-౫)

## అగ్నినుత్తేజింప జేయు మంత్రము

ఈ క్రింది మంత్రమును పఠించుచు అగ్ని నుత్తేజింప జేయ వలయును. ఇట్టి తరి విసన కఱ్ఱనే వాడవలెను. కాని నోటితో ఊదరాదు.

ఓమ్ ఉద్బుధ్యస్వాగ్నే ప్రతి జాగృహి త్వమిష్టాపూర్తే సగ్ం సృజేథామ్యయం చ ।

అస్మిన్ సధస్థే అధ్యుత్తరస్మిన్ విశ్వే దేవా యజమానశ్చ సీదత ॥ (యజు। ౧౫-౫౪)

(అగ్నిని ప్రజ్వలింపజేయవలెను.)

## సమిధాధాన మంత్రములు

అగ్ని సమిధలలో చొచ్చుకొని బాగుగ ప్రజ్వలింప సాగినపుడు ఎనిమిది అంగుళముల పొడవు గల మూడు సమిధల నేరి వాని యగ్రభాగములను నేతిలో ముంచి ఎడమ చేతితో పట్టుకొని ఈ క్రింది మంత్రములను పరిశుద్ధాంతఃకరణముతో పఠించుచు కుడిచేతితో ఒక్కొక్కటిగ యజ్ఞకుండమున నుంచ వలయును.

౧. ఓమ్ అయన్త ఇధ్మ ఆత్మా జాతవేదస్తేనేధ్యస్వ వర్ధస్వ చేద్ధ వర్ధయ

చాస్మాన్ ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసేనాన్నాద్యేన సమేధయ స్వాహా ॥౧॥

(అని ౧ వ సమిధ కుండము నందుంచవలయును.)

ఇదమగ్నయే జాతవేదసే - ఇదన్న మమ ॥

(అశ్వ॥ గృ॥ ౧-౧౦-౧౨)

౨. ఓం సమిధాగ్నిం దువస్యత ఘృతైర్బోధయతాతిథిమ్।

ఆస్మిన్ హవ్యా జుహోతన ॥౨॥

3. సుసమిద్ధాయ శోచిషే ఘృతం తీవ్రం జుహోతన।

అగ్నయే జాతవేదసే స్వాహా॥ (అని ౨వ సమిధను కుండము నందుంచవలెను).

ఇదమగ్నయే జాతవేదసే - ఇదన్న మమ ॥3॥ (యజు॥ 3-౧, ౨)

౪. ఓం తం త్వా సమిద్భిరఙ్గిరో ఘృతేన వర్ధయామసి ।

బృహచ్ఛోచా యవిష్ఠ్య స్వాహా ॥౪॥ (అని 3వ సమిధను కుండము నందుంచవలెను.)

ఇదమగ్నయేఽఙ్గిరసే - ఇదన్న మమ ॥ (యజు 3-3).

## జలప్రోక్షణ (ప్రసేచన) మంత్రములు

ఈ క్రింది "జలప్రోక్షణ" మంత్రములతో యజ్ఞకుండమునకు నలువైపుల జలమును ధారగ పోయవలయును. ఒకటవ మంత్రముతో యజ్ఞకుండమునకు "తూర్పుదిక్కున" దక్షిణము నుండి ఉత్తరమునకు, రెండవ మంత్రముతో "పడమర దిక్కున" దక్షిణము నుండి ఉత్తరమునకు, మూడవ మంత్రముతో "ఉత్తర దిక్కున" పడమర నుండి తూర్పునకు జలమును ధారగ పోయవలెను. నాల్గవ మంత్రముతో "దక్షిణ దిక్కున" తూర్పునుండి మొదలుకొని దక్షిణమున, పడమర, ఉత్తరము, తూర్పు అనగా యజ్ఞకుండమునకు "నలువైపుల" జలమును ధారగ పోయవలెను. (అనగా ఆగ్నేయ మూల నుండి ప్రారంభించి నైఋతి, వాయువ్యము, ఈశాన్యము, మరల ఆగ్నేయ మూల వరకు చుట్టు ధారగ పోయవలెను.)

౧. **ఓమ్ అదితేఽనుమన్యస్వ ॥౧॥ (తూర్పు దక్షి॥ నుండి ఉత్త॥నకు దారగ పోయవలెను).**

౨. **ఓమ్ అనుమతేఽనుమన్యస్వ ॥౨॥ (పడ॥ దక్షి॥ నుండి ఉత్త॥నకు దారగ పోయవలెను).**

3. **ఓం సరస్వత్యనుమన్యస్వ ॥3॥ (ఉత్త॥ పడ॥ నుండి తూర్పునకు దారగ పోయవలెను).**

**(గోభి॥ గృ॥ ౧-3-౧, ౨, 3)**

౪ **ఓం దేవ సవితః ప్ర సువ యజ్ఞం ప్ర సువ యజ్ఞపతిం భగాయ ।**

**దివ్యో గన్ధర్వః కేతపూః కేతం నః పునాతు వాచస్పతిర్వాచం నః స్వదతు॥౪॥**

**(దక్షి॥ నుండి పడ॥ ఉత్త॥ తూర్పు వరకు దారగ పోయవలెను)**

**(య॥ 30-౧)**

## అఘారావాజ్యాహుతి మంత్రములు

ఈ క్రింది మంత్రములలో ఒకటవ మంత్రముతో "ఉత్తరమున" పడమర నుండి తూర్పునకు, రెండవ మంత్రముతో "దక్షిణమున" పడమర నుండి తూర్పునకు ధారగ అనగా పొడుగుగ ఘృతముతో యజ్ఞకుండము నందు ఆహుతి నివ్వ వలయును.

**గమనిక :** కుడిచేతి అంగుష్ఠ (బొటన), మధ్యమ, అనామిక (ఉంగరపు) వ్రేళ్ళతో స్రువమును పట్టుకొని తక్కువలో తక్కువ అరతులము ( 5గ్రా - 832 మిగ్రా) ఘృతమును తీసుకొని ఆహుతి నివ్వ వలయును.

౧. ఓమ్ అగ్నయే స్వాహా ॥౧॥ (ఉత్త॥ పడమర నుండి తూర్పునకు ఆహుతి నివ్వవలెను).

ఇదమగ్నయే - ఇదన్న మమ ॥ (యజు ॥ ౨౨ -౨౭)

౨ ఓం సోమాయ స్వాహా ॥౨॥ (దక్షి॥ పడమరనుండి తూర్పునకు ఆహుతినివ్వవలెను)

ఇదం సోమాయ - ఇదన్న మమ॥, (యజు ॥ ౨౨ -౨౭, గొ॥గృ॥ ౧-౮-౩,౪)

## ఆజ్యభాగాహుతి మంత్రములు

ఈ క్రింది మంత్రములతో నాహుతులను కుండము మధ్య నివ్వవలయును.

౧. ఓం ప్రజాపతయే స్వాహా ॥౧॥ (మధ్యన ఆహుతి నివ్వవలెను)

ఇదం ప్రజాపతయే - ఇదన్న మమ ॥ (యజు ॥ ౧౮ -౨౮ కాత్యా॥ ౩-౧౨)

౨. ఓమ్ ఇన్ద్రాయ స్వాహా ॥౧॥ (మధ్యన ఆహుతి నివ్వవలెను) (కాత్యా॥ ౩-౧౯)

ఇదమిన్ద్రాయ - ఇదన్న మమ ॥ (యజు॥ ౨౨-౨౭)

## ప్రాతఃకాల హవన మంత్రములు

ఇచ్చట నుండి యజమాని భార్య యజ్ఞము పూర్తి అగువరకు అంగుష్ట (బొటన) వ్రేలు, మధ్యమవ్రేలు, అనామిక (ఉంగరపు) వ్రేలు- ఈ మూడు కొనవ్రేళ్ళకు వచ్చినంత సామగ్రిని తీసుకొని అర్ఘ్యము విడుచునట్లు ఆహుతుల నివ్వ వలయును. భర్త ఘృతముతో ఆహుతి నివ్వవలెను.

<u>గమనిక:</u> ఉదయము చేసినపుడు "ప్రాతఃకాల హవన మంత్రముల"తోను, సాయంత్రము చేసినప్పుడు "సాయంకాల హవన మంత్రముల"తోను ఆహుతుల నివ్వవలయును. కాని సాయంత్రం చేయుటకు వీలు పడనిచో సాయంకాల హవన మంత్రములతో ఉదయముననే ఆహుతుల నివ్వవలయును. ఒకవేళ ఉదయము చేయనివారు సాయంత్రము చేసినట్లైతే, "ప్రాతఃకాల హవన మంత్రములతో, సాయంకాల హవన మంత్రములతో" ఆహుతుల నివ్వవలయును.

౧. ఓం సూర్యో జ్యోతిర్జ్యోతిః సూర్యః స్వాహా॥

౨. ఓం సూర్యో వర్చో జ్యోతిర్వర్చః స్వాహా ॥

౩. ఓం జ్యోతిః సూర్యః సూర్యో జ్యోతిః స్వాహా॥ (యజు॥ 3-౯)

౪. ఓం సజూర్దేవేన సవిత్రా సజూరుషసేన్ద్రవత్యా ।

జుషాణః సూర్యో వేతు స్వాహా ॥ (యజు॥ 3-౧౦)

## సాయంకాల హవన మంత్రములు

1. ఓమ్ అగ్నిర్జ్యోతిర్జ్యోతిరగ్నిః స్వాహా॥

౨. ఓమ్ అగ్నిర్వర్చో జ్యోతిర్వర్చః స్వాహా॥ (3-౯)

౩. ఓమ్ అగ్నిర్జ్యోతిర్జ్యోతిరగ్నిః స్వాహా॥ (మౌనముగ పఠించవలెను.)

౪. ఓం సజూర్దేవేన సవిత్రా సజూ రాత్ర్యేన్ద్రవత్యా।

జుషాణోఽ అగ్నిర్వేతు స్వాహా ॥ (యజు॥ ౩-౧౦,)

## ప్రాత స్సాయం సమయముల హవన మంత్రములు

ఈ క్రింది మంత్రములతో ప్రాతఃకాలము చేసినప్పుడు, మరియు సాయంకాలము చేసినప్పుడు కూడ ఆహుతుల నివ్వవలెను.

౧. ఓం భూరగ్నయే ప్రాణాయ స్వాహా ॥ ౧ ॥

ఇదమగ్నయే ప్రాణాయ-ఇదన్న మమ ॥

౨. ఓం భువర్వాయవేఽపానాయ స్వాహా ॥ ౨ ॥

ఇదం వాయవేఽపానాయ - ఇదన్న మమ ॥

౩. ఓం స్వరాదిత్యాయ వ్యానాయ స్వాహా ॥3॥

ఇదమాదిత్యాయ వ్యానాయ-ఇదన్న మమ ॥

౪. ఓం భూర్భువః స్వరగ్నివాయ్వాదిత్యేభ్యః ప్రాణాపానవ్యానేభ్యః స్వాహా ॥౪॥

(పార॥ గృ॥ ౧-౫, ౩౪-౪)

ఇదమగ్నివాయ్వాదిత్యేభ్యః ప్రాణాపానవ్యానేభ్యః - ఇదన్న మమ ॥

౫. **ఓమ్ ఆపో జ్యోతీ రసో౽మృతం బ్రహ్మ భూర్భువః స్వరోం స్వాహా ॥౫॥**

**(తైత్తి॥ అర॥ ప్రపా ॥ ౧౦).**

## పూర్ణాహుతి

ఈ క్రింది పూర్ణాహుతి మంత్రమును పఠించుచు క్రమముగ "3 సార్లు" ఆహుతు లివ్వవలయును.

**ఓం సర్వం వై పూర్ణగ్ం స్వాహా ॥ (అనుచు మూడుసార్లు ఆహుతుల నివ్వవలెను.)**

దేవ యజ్ఞము సమాప్తము

# 3. పితృ యజ్ఞము

జీవించియున్న తల్లిదండ్రులకు, వృద్ధులకు శ్రద్ధతో సేవచేయుటయే శ్రాద్ధము. వారిని తృప్తి పరచుటయే తర్పణము. మరణించిన తరువాత జీవుడు చేసుకొన్న కర్మలను బట్టి ఏదో యొక యోనిలో పుట్టును. కావున మరణించిన వారి పేరుతో శ్రాద్ధములని, తర్పణములని చేయుట వివేకము కాజాలదు. బ్రతికుంటే మజ్జిగకు గతిలేదు. వలుకల్లో పాడావు అన్నట్లు గాక, బ్రతికియుండగానే పితరులకు శ్రద్ధాపూర్వకముగ సేవ యొనర్చి తృప్తి పరచుటయే పితృయజ్ఞము ఇదియే శ్రుతి స్మృతి సమ్మతమైన ప్రాచీనాచారము.

**పితృయజ్ఞమందు రెండు భేదములు:** ఒకటి శ్రాద్ధము, రెండవది తర్పణము.

౧. **శ్రాద్ధము: శ్రత్** అనగా సత్యము. "**శ్రత్సత్యం దధాతి యయా క్రియయా సా శ్రద్ధా, శ్రద్ధయా యత్ క్రియతే తచ్ఛ్రాద్ధమ్.**" ఏ క్రియచే సత్యము గ్రహింపబడునో అది శ్రద్ధ, ఆ శ్రద్ధచే నే కర్మము చేయబడునో దానికి "**శ్రాద్ధ**"మని పేరు.

౨. **తర్పణము : "తృప్యన్తి తర్పయన్తి యేన పితౄన్ తత్తర్పణమ్"** ఏ కర్మచేత బ్రతికి యుండు మాతా పిత్రాది పితరులు ప్రసన్నులగుదురో లేక ప్రసన్నులు చేయబడుదురో దానికి "**తర్పణ**" మని పేరు. ఈ తర్పణము జీవించి యుండు వారికొరకే చేయవలయును కాని మృత్యులయిన వారికొరకు కాదు.

**ఊర్జం వహన్తీరమృతం ఘృతం పయః కీలాలం పరిస్రుతమ్ ।**

**స్వధా స్థ తర్పయత మే పితౄన్ ॥ (యజు॥ ౨-౩౪).**

తండ్రి కానీ, యజమాని కానీ, తన పుత్రపౌత్రులను, కళత్రమును, సేవకులు మున్నగు వారి నిట్లాజ్ఞాపించునది. మాన్యులగు పితృ, పితామహాదులు, మాతృ, మాతా మహ్యాదులు, ఆచార్యులు, ఇతర విద్వాంసులు, వయసు నందును, జ్ఞానము నందును వృద్ధులైన వారు నెల్లరు మనకు గౌరవింపదగిన వారు. మీరు వారికి పరాక్రమమును గలిగించు సుగంధితము, ప్రియకరము, హృదయాకర్షకము నగు నుత్తమ జలము, రోగ నాశములగు నమృతాత్మకములగు నానావిధ రసములు, నేయి, పాలు, బాగుగ సిద్ధము చేయబడిన యన్నము, తేనె, ఉత్తమ ఫలరసములు మున్నగు పదార్థములతో నిత్యము సేవ చేయుడు. వారు ప్రసన్నులై మీకు సదా విద్యల నొసంగుదురు. అందువలన మీరును నిత్యము ప్రసన్నముగా నుందురు. సత్యవిద్యను, భక్తిని, నిజపదార్థములను ధరించువారునై యుందురు. ఇట్లు విన్నవించుడు. ఓ పితరులారా ! మే మొసగు నమృతాత్మక పదార్థముల ననుభవించి తృప్తులగుదురు గాక ! మీ కనుకూలములగు పదార్థము లేవియో వానిని చేకూర్చునట్లు మమ్మాజ్ఞాపింపుడు. మనోవాక్కాయములతో మీకు సుఖము నొనగూర్చ సిద్ధముగా నున్నాము. మీకెట్టి దుఃఖము కలుగకుండు గాక! తల్లిదండ్రులు బాల్యమునందును, బ్రహ్మచర్యాశ్రమమునందును మీరు (గురువులు) మమ్ములను సుఖపెట్టి యున్నారు. అట్లే మేమును మీకు ప్రత్యుపకార మొనర్చి కృతజ్ఞులమై యుండుట మాకు కర్తవ్యము. లేకున్న కృతఘ్నతా దోషగ్రస్తుల మగుదుము.

**పిత్రే స్వధా నమః పితరం తర్పయామి ।**

**పితామహాయ స్వధా నమః పితామహం తర్పయామి ।**

**ప్రపితామహా స్వధా నమః ప్రపితామహం తర్పయామి ।**

**మాత్రే స్వధా నమో మాతరం తర్పయామి ।**

**పితామహ్యై స్వధా నమః పితామహీం తర్పయామి ।**

**ప్రపితామహ్యై స్వధా నమః ప్రపితామహీం తర్పయామి ।**

**సపత్న్యై స్వధా నమః స్వపత్నీం తర్పయామి ।**

**సంబంధిభ్య స్వధా నమః సంబంధిన స్తర్పయామి ।**

**సగోత్రేభ్యః స్వధా నమః సగోత్ర స్తర్పయామి ।**

**(ఇతి పితృ తర్పణమ్).**

సంతానమును అన్నము చేతను, సత్కారము చేతను రక్షించువాడు తండ్రి, తండ్రికి తండ్రి పితామహుడు - తాత, తాత తండ్రి ప్రపితామహుడు, అన్నము చేతను, సత్కారము చేతను సంతానమును మాన్యము చేయునది తల్లి. తండ్రి తల్లి పితామహి, పితామహుని తల్లి ప్రపితామహి. వీరిని, తన భార్యను, సోదరీమణులను, బంధువులను, తన గోత్రము వారిని, ఇతర మహాపురుషులను, వృద్ధులను అత్యంత శ్రద్ధతో నుత్తమాన్నవస్త్ర సుందర యానము లిచ్చి బాగుగా తృప్తి పరచుట అనగా, నే ఏ కర్మలచే వారి ఆత్మ తృప్తి బొంది శరీరము స్వస్థమగుచున్నదో ఆయా కర్మలచే బ్రీతి పూర్వకముగ వారి సేవ చేయుట శ్రాద్ధ తర్పణము లనబడును.

జీవితులై తల్లిదండ్రులు, తాత, ముత్తాతలు, నాయనమ్మ, నాయనమ్మ మాత, అమ్మమ్మ, అమ్మమ్మ మాత, విద్వాంసులు, ఆచార్యులు మున్నగు మాన్యులను అన్నాది పదార్థములతో సత్కరించుట, వారి ఆజ్ఞలను పాలించుట "శ్రాద్ధ"మని, ఆ సత్కారములచే వారు తృప్తులగుట "తర్పణ" మని ఎరుగవలెను. ఈ శ్రాద్ధ తర్పణములు జీవించి యుండువారి కొరకే చేయవలయును. కాని మృత్యులైన వారి కొరకు కాదు.

పితృ యజ్ఞము సమాప్తము

# ४. భూత యజ్ఞము

**అహరహర్బలిమిత్తే హరన్తోఽశ్వాయేవ తిష్ఠతే ఘాసమగ్నే ।**

**రాయస్పోషేణ సమిషా మదన్తో మా తే అగ్నే ప్రతివేశా రిషామ ॥**

**(అథర్వ ॥ ౧౯-౫౫-౭)**

ఓ పరమేశ్వరా ! నీ యజ్ఞము వలన నెవరు నిత్యము భూతయజ్ఞము చేయుదురో వారు సంపత్సమృద్ధితోను, శుభేచ్ఛతోను, నిత్యానందమును బొందుదురు. అశ్వ సముఖమున గడ్డి, జలము మున్నగు ఖాద్య పదార్థముల నుంచునట్లు ఉత్తమ పదార్థముల నెల్ల ప్రాణులకు కల్పించుచు ప్రసన్నులగుదురు. ఓ పరమదేవా ! నీ యాజ్ఞలకు విరుద్ధములగు వ్యవహారము లందెన్నడు ప్రవేశింపము. అన్యాయముగ ప్రాణుల నెన్నడు పీడింపము. ఎల్లరను మిత్రులవలె చూతుము.

వైశ్వదేవస్య సిద్ధస్య గృహ్యేఽగ్నౌ విధిపూర్వకమ్ ।

**అభ్యః కుర్యాద్దేవతాభ్యో బ్రాహ్మణో హోమమన్వహమ్ ॥** (మను ॥ 3-౮౪)

గార్హస్థ్య అగ్నిలో సిద్ధమైన పాకమును సర్వదేవతల నిమిత్తము అన్నమును విధి పూర్వకముగ ప్రతిదినము దేవతలకు ఉద్దేశ్యముతో హవనము చేయవలయును.

పాకశాలలో భోజనార్థము సిద్ధమైన దానిని దివ్యగుణములు కలుగుటకు ఆ పాకాగ్నిలో విధి పూర్వకముగ మంత్రములతో నిత్యము హోమము చేయవలయును.

**శునాం చ పతితానాం చ శ్వపచాం పాపరోగిణామ్ ।**

**వాయసానాం కృమీణాం చ శనకైర్నిర్వపేద్భువి ॥** (మను॥ 3-౯౨)

కుక్కలకు, నిరుపేదలకు, పాపరోగులకు, (కుష్ఠ మున్నగు), కాకులకు, చీమలు మున్నగు కీటకములకు అన్నభాగములనిచ్చి వాని జీవితమునకు తోడ్పడవలయును.

వంట ఇంటిలో అన్నము సిద్ధమైన తరువాత, దానిని దివ్యగుణములు కలుగుటకు ఆ పాకాగ్నిలో విధిపూర్వకముగ మంత్రములతో నిత్యము హోమము చేయవలయును. ఉప్పు, కారము కలవని ఆహార పదార్థము, బెల్లం నేతిలో కలిపి పొయ్యిలో గాని, వేరుగ తీయబడిన అగ్నిలో గాని, హోమకుండ మందు కాని ఈ క్రింది పది మంత్రములతో ఆహుతుల నివ్వవలయును.

**ఓమ్ అగ్నయే స్వాహా ॥౧॥ ఓం సోమాయ స్వాహా ॥౨॥ ఓమ్ అగ్నీషోమాభ్యాం స్వాహా ॥3॥ ఓం విశ్వేభ్యో దేవేభ్యః స్వాహా ॥౪॥ ఓం ధన్వన్తరయే స్వాహా ॥౫॥ ఓం కుహ్వై స్వాహా ॥౬॥ ఓమ్ అనుమత్యై స్వాహా ॥౭॥ ఓం ప్రజాపతయే స్వాహా ॥౮॥ ఓం సహ ద్యావాపృథివీభ్యాం స్వాహా ॥౯॥ ఓం స్విష్టకృతే స్వాహా ॥౧౦॥**

ఈ పై మంత్రములలోని అగ్ని, సోమ, ధన్వంతరి మున్నగు పదములచే పరమేశ్వరునే గ్రహింపవలయును.

మరల ఈ క్రింది మంత్రములతో ఆయా దిశలందు ఆయా దిశలను వస్తువులను ఉద్దేశించి యథాశక్తి బలిదాన గ్రాసము (ముద్ద) లను ఒక విస్తరి యందుంచవలెను. సమయమును బట్టి వానిని అతిథులకు తినిపించవలయును. అతిథి విచ్చేసే అవకాశము లేనిచో నా భాగములను కొంచెముగ పెట్టి వాని నగ్ని యందు వేయవలెను. దిశల చెప్పబడిన బలిదానములు విస్తరి మధ్య నుంచవచ్చును.

౧. ఓం సానుగాయేన్ద్రాయ నమః ॥౧॥ (తూర్పున)

౨. ఓం సానుగాయ యమాయ నమః ॥౨॥ (దక్షిణమున)

౩. ఓం సానుగాయ వరుణాయ నమః ॥౩॥ (పడమరన)

౪. ఓం సానుగాయ సోమాయ నమః ॥౪॥ (ఉత్తరమున)

౫. ఓం మరుద్భ్యో నమః ॥౫॥ (ద్వారమున)

౬. ఓమ్ అద్భ్యో నమః ॥౬॥ (జలస్థానమున)

౭. ఓమ్ వనస్పతిభ్యో నమః ॥౭॥ (రోలు, రోకలి ఉండు ప్రదేశమున)

౮. ఓం శ్రియై నమః ॥౮॥ (ఈశాన్యమున)

౯. ఓం భద్రకాల్యై నమః ॥౯॥ (నైఋతిన)

౧౦. ఓం బ్రహ్మపతయే నమః ॥౧౦॥ (మధ్యన)

౧౧. ఓం వాస్తుపతయే నమః ॥౧౧॥ (మధ్యన)

౧౨. ఓం విశ్వేభ్యో దేవేభ్యో నమః ॥౧౨॥ (పై భాగమున)

(ఓం దివాచారిభ్యో భూతేభ్యో నమః ॥) (పై భాగమున)

౧౩. ఓం నక్తంచారిభ్యో భూతేభ్యో నమః ॥౧౩॥ (పై భాగమున)

౧౪. ఓం సర్వాత్మభూతయే నమః ॥౧౪॥ (వెనుక)

౧౫. ఓం పితృభ్యః స్వధాయిభ్యః స్వధా నమః ॥౧౫॥ (దక్షిణమున)

(మను॥ ౩-౮౭, ౯౧)

పై మంత్రముల లోనినామములు పరమేశ్వరునే బోధించును.

**శునాం చ పతితానాం చ శ్వపచాం పాపరోగిణామ్ ।**

**వాయసానాం కృమీణాం చ శనకైర్నిర్వపేద్భువి ॥ (మను ॥ ౩-౯౨)**

శునకము, పతితుడు, చండాలుడు, పాపిరోగి (కుష్టు మున్నగు), కాకులు, క్రిమికీటకము (చీమలు మొ॥)లను, నీ యారు నామములచే నారు భాగములను భూమిపై పెట్టవలెను. ఆ యారు భాగములను యెవరెవరి నామములు గణింపబడినవో వారి వారి కివ్వవలయును.

భూత యజ్ఞము సమాప్తము

# ౫.అతిది యజ్ఞము

అతిథులను యథాయోగ్యముగ సేవించువారికి శుభములు కలుగును. పూర్ణ విద్యావంతులు, పరోపకారులు, జితేంద్రియులు, ధార్మికులు, సత్యవాదులు, కపటము మున్నగు దోషము లేనివారు, నిత్యము పర్యటనము చేయు మనుజులు, అతిథులనబడుదురు. ఈ విషయమున ప్రమాణము లనదగు మంత్రములు వేదము లందనేకము లున్నవి. సంక్షిప్తముగా రెండు మంత్రములనే వ్రాయుచున్నాము.

**తద్యస్యైవం విద్వాన్ వ్రాత్యోఽతిథిర్గృహానాగచ్ఛేత్ ॥౧॥**

**స్వయమేనమభ్యుదేత్య బ్రూయాద్ వ్రాత్య క్వాఽవాత్సీర్**

**వ్రాత్యోదకం వ్రాత్య తర్పయన్తు వ్రాత్య యథా తే ప్రియం**

**తథాస్తు వ్రాత్య యథా తే వశస్తథాస్తు వ్రాత్య యథా తే నికామస్తథాస్త్వితి ॥౨॥**

(**అథర్వ॥** ౧౫-౧౧-౧,౨).

ఉత్తమ గుణములతో కూడి రాకపోకల సమయము నియతము కాని విద్వాంసుడైన వ్యక్తి గృహమున కరుదెంచినపుడు (౧) స్వయముగా గృహస్థుడు ప్రేమతో నతని కెదురేగి నమస్కరించి, తీసికొని వచ్చి ఉచిత యాసనమున కూర్చుండపెట్టవలయును. పిదప పానీయాదులు కావలయునా! అని అడుగవలెను. అవసరమైన కోరికలను తీర్చి స్వస్థచిత్తుడైన తదుపరి "ఆర్యా!" మీరింతకు పూర్వమెటనుంటిరి? అని అడుగవలెను. ఈ యుదకమును గ్రహింపుడనవలెను. సత్యోపదేశము ద్వారమున మమ్ములను తృప్తి పరతురు గాక! ఓ మహానుభావా! మీరు ప్రసన్నులగునట్లు మేము సేవింతుము. మీకేది ప్రియమో ఆజ్ఞాపింతురు గాక! ఓ యతిథీ! మమ్ములను మీకనుకూలురుగా భావించి మీ ఇష్టము వచ్చిన సేవయందు మమ్ములను నియోగింపుడు. మీ ఇష్టమును పూర్తిచేయుటకు సేవింతుము. ఇట్లాచరించుటచే మనముభయులము సేవానత్సంగాదుల ద్వారమున విద్యావృద్ధి నొనర్చుకొని యెల్లపుడు సుఖము ననుభవింతుము (౨)

ఒక సమయము అనునది లేకుండా దేశ సేవారతుడును, పరోపకారియు, పక్షపాత రహితుడును, ధార్మికుడును అగు విద్వాంసుడు గృహమును సమీపించినచో అతనిని

సత్కరించి అతను కోరిన ఆహారమును తనబట్టి అతనిని విజ్ఞాన విషయములను, ఉపదేశములను వినిపించవలెనని కోరవలయును. అదియే అన్వర్థ (సార్థకమైన) యుక్తమైన అతిథి యజ్ఞమని అనబడును.

అతిథి యజ్ఞము సమాప్తము

ప్రతి మిధునము (దంపతులు) లేక ఏ ఒక్కరైనా సరే ప్రతిదినము ౧. బ్రహ్మయజ్ఞము, ౨. దేవ యజ్ఞము, ౩. పితృ యజ్ఞము, ౪. భూత యజ్ఞము, ౫. అతిథి యజ్ఞముల పేర పిలువబడు పంచ మహాయజ్ఞములను ఆచరించవలయునని ధర్మశాస్త్రకారుల అభిమతము.

**బ్రాహ్మే ముహూర్తే బుధ్యేత ధర్మార్థౌ చానుచిన్తయేత్ ।**

**కాయక్లేశాంశ్చ తన్మూలాన్వేదతత్త్వార్థమేవ చ ॥ (మను॥ ౪-౯౨)**

రాత్రి నాలుగవ ఝామునందు నాలుగు ఘడియల (గం॥ ౧-౩౬॥) రాత్రి యుండగా లేచి కాలకృత్యముల నొనర్చి, ధర్మార్థములను, శరీర సంబంధమగు రోగనిదానములను, పరమేశ్వరుని ధ్యానము చేయవలయును. ఎన్నడును అధర్మము నాచరింపగూడదు.

(దయానంద కృత పంచ మహా యజ్ఞ విధి నుండి)

పంచ మహా యజ్ఞములు సమాప్తము

## భోజన సమయమున పఠించు మంత్రము

అన్నము వడ్డించిన తరువాత గాయత్రీ మంత్రము పఠించుచు అన్నముపై జలమును ప్రోక్షించి, అనగా చిలకరించి ఔపోషణము వంచుకొనవలయును. అనగా విస్తరి చుట్టు "జల ప్రసేచన"ము చేసి అనగా ధారగాపోసి పిదప "ఓం శన్నోదేవీ...........॥" అను మంత్రముతో ఆచమనము చేసి భక్తి పూర్వకముగ ఈ క్రింది మంత్రమును పఠించ వలయును.

**ఓమ్ అన్నపతేఽన్నస్య నో దేహ్యనమీవస్య శుష్మిణః।**

**ప్రప్ర దాతారం తారిషఽఊర్జం నో ధేహి ద్విపదే చతుష్పదే ॥ (యజు॥ ౧౧-౮౩).**

పిదప అన్నమును కొంచెము తీసికొని ఈ క్రింది ఒకటవ వాక్యమును పఠించి

నోటియందు వేసికొనవలయును. అట్లే మిగిలిన నాలుగు వాక్యములను పఠించి నోటియందు వేసికొనవలయును. తదుపరి అన్నమును భుజింప వలయును.

౧. **ఓం ప్రాణాయ స్వాహా ॥౧॥ (నోటియందు ప్రథమాహుతి)**

౨. **ఓం వ్యానాయ స్వాహా ॥౨॥ (నోటియందు ద్వితీయాహుతి)**

౩. **ఓమ్ అపానాయ స్వాహా ॥౩॥ (నోటియందు తృతీయాహుతి)**

౪. **ఓం సమానాయ స్వాహా ॥౪॥ (నోటియందు చతుర్థాహుతి)**

౫. **ఓమ్ ఉదానాయ స్వాహా ॥౫॥ (నోటియందు పఞ్చమాహుతి)**

(ఛాన్దో॥ఉప॥ ౫-౧౯-౧నుండి ౫-౨౩-౧ వరకు).

**అన్నపతే.............. మంత్రార్థము:**

అన్నపతే=పరమేశ్వరా! నః=మాకు, అనమీవస్య=రోగరహితమైన, శుష్మిణః = బలదాయకమైన, అన్నస్య=అన్నమును, దేహి=ఇమ్ము. దాతారమ్=దాతను, ప్రప్ర తారిషః= వర్ధిల్లజేయుము. నః=మా యొక్క, ద్విపదే=ద్విపాత్తులకు (రెండు పాదములు గల ప్రాణులకు), చతుష్పదే= చతుష్పాత్తులకు (నాలుగు పాదములు గల ప్రాణులకు) ఊర్జమ్ = బలకరమగు నాహారమును, దేహి = ఇమ్ము.

## శయన కాలమున పఠించు మంత్రములు

పడుకొనే ముందు ఈ క్రింది మంత్రముల పఠించి పడుకొన వలయును

**ఓం యజ్జాగ్రతో దూరముదైతి దైవం తదు సుప్తస్య తథైవైతి ।**

**దూరఙ్గమం జ్యోతిషాం జ్యోతిరేకం తన్మే మనః శివసఙ్కల్పమస్తు ॥౧॥**

౨. **యేన కర్మాణ్యపసో మనీషిణో యజ్ఞే కృణ్వన్తి విదథేషు ధీరాః ।**

**యదపూర్వం యక్షమన్తః ప్రజానాం తన్మే మనః శివసఙ్కల్పమస్తు ॥౨॥**

౩. **యత్ప్రజ్ఞానముత చేతో ధృతిశ్చ యజ్జ్యోతిరన్తరమృతం ప్రజాసు ।**

**యస్మాన్న ఋతే కిం చన కర్మ క్రియతే తన్మే మనః శివసఙ్కల్పమస్తు ॥౩॥**

౪. యేనేదం భూతం భువనం భవిష్యత్పరిగృహీతమమృతేన సర్వమ్ ।
యేన యజ్ఞస్తాయతే సప్తహోతా తన్మే మనః శివసఙ్కల్పమస్తు ॥౪॥

౫. యస్మిన్నృచః సామ యజూగంషి యస్మిన్ప్రతిష్ఠితా రథనాభావివారాః ।
యస్మిన్శ్చిత్తగం సర్వమోతం ప్రజానాం తన్మే మనః శివసఙ్కల్పమస్తు ॥౫॥

౬. సుషారథిరశ్వానివ యన్మనుష్యాన్నేనీయతేఽభీశుభిర్వాజిన ఽ ఇవ ।
హృత్ప్రతిష్ఠం యదజిరం జవిష్ఠం తన్మే మనః శివ సఙ్కల్పమస్తు ॥౬॥

(యజు॥ ౩౪-౧ నుండి ౬ వరకు).

*వైదిక దినచర్య సమాప్తము*

## తృతీయాధ్యాయము సమాప్తము

---

## మృత్యుంజయ మంత్రము

ఓ౩మ్ త్ర్యమ్బకం యజామహే సుగన్ధిం పుష్టివర్ధనమ్ ।
ఉర్వారుకమివ బన్ధనాన్మృత్యోర్ముక్షీయ మాఽమృతాత్ ।

(యజు॥ ౩-౬౦, ఋగ్వే॥ ౩- ౪౯-౧౨)

పరమ యశస్వి సుమార్గము నందు ప్రేరకుడు, శరీర బలమును వృద్ధి పరచువాడు, జ్ఞానము - బలము - క్రియ ఈ మూడింటిని ప్రకాశవంతము చేయునట్టి పరమాత్ముని స్తుతి ప్రార్థన ఉపాసన మేము చేయుదుము. ఆతని కృపచే ఖర్బుజ పండు (పెద్దదోసపండు) పరిపక్వమై సరియగు సమయమున తీగ నుండి వేరగునట్లు మేము కూడా మృత్యు బంధనము నుండి అట్లే విడిపోదుము గాక! ఆ పరమేశ్వరుడు జన్మ, మృత్యు బంధాల నుండి మమ్ములను తొలగించి అమృతత్వాన్ని - మోక్షానందాన్ని మాకు కలిగించుగాక ! కాని పూర్ణాయువును వదలకుందుము గాక!

---

# యజ్ఞఫలము

అగ్నియందు ప్రాతః కాలము హోమము చేయబడిన ద్రవ్యము సాయంకాల పర్యంతము వాయువును శుద్ధపరచుచు బల, బుద్ధి ఆరోగ్యములను కలిగించును.

అగ్నిహోత్రమును సూర్యోదయము మరియు సూర్యాస్తమయ సమయములలో చేయవలయును. ఎందుకనగా! సూర్యుని ఉష్ణశక్తి, విద్యుచ్ఛక్తి మరియు జీవన శక్తులు హోమ ధూమమును అత్యంత వేగవంతము ప్రభావవంతము చేస్తాయి.

అదే సమయములో భూగోళ విద్యుదయస్కాంత తరంగములు మరియు యోగుల ధ్యాన తరంగములు సమస్థితికి వస్తాయి. అనగా ఒక సెకనునకు "7" తరంగాలు.

౧. అగ్నిహోత్ర వాతావరణం రక్తములోని చక్కెర శాతమును మిక్కిలి తగ్గించును. ౨. రోగ నిరోధక శక్తిని అద్భుతముగ పెంచును. ౩. ౯౧.౪. శాతము రోగక్రిములను నిర్మూలించును. ౪. ఒక వంతు హోమధూమము వెయ్యి వంతుల విషవాయువును శుభ్రపరచును

హోమధూమములోని "పార్మాల్డిహైడ్" ఆవిరులు సూక్ష్మ రోగ క్రిములను ౯౧.౪ శాతము వరకు నిర్మూలించి, మానవ రక్తములోని చక్కెర కణములను తీవ్రముగా తగ్గించును. (డా॥ అరవింద్, డి.మోండ్కర్ (భారతీయులు).

మానవజాతిని అటామిక్ రేడియేషన్ నుంచి రక్షించుటకు ఆవు నెయ్యిలో అన్నింటికి మించిన శక్తి కలదు.

కొన్నాళ్ళ క్రితం సోవియట్ యూనియన్ నుండి వైజ్ఞానికుల ప్రతినిధి వర్గ మొకటి భారత దేశమునకు వచ్చినది. ఆ ప్రతినిధి వర్గ నాయకుడు అప్పటి కేంద్ర రేడియో ప్రసారాల శాఖామాత్యులు శ్రీ కె.కె. షాహతో చర్చించిన సందర్భమున ఆవు నెయ్యితో హవనము చేయుట వలన వాతావరణ కాలుష్యము నివారింపబడునని చెప్పిరి.

"ఆవు పాలలో అటామిక్ రేడియేషన్ నుండి రక్షించు అత్యధిక శక్తి కలదు. ఆవు నెయ్యి అగ్నిపై పోసి పొగవచ్చునటుల జేసినచో (హవనము చేసినచో) వాయు మండలమున అటామిక్ రేడియేషన్ ప్రభావము చాల తగ్గును. ఇంతియే కాదు. ఇండ్ల గోడలకు ఆవు పేడను పూసినచో రేడియేషన్ ఇండ్లలో ప్రవేశించుటను నిరోధించును. ఈ విషయములో మేము పరిశోధనలు జరిపి ఆవు నెయ్యిలో గల మహత్వమును తెలిసి కొంటిమి" అని చెప్పిరి. (యజ్ఞమహత్వ మెరిగిన రష్యన్ వైజ్ఞానికులు). (౧౯౮౧- జనవరి ధర్మాధ్వజం సౌజన్యముతో).

యజ్ఞముచే వాయువు, వృష్టి, జలములు శుద్ధములయి, వృష్టి వలన ప్రపంచమునకు సుఖము కలుగును. అనగా శుద్ధ వాయువు శ్వాస స్పర్శముల చేతను, దానితో గూడిన అన్న పానముల చేతను ఆరోగ్యమలవడి బుద్ధి, బలపరాక్రమములు వర్ధిల్లి ధర్మార్థ కామమోక్షములు పూర్ణముగ ననుష్ఠింపనగును.

యజ్ఞము సుఖము నిచ్చును. శ్రేష్ఠతమ కర్మలొనర్చు వారికి తప్పక సుఖము లభించి తీరును. సుఖమే కాదు మోక్షమును కూడ నొసగును. **"దేవరథో వా ఏష యద్యజ్ఞః"** (ఐతరేయ బ్రాహ్మణము ౨-౩౭) ఈ యజ్ఞము విద్వాంసుల రథము. విద్వాంసులు యజ్ఞరూప రథము నందాసీనులై మోక్షమును బడయుదురు. స్వతంత్ర భావాలతో సర్వతంత్ర స్వతంత్రులుగ నుందురు. బౌద్ధిక దాస్యమునకు లోనుకారు.

అగ్నిలో వేసిన తేజోమయమగు ఆహుతులు సూర్యకిరణముల ద్వారా ఆ యజమానుని రమ్ము రమ్ము అనుచు మధురమైన ప్రియ వాక్కును పల్కువానివలె సత్కరించుచు, మీ సుకృతమున కీ పుణ్య బ్రహ్మ లోకము-మోక్ష పదము ప్రాప్తించుచున్నదని తీసికొని పోవును. బ్రహ్మానందము కలుగును. (ముండ॥ ౧.౨.౬).

**"యజ్ఞ ఇన్ద్రమవర్ధయేత్"** (సామ॥ ౧౨౧) యజ్ఞము- శ్రేష్ఠతమ కార్యము. ఐశ్వర్యమును- ధనధాన్య సంపదను పెంపొందించెను- పెంపొందించును. యజ్ఞాది శ్రేష్ఠతమ కార్యముల వలన ఐశ్వర్యము వర్ధిల్లును.

" యజ" అను ధాతువుతో యజ్ఞ శబ్ద మేర్పడును. యజ ధాతువునకు దేవ పూజ, సంగతి కరణము, దానము నని మూడర్థములు. ధాతువు యొక్క యర్థమును బట్టి చూచిన యజ్ఞ మొక శుభకార్య మని తెలియును.

౧. దేవపూజ = విద్వాంసుల సత్కారము, ౨. సంగతి కరణము= ఉత్తమ పదార్థముల సేకరణము, ౩. దానము = కష్టపడి న్యాయ మార్గమున సంపాదించిన ద్రవ్యము పరుల ప్రయోజనార్థము వినియోగించుట - ఒక వస్తువుపై తనకు గల స్వామిత్వమును పరులకు సంక్రమింప జేయుట - ఇవియే "యజ్ఞ" శబ్దమునకు గల విశేషార్థములు.

అగ్ని యందు నేయి, ఓషధులు ఆహుతిగా నుంచి చేయు యజ్ఞము వలన నపవిత్రమైన వాయు జలాదులు పరిశుద్ధములు, పుష్టికరములు నగును. పరిశుద్ధ వాయువు జలాదులను ఉపయోగించుకొని ప్రాణులు ఆరోగ్యమును పొందును, పరిపుష్టములగును.

## విశ్వకర్మ ధ్వజము




## విశ్వకర్మ ధ్వజ నిర్మాణము

**శ్లో॥ గగనం నీల వర్ణం చ మారుతం ధూమ్ర వర్ణకం**

**పావకో రక్త వర్ణం చ సలిలం శుభ్ర వర్ణకం**

**హరిద్రా వర్ణకం పృథ్వీ పఞ్చ భూతాని ఇతి క్రమాత్॥**

1. ఆకాశము 2. వాయువు. 3. అగ్ని 4. నీరు 5. భూమి

నీలం, గచ్చకాయ, ఎరుపు, తెలుపు, పసుపు

**గమనిక:-** విశ్వకర్మ మహా యజ్ఞమును ప్రారంభించె ముందు ధ్వజమును ప్రతిష్ఠించి ఈ క్రింది ధ్వజ గీతమును పాడి యజ్ఞమును ప్రారంభించ వలయును.

తరువాత ప్రతివారు ఈ ధ్వజమును ఇంటిపైన ప్రతిష్ఠించుకొనుట శ్రేయోదాయకము.

## విశ్వకర్మ ధ్వజ గీతము

విశ్వకర్మ యను విజయ పతాకమ్
విశ్వమంతటన్ ఎగురు పతాకమ్ ॥ విశ్వ॥

సృష్టి స్థితి లయకారకు డతడే
అజరుడు అమరుడు అనంతు డతడు
సుజనుల బ్రోచె శ్రీకర శుభకర
అగణిత మహిమా శ్రీ విశ్వకర్మ॥ విశ్వ॥

మిలమిల మెరిసే రంగులు ఐదు
పంచ భూతముల దీ సంకేతమ్
మిన్నంటిన దీ విజయ పతాక
ఆకస మందున రెపరెప లాడెన్
॥ విశ్వ॥

విశ్వకర్మ విజయోత్సవ ఝండ
విశ్వమానవోన్నతి కిది పునాది
విశ్వశాంతికి పతాక నాంది
సర్వాంతర్గత ఆది అనంతమ్ ॥ విశ్వ॥

అందరి మదిలో విశ్వకర్ముడు
కొందరికే కాదతడు దేవుడు
విశ్వకర్మయే పరమేశ్వరుడు
సర్వలోక హితకారి విభుండు
॥ విశ్వ ॥

విశ్వకర్ముని పతాక నీడ
సర్వజనులకు తోడు నీడ
విశ్వకర్మ దేవుడు తానొకడే
సృష్టికర్త పరిపాలకు డతడే ॥ విశ్వ॥

**మాటలు:** నంచర్ల వేంకట రామాచారి

**కూర్పు:** మంత్రిప్రగడ రఘునాథ శర్మ



# యజ్ఞాంత ప్రార్థన

పూజనీయ ప్రభో హమారే భావ ఉజ్జ్వల కీజియే।
ఛోడదేవే ఛల కపట్ కో మానసిక బల దీజియే॥
వేదకీ బోలే ఋచాయే సత్య కో ధారణ్ కరే।
హర్ష మే హో మగ్నసారే శోకసాగర సే తరే॥
అశ్వమేధాదిక్ రచాయే యజ్ఞ పర ఉపకార కో।
ధర్మమర్యాదా చలాకర్ లాభ్ దే సంసార్ కో॥
నిత్య శ్రద్ధాభక్తి సే యజ్ఞాది హమ్ కరతే రహే।
రోగపీడిత విశ్వ కే సంతాప్ సబ్ హరతే రహే॥
కామనా మిట్‌జాయే మన్ సే పాప అత్యాచార కీ।
భావనాయే పూర్ణహోవే యజ్ఞ సే నరనారి కీ॥
లాభకారీ హో హవన్ హర్ జీవధారీ కే లియే।
వాయుజల సర్వత్ర హో శుభగంధ కో ధారణ్ కియే॥
స్వార్థ భావ్ మిటే మమారే ప్రేమపథ విస్తార హో।
'ఇదన్న మమ' కా సార్థక ప్రత్యేక మే వ్యవహార హో॥ ౬॥
హాథ్ జోడ్ ఝుకాయే మస్తక్ వందనా హమ్ కర్ రహే।
నాథ్ కరుణా రూపకరుణా ఆప్‌కీ సబ్ పర్ రహే॥౭ ॥

# రాష్ట్రగానము

ఓమ్ · ఆ బ్రహ్మన్ బ్రాహ్మణో బ్రహ్మవర్చసీ జాయతామా రాష్ట్రే రాజన్యః శూర ఉ
ఇషవ్యో౽తివ్యాధీ మహారథో జాయతాం దోగ్ధ్రీ ధేనుర్వోఢానడ్వానాశుః సప్తిః
పురన్ధిర్యోషా జిష్ణూ రథేష్ఠాః సభేయో యువాస్య యజమానస్య వీరో జాయతాం

నికామే నికామే నః పర్జన్యో వర్షతు ఫలవత్యో న ఉ ఓషధయః పచ్యం

యోగక్షేమో నః కల్పతామ్॥ (యజు॥ ౨౨-౨౨)

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః

# హారతి

ఓం జయ జగదీశ హరే ప్రభు జయ జగదీశ హరే।

భక్త జనోం కే సంకట క్షణమే దూర్‌కరే ॥ఓం॥

జో ధ్యావే, ఫలపావే దుఃఖ వినశే మన కా।

సుఖ సంపత్ ఘర్ ఆవే, కష్ట మిటే తన కా ॥ఓం॥

మాత పితా తుమ్ మేరే, శరణ, గహూ కిస్‌కీ।

తుమ్ బిన ఔర్ న కోఈ, ఆశ కరూ జిస్‌కీ ॥ఓం॥

తుమ్ పూరణ పరమాత్మ తుమ్ అంతర్యామీ

పరబ్రహ్మ పరమేశ్వర తుమ్ సబ కే స్వామీ ॥ఓం॥

తుమ్ కరుణా కే సాగర్, తుమ్ పాలన్ కర్తా।

మై సేవక్ తుమ్ స్వామీ, కృపా కరో భర్‌తా ॥ఓం॥

తుమ్ హో ఏక అగోచర్ సబ్‌కే ప్రాణపతీ

కిస విధి మిలూ దయామయ్, తుమ్ కో మై కుమతీ॥ఓం॥

దీనబంధు దుఃఖ్ హర్తా, తుమ్ రక్షక మేరే।

కరుణా హస్త బఢావో, శరణ పడా తేరే ॥ఓం॥

విషయ వికార్ మిటావో, పాప్ హరో దేవా।

శ్రద్ధా భక్తి బఢావో, సంతన్ కీ సేవ ॥ఓం॥ జయ జగదీశకీ॥